# 1

**1944** సంవత్సరం, జూలైనెల, పీటర్ క్వింటో మొదటి పోలిష్ మండలానికి రాజకీయవిద్యాధికారి పదవిలోవున్నాడు. అతను చెట్లవరుసల నీడలో పచారు చేస్తున్నాడు. అలా కొంత దూరం వెళ్ళి చెట్లవరుస ఆగిపోయినచోట అతనుకూడా ఆగిపోయాడు. నేలమీది పచ్చిక సూర్యకాంతిలో మిలమిల మెరుస్తోంది. ఒక చెట్టు మొదట్లో ఎర్రటి పురుగులుకొన్ని ప్రేమపాశంలో మునిగి తేలుతున్నాయి. పీటర్ వాటిని కొద్దిసేపు పరికించి, తరువాత లోయవంక చూచాడు. కనుచూపుమేరంతా కదలికతో ఉడికిపోతోంది. నదికి యిరుప్రక్కలా కొండల నానుకునివున్న రోడ్ల మీద మనుష్యులు బారులు తీరివున్నారు. వాహనాలు కిటకిటలాడుతూ వున్నాయి. మిలటరీ లారీలు బరబర వెడుతున్నాయి. నేల ఎత్తుపల్లాలుగా వుండటమూలాన లారీలలోని తుపాకులు పైకీకిందికీ కుదుపుడు అవుతున్నాయి. యూనిఫారం ధరించిన సిపాయిలు ఎక్కిన లారీలు, సందుగొందులలో తిరుగాడుతున్న జీపులు, రోడ్ల వెంట వెడుతున్న కాల్బలము, రొదపెడుతున్న యింజన్లు, ఆకాశమంత పైకి లేస్తున్న దుమ్ము, కేకలు, పెడబొబ్బలు... వీటితో ఆ వాతావరణమంతా గగ్గోలుగావుంది.

పాతకాలపు చెట్లనీడల్లో తిరిగి నడవటం ఆరంభించాడు. ఇంటిముందు ఆవరణలో కొందరు సైనికులు పందులవేటలో మునిగివున్నారు. మరికొందరు రైఫిల్స్ శుభ్రం చేసుకుంటున్నారు. బద్ధకస్తులు కొందరు గడ్డిమీద పడుకుని, పరకలు

నములుతున్నారు. బహుశ బాగుచేస్తూవుండిన గౌడ్స్పీకరు నుంచి వింతధ్వనులు, వికారధ్వనులు వినవస్తున్నాయి. పీటర్ యింటిగుమ్మం దాటి లోనికి నడిచాడు. సందుతిరిగి వంటింటి పక్కగా నడుస్తున్నాడు. వంటగదిలో సైనికులు, ఆహారపదార్థాలు పెట్టెలలోనుంచి తీస్తున్న చప్పుళ్లు వినవస్తున్నాయి. పెరటి గుమ్మంలోనించి పీటర్ యింటిలోపలకు వెళ్ళాడు. నేల మీాద నడుస్తూవుంటే పెద్దచప్పుడు అవుతోంది. పీటర్ తలుపు తట్టాడు. అనుకోకుండానే రెండోచేతితో నల్లటి చెక్కబొమ్మను కూడా తట్టాడు. జర్మనులకాలంలో యీసంస్థానం ఒకకమీషను యాజమాయిషీలో వుండేది. వాళ్లు యజమానులందరినీ పారదోలారు. ఒక్క స్త్రీమట్టుకే యిక్కడ వుండటానికి అనుమతించబడింది. పీటర్ యింకా ఆమెను చూడలేదు. ఆమె కనబడనేలేదు. తలుపువెనుక అంతా నిశ్శబ్దంగావుంది. పీటర్ తిరిగి తట్టాడు. జోళ్లువేసుకున్న పాదాలధ్వని వినిపించింది. తిరిగి నిశ్శబ్దం. మూడోసారి తలుపు తట్టినమీాదట తాళం తెరుస్తున్న సవ్వడిఅయి, తలుపు తెరుచుకుంది.

ఒకక్షణంపాటు గుమ్మం యివతల నిలుచున్న పీటర్ ఆవతలవున్న స్త్రీ పరస్పరం ఎగాదిగా చూచుకున్నారు. ఆమె ఎర్రనిపువ్వులు అద్దకంవేసిన జుబ్బాధరించింది. క్షణమాత్రం ఆమె పెదవులు భయంతో మెలితిరిగాయి. కాని ఎలాగో ప్రయత్నించి నవ్వగలిగింది కాని ఆ నవ్వులోమటుకు ముఖంలోని భావం పూడిపోలేదు. ఆమె కళ్ళల్లో 'నిజమైన బోల్షివిక్కు! నాముందు నిలబడివున్నాడు. ఏం కావాలి యితనికి?' అనే భావం కనిపిస్తోంది! నోరు తెరిచేముందు పీటర్‌కు గతించిన

అయిదు సంవత్సరాల స్మృతులు భారంగా మనస్సులో మెది లాయి. జాలి, ఏహ్యాం ఒకేమారు కలిగాయి. అతనిలో ఒక వికారం బయలుదేరింది. అది కోపమో కాదో అతను చెప్ప లేడు. ఈ కోపం ఎందుకోకూడా అతనికిస్పష్టంగా తెలియలేదు. ఇకముందు తన స్వదేశంలోనే, యిలా తను అణచుకొన్న కోపం ప్రదర్శించవలసి వస్తుందని గుర్తించాడు. గతించాయని భావించిన పరిస్థితులు తిరిగి యథాతథంగా ముందు నిలిచా యనుకున్నాడు.

"మిమ్మల్ని శ్రమపెడుతున్నాను. క్షమించండి. ఇక్కడ ఎక్కడో ఒక గ్రంథాలయం వున్నట్లు చెప్పారు. దయచేసి అది యెక్కడో చూపగలరా? - అక్కడ ఓ పుస్తకం తీసు కుందామనుకుంటున్నాను."

ఆమె బలవంతంగా మందహాసం చేసింది. ఆ నవ్వు తెచ్చిపెట్టుకొన్నదని స్పష్టంగా తెలుస్తూంది.

"తప్పకుండా అలాగే చూపిస్తాను. దానికేంభాగ్యం ? కాని......యీ గ్రంథాలయంలో కేవలం ఫ్రెంచిపుస్తకాలు మాత్రమే వుంటాయి, పోలిష్‌గ్రంథాలుకానీ - రష్యాగ్రంథాలు కానీ మచ్చుకైనా లేవు - ఒక్కటి కూడా లేదు!"

"దానికేం ఫరవాలేదు. గ్రంథాలయం ఒకమారు - వీలుగావుంటే - చూదామనివుంది. అంతే!"

అతను ఆమెను అనుసరించి లోనికివెళ్ళాడు. గది పాత కంపుకొడుతోంది. గోడలకు పురాతన వేషధారుల చిత్ర పటాలు వేలాడుతున్నాయి. ఆమె మరోతలుపు తెరిచి ఆగది

చూపించి. అంతా చీకటి. పెద్ద పెద్ద పుస్తకాల బీరువాలు మసగ్గా కనిపించాయి. ఆ బీరువాల తలుపులకు సాలెగూళ్ళు పట్టివున్నాయి. దుమ్ము ధూళి అంతు లేకుండా పేరుకు వుంది. పీటర్ మొదటి బీరువాను తెరవటానికి ప్రయత్నం చేశాడు. లాభం లేకపోయింది. తాళం చెవికోసం అడిగితే లేదని జవాబు వచ్చింది. రెండవ బీరువా తలుపులు కీచుమని చప్పుడుచేస్తూ తెరుచుకున్నాయి. దాని తాళం తుప్పుపట్టి లివర్లన్నీ యేమాత్రం పనిచేయకుండావుండి వుండాలి! పీటర్ పుస్తకాల వరుసను ఒకసారి ఆహ్లాదంగా నిమిరాడు. గిల్టు అక్షరాలు చెక్కిన ఎర్రని బైండ్లు! ఈ దృశ్యం అతనికి తన బాల్యాన్ని గుర్తుకు తెచ్చింది. ఆ చిన్నతనంలో పీటర్ తాత గారి యింట వుండిన పుస్తకభాండాగారంలో గంటల తరబడి గడుపుతూవుండేవాడు. ఆఖరుకు తన శరీరస్పర్శకు కుర్చీకూడా వేడెక్కిపోయేది. ఆఫ్రికా దేశ పర్యటనల వివరణాలూ, నీగ్రోలు నగ్నులై బల్లాలు పుచ్చుకు నించున్న బొమ్మలు...యివంటే అతనికి చాలా ఉల్లాసంగా వుండేది! అతనొక కుర్చీలో జార గిలబడి పుస్తకాలు తిరగవేస్తూవుండటం ఆమె గమనిస్తూ యెదురుగా నిలబడివుంది. ఆమె తనను పరిశీలిస్తూవుండటం అతనికి చికాకు అనిపించింది. అతని ఆనందమంతా అణగినట్లయింది. పాతకాలపు సంఘటనల స్మృతులు మరుపుకు రాసాగాయి.

బహుశ యీ గ్రంథాలయాన్ని కైవశంచేసుకోటానికే తాను వచ్చాననుకుంటున్నదేమో యీామె! ఒకసారి తన చేతిలో పుస్తకంవంక చూచి కిందికి దూకాడు.

"ఈ పుస్తకం నేను తీసుకువెడతాను! మేం యిక్కడి నించి వెళ్ళిపోయేలోగ వాపసు చేస్తాను" అంటూ అతను బయటకు నడిచాడు. అతను తలుపుదాటి వెళ్ళేవరకు ఆమె ప్రత్యేకించి చూస్తూ నేవుంది. అతను గబాలున వెనక్కు తిరిగి యే గడియారమో లేక డబ్బో అడగకుండా వుంటాడా అని ఆమె భావన!

అతను పార్కు చివర చెట్టుకు వీపుఆనించి కూర్చు న్నాడు. వాహనాల రద్దీవల్ల కాలినడకలవల్ల రోడ్డుమీద చెల రేగిన దుమ్ము పైకిపోయి ఎర్రని సూర్యునికి ఆచ్ఛాదనగా రూపొందుతోంది. ఈదుమ్ము చెట్లఆకులమీద తెల్లగా స్థావ రించుకుంటోంది. వాతావరణం హాయిగావుడిగా వుంది. పీటర్ పరికించిచూడగా దూరాన ఒక సైనికులలారీ అగుపడింది. బరు వుకు అటుయిటు ఒరుగుతూ గ్రామంలో ఒక సందుగులుపు దగ్గర ఆగింది. దానిచుట్టూ మనుషులు పోగయ్యారు. వాళ్ళ సరదా ఎంతవరకు తీరుతోందో వాళ్ళు కొద్దిసేపయినావిరామం సంపాయించి ఎలా సరదాలు తీర్చుకుంటున్నారో - అనుకు న్నాడు పీటర్.

పుస్తకంలో చిత్రకారుని కల్పనప్రకారం పారిస్‌నగరం గడ్డకట్టుకుపోయినట్లుంది. పొడుగైన జుబ్బాలతో శాస్త్రకారులు, ఎవరెవరో విద్యార్థుల గదితలుపులు తట్టటం; బిగుతైన ట్రౌజర్లు, పొడుగైన కోట్లుధరించిన విద్యార్థులు కాళ్ళు బారజాపుకుని తమతమ పుస్తకాలలో కూరుకుపోయివుండటం, పర్యాటకాల సుందరాంగులు తమ పిసినారిభర్తల కళ్లుమూయటానికి ఎత్తులు

వేస్తూవుండటం...యివన్నీ చిత్రకారుడు విచిత్రంగా విశదీక రిస్తున్నాడు. 1939 ముందు తాను నివశించిన పారిస్‌నగర మంతా నిజంకానట్లుగా అనిపించింది పీటర్‌కు. అందుచేతనే ఇవాన్‌తో పారిస్‌నుగురించి ఎన్నడూ మాట్లాడలేకపోయినాడు కావును! యూరల్ పర్వతప్రాంతాలలో తాము యిద్దరూ వడ్రంగంపని చేసేవాళ్ళు. ఇవాన్ కార్పాథియన్ జాతీయుడు. అతనికి చదువు రాదు. అత నెప్పుడూ మహానగరాలను చూచి ఎరుగడు. రాత్రిళ్ళు యిద్దరూ బల్లచెక్కలమీద పడుకుని తీరుబడిగా కబుర్లుచెప్పుకునేటప్పుడు యేవేవో ప్రశ్నలు వేస్తూ వుండేవాడు. అన్నింటికీ చిట్టిపొట్టిజవాబులు కావాలనేవాడు. అక్కడి తనఉనికిని మరిచిపోవాలని పీటర్‌సంకల్పం. ఆ రోజులు తన చరిత్రలో, తన జీవితంలో భాగంకాకూడదని అతనివాంఛ! పారిస్‌తో తన కేమీ సంబంధంలేదు! తన జీవితంలో అదొక జరగని భాగం! కొత్తజీవితం పాతరోజులను పాతరవేసేయాలి!

ఆ రోజులు అతినికృష్టంగా గడిచాయి. అందుకనే వాటిని తుడిచివేయాలి. కాని దానంతటదే ప్రతితడవ గుర్తు వస్తోంది. హెర్క్యులానియమ్, పాంపెలపౌరుడు అయినందుకు తనకు తప్పనిసరిగా ప్రాప్తించిన శిక్షయిది! తనచుట్టూ అనేక మంది అసువులు కోల్పోయారు. ఎన్నెన్నో జ్ఞాపకాలు. నోరు మూసుకుని నిశ్శబ్దంగావుండటం అలవరుచుకున్నాడు. ఇంతకూ, చెప్పవలసిందంటూ ఏమీలేదు. పరిస్థితులన్నీ యెక్కడి వక్కడే వున్నాయి. పగ న్యాయంలో ఒకభాగం అయింది!

ఇప్పుడు, లావాలాగ, విజృంభించిన ప్రకృతిశక్తిలాగ, ఎర్రసైన్యం ముందడుగువేస్తోంది. ఈ పురోగతిలో భాగంగా,

తాను, చాలామంది జనంలో కలిగించిన భీభత్సాన్ని గందర గోళాన్ని అర్థంచేసుకుంటున్నాడు. అర్థంచేసుకోవడంతో సరిపో తుందా? ఇప్పుడు తను చూచిన స్త్రీ లాంటివాళ్లు ఎందరో వున్నారు. అందరూ అదే విధంగా భయోత్పాతంలో వున్నారు. తను బంగారాలు తగులపెడతారు, తాము పారి పోవాలనుకుంటారు. తమ ధనధాన్యాలు దాచుకోవాలనుకుం టారు, తమ అసహాయ్యాన్ని, దేహ్యాభావాన్ని దాచుకోటానికి లేనిపోని నవ్వు తెచ్చుకుంటారు. భూమికి భారం ఎక్కువయి పోతోంది. సైనికుల డేరాలతో, రక్తవాహినులతో, ప్రాణ వాక్రందనలతో, చితాభస్మంతో – యీ భూమి అణిగి పోయేట్లుగా వుంది.

పక్క గ్రామంనుంచి ఆయుధాలు ప్రయోగిస్తున్న శబ్దం వినవస్తోంది. దూరంగా, దిక్చక్రప్రాంతాన మహోజ్వలమయిన మంటలు కనిపిస్తున్నాయి. పీటర్ చేయిపైకెత్తి వేళ్ళు కదిపాడు. ఈ సంవత్సరం, మాసం, రోజు – గంట – యివే అతనికి అమిత ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నాయి.

## 2

గడచిన కొన్నిమాసాలుగా పీటర్ వుంటున్న మండలం పశ్చిమంగా ప్రయాణం చేస్తోంది. కొత్తగా ఆక్రమించుకో వలసిన దేశాల పరిస్థితులు అవగాహన చేసుకుంటోంది. పీటర్ మటుకు 'వింటర్' శీర్షాన్ని గురించే పరిశీలిస్తున్నాడు. ఆ తలకా యలో ప్రతి ముడుత, ప్రతిచార అతనికి కంఠస్థంగా వచ్చేసి నాయి. పెద్దపుర్రె, బట్టతల, పిడతముఖం, సన్నటిపెదిమలు,

చట్టీముక్కు, నల్లటి చిన్నికళ్లు, కోతిచూపు – యిదీ ఆవాలకం! ఈ ఆదివారం ఉదయం, పీటర్ ఆముఖాన్ని తన మనస్సులో ఊహించుకున్నాడు. వింటర్ దవడలు కాఫీలో ముంచిన రొట్టె ముక్కలు నములుతున్నాయి. బల్లమీదపడిన కాఫీచుక్కల చుట్టూ యీగలు ముసురుతున్నాయి. ఎప్పుడో ఒకప్పుడు యీయుద్ధం అంతమవుతుంది. అప్పుడు యిక పీటర్ వింటర్ ముఖం చూడనక్కరలేకుండా సరిపోతుంది. పీటరుకు అతని ముఖం అనుదినం చూస్తూవుండటం, తనకు యిష్టంలేని ప్రకృతి పరిణామానికి తలవొంచటం వంటిదే! ఈగొడవంతా ఎలా ఆరంభమయిందో ఆలోచించటం మొదలుపెడితే అతని బుర్ర మరింత గందరగోళంగా తయారవుతుంది.

ఈ దూరప్రాంతంలో, పీటర్ అరెస్టుకావటానికి యూరల్ ప్రాంతాల ప్రయాణంచేయవలసి రావటానికి ప్రధాన కారణం వింటర్! పీటర్, వింటర్ – యిద్దరూ ఒకరినొకరు బాగానే ఎరుగుదురు. 1939లో పీటర్ తూర్పుశాఖలో తను యేమిచేయవలసిందీ తోచనంత అయోమయంలో పడి పోయాడు. రుమేనియా సరిహద్దుమార్గాన పారిపోదామనుకు న్నాడు. కాని అది కారణాంతరాలవల్ల సాధ్యపడలేదు. తిరిగి పోలిష్ ప్రజలకు అధికారం హస్తగతం అవుతుందనుకోవటం కలలోనిమాట. అటువంటి విషయాలు ఎప్పుడూ చరిత్రలో తటస్థపడవు. పీటర్ తాను యేంచేస్తున్నాడోకూడా తెలియ కుండా వారంరోజులపాటు రోడ్ల వెంట తిరిగాడు. నిస్పృహా, భయంతప్ప యింకేమీలేవు. ఇంతేకాక యీ పరిస్థితులకు సిగ్గు. ఫ్రెంచి కవనం గురించి వ్యాఖ్యానాలు వ్రాయటానికి

తానెవ్వరు ? ప్రపంచమంతా కల్లోలితం అవుతూ వుండగా తాను కులాసాగా యే వార్సాలోనో మరెక్కడో గడపవలసిన వాడుకదా ! పారిపోవటమూ, అందులోనూ యిటువంటి మనుష్యులతో ! అయినప్పటికీ అతను సోవియట్ ప్రాంత వాతావరణంలో సుఖపడలేక పోయినాడు. చివరకు సరిహద్దుదాటి, యీ ప్రాంతంనుంచి పారిపోయి నాజీ రాజ్యంలో ప్రవేశించుదామనుకున్నాడు. కారణాలు అతనికే స్పష్టంగా తెలియవు. తనను తానే సంస్కరించుకుందామనుకున్నాడు. విరామ సమయంలో కులాసాగా గడుపుదామనుకున్నాడు.

సరిగా తాను యీ నిశ్చయానికి వచ్చినప్పుడే, తనను అరెస్టుచేశారు. ఒక సుప్రభాతాన అనుకున్న విధంగానే యీ వార్త పిడుగులా వచ్చి తనను శోకాంబుధిలో ముంచివేసింది. కొన్ని వారాలు గడచిన మీదట తన విచారణ పూర్తి అయి, శిక్ష విధించారు: విప్లవ వ్యతిరేక చర్యలకుగాను అయిదు సంవత్సరాల శిక్ష ! తన వ్యాఖ్యాతని సెకె వింటర్ జయించాడు, తుదకు యుద్ధానికి పూర్వం అతను కమ్యూనిస్టు ముద్రకెంప కొన్నాళ్లు కారాగారవాసం చేశాడు. అతను కూడా రష్యన్లంటే భయపడుతూనే వుండేవాడు. నిజానికి, తనమీద నిందతీసుకువచ్చిన వ్యాసం వ్రాసింది పీటరే! ఆ వ్యాసంలో అతను కమ్యూనిస్టు కవుల ఆత్మవంచనను గురించి యిష్టంవచ్చినట్టు వ్రాశాడు. మూకవుమ్మడిగా ఖైదీలనందరినీ విడుదలచేయటం కారణంగా కాని, లేకపోయినట్లయితే వింటర్ తను ప్రాణాలనుసైతం తీసుకునేవాడు. పీటర్ ఆసియానుంచి తిరిగివచ్చి, అంతకు ముందే అక్కడ సిద్ధంగావున్న వింటర్‌ను చూచాడు. గత

మంతా మరచిపోవలసివచ్చింది. ఇద్దరూ స్నేహపూర్వకంగా కరచాలనం చేశారు. వింటర్ చిన్నికళ్లు నిటారుగా క్రూరంగా వున్నాయి.

తలిమ్మార్మె బల్లలదగ్గర, మాసిపోయిన దుస్తులు ధరించిన వ్యక్తులు కొందరు ఫలహారాలు చేస్తున్నారు. సిగరెట్ల పొగతో గది అంతా నిండిపోయింది. కిటికీగుండా ప్రభాతసూర్యుని వెలుగు ప్రసరిస్తోంది. సిపాయిలు యీలలు అరుపులు జోరుగా వినిపిస్తున్నాయి. వింటర్ మూలితుడుచుకొన్నాడు. గడియారం వంక చూచుకున్నాడు; కోటు సరిచేసుకున్నాడు.

"ఇక వెడదామా?" అన్నాడు.

"ప్రీస్టు మనతో బయలు దేరడు, ఆతని కంతా తెలుసు!"

"ఫరవాలేదు, మనం కచ్చితమైన మనుషులమని అతనికి తెలియాలి!"

పటాలం పార్కుగేటు దాటుతోంది గేటుతలుపులు పాత బడి తుప్పుపట్టి వున్నాయి. రోడ్డు కొండవాలుగా వెడుతోంది రోడ్డుమీదిదుమ్ము సైనికులబూట్లమీాద స్థావరించుకుంటూంది. పీటర్ చిన్నిచిన్ని గుడిసెలవంక చూచాడు. తన స్వదేశం ఎంతసుందరమయినది! చిన్నచిన్న పరిమాణాలలో, పొలాలు, ఉద్యానవనాలు, ఆవరణలు వుంటాయి. ఒక్కొరైతుకు ఒక్కొక్కగుఱ్ఱమే వుంటుంది. వృద్ధస్త్రీలు ఆవులనుమేపుతూ వుంటారు, పల్లెటూరి సత్రాలు, చిన్నచిన్న దుకాణాలు, కంచెలకు ఆనుకుని కూర్చునే యిరుగుపొరుగువారు, బాతులను తోలే బాలికలు...అంతా అమాయకంగా వుంటుంది తన

దేశం! యాంత్రికమయమైన యుద్ధాలు, రాజకీయ విజ్ఞతలను నిరూపించే పుస్తకాలు-యివేవీ తెలియనివారు ఇక్కడి ప్రజలు.

సైనికపటాలం జానపదగీతాలు పాడుతోంది. ప్రజలు బారులుతీరి వీధులప్రక్క నిలుచుని యూనిఫారాలుధరించి కదంతొక్కుతూ పదంపాడుతూ వెడుతున్న పటాలాన్ని నోరు తెరుచుకుని వాళ్ళంతా కళ్ళుచేసుకుని చూస్తున్నారు. సోవియట్ సైనికులు యేమాత్రం నవ్వుముఖాలు లేకుండా తమ స్థానాలలో బిగుసుకు కూర్చుని నడుస్తున్న సైనికులను చూస్తున్నారు. రైతులు యేమనుకుంటారు? వారి భూములన్నీ రుహారులో తయారయిన టాంకులచేత నాశనం చేయబడినాయి. వారిచుట్టూ ప్రళయం పెనవేసుకువున్నది. తల్లినీ పిల్లనీ బలవంతాన వేరుచేస్తున్నారు. చివరకు, యూరల్ ప్రాంతాలలో కూడా టాంకులు తయారవుతున్నాయి. అంతా వాళ్ళకు బయటనుంచే వస్తోంది - శిక్ష, కల్లోలం, తుపాను జాడలు; వీటికి కేంద్రం ఎక్కడో తమకు తెలియని దేశంలో తమకు తెలియని ప్రజల బుర్రలలోవుంది!

చిన్న చర్చిముందు వచ్చని మైదానంలో ఆడవాళ్ళ రంగుచేతిరుమాలలు, మగవాళ్ళ నల్లటి టోపీలు కలగాపులగం అవుతున్నాయి. ఆకులతోరణాలు, పూలమాలలు గుమ్మాలకు వేలాడుతున్నాయి. సిపాయిలలో మొదటివరుస లోనికి వెళ్ళారు. పీటెర్ తల పక్కకుతిప్పి గుమ్మందగ్గరే నిలబడ్డ వాళ్ళవంక చూచాడు. సైనికులగుంపు- ముడుతలుపడ్డ రైతులు! తనలాగే యీ సైనికులు కూడా ఒకప్పుడు ఆసియాకు పంపబడ్డారు. ఆర్కిటిక్ సముద్రతీరాన వున్న విడుదులలో ఆకలికి

నకనకలాడివచ్చారు. వాళ్ళకూ అక్కడిగోడవలన్నీ తెలుసు. తాము మతసంబంధమైన కార్యకలాపంలో పాల్గొంటున్నామనీ విధివిలసితమైన రష్యన్ ఆజ్ఞలకు కట్టుబడి వున్నామని యెరుగు దురా? ఏమయినప్పటికీ వాళ్ళు సుఖంగా వున్నారు. విశాల మయిన ఖండాన్ని చుట్టివచ్చినతర్వాత తిరిగి స్వదేశంలో అడుగు పెడుతున్నారు. తమ బాల్యంలో మాదిరిగానే యిక్కడి గాలిని సువాసనలను పీల్చగలుగుతున్నారు.

కుర్రవాళ్లు గంటలు మ్రోగిస్తున్నారు. బూరలచప్పుడు, మతాచార్యుడి మంత్రాలు, వృద్ధస్త్రీలు ప్రార్థనపుస్తకాలమీద వేస్తున్న చిటికెలు వినవస్తున్నాయి. పీటర్ సోవియట్ యోధుల సమాధులను గుర్తుకు తెచ్చుకున్నాడు, నోల్గావిస్టులాల మధ్య యిటువంటి సమాధులు వేలసంఖ్యమీద వున్నాయి. వాటి మీద కొయ్యపిరమిడ్లు, ఎర్రనక్షత్రాలు వేసివున్నాయి ఈ చిహ్నాంచూస్తే యెందుకంత విచారం యేర్పడుతుందో అతనికి తెలియదు. అది బహుశ ఊహామాత్రం కావచ్చు.

బహుశ తనుకూడా అందరూ ఆలోచించినట్లే ఆలో చించుకుంటున్నాడేమో ననుకున్నాడు. తనకు రోజులుకానివి దాపురించాయి. తన వద్దతేమారిపోయింది. తనుకూడా అందరి వంటివాడే కాని అధికంకాదు. అందుచేత తను అందరికంటే ఎక్కువకోరుకోరాదు. తను వెంటనే యేదో న్యాకన్యాయ మార్గంకనిపెట్టాలి. తనలోవుండవలసిన లక్షణాలను మటుకే వుంచుకుని తలిమ్మావాటిని విసర్జించాలి. తన కోపాన్ని సరిగ్గా ఉపయోగించుకోవాలి. నిశ్శబ్దంనుంచే వచ్చే బలంవంటిది తనలో కనిపెట్టాలి!

వింటర్ అతని పక్కనే నిలబడ్డాడు. అతడు తలవంచుకుని వున్నాడు. వార్సా ప్రాంతాలవుండే ఒక యూదుని కుమారుడు అతను. మతంకూడా ఒక రాజకీయ ఆయుధంగా పనికివస్తుందని యింకా వాళ్ళు గ్రహించలేదు. ఇంత కోపంలో కూడా పీటర్‌కు వింటర్ అంటే సానుభూతివుంది. ఎందుకంటే అతని రహస్యమైన బాధలు భయాలు యితనికి తెలుసు. వింటర్ ఎప్పటికీ తన తలిదండ్రులను చూడలేదు. బహుశ పీటర్ తల్లి కూడ యీసరికి జీవిస్తూవుండకపోవచ్చును. కాని వింటర్ కళ్ళముందు వున్నదంతా నిరాశ, నిస్పృహ, బూడిద తప్ప ఒక్క ఆశాకిరణం కూడా లేదు. ఇంతేకాక తనబిడ్డ చనిపోవటం అతనికి మరొక ప్రధాన ఖేదకారణం. ఈమధ్య తను వింటున్న మాటలనుబట్టి ఆలోచిస్తే, వింటర్‌కు తాను ఆసాబాద్‌లో గడిపిన సంవత్సరం పీటర్ జైలులో బందీగా వున్న కొద్దినెలలకంటే బహునికృష్టంగా వుండినట్లు తోస్తుంది. బిడ్డ కళ్ళకెదురుగా ప్రాణాలు కోల్పోతున్నప్పటికీ వింటర్ యేమీ చేయలేకపోయాడు. ఎంత అసందిగ్ధ పరిస్థితి కయినా నిస్సత్తువతో లొంగిపోవలసి వచ్చింది. ఎన్నో రోగాలు రొష్టుల పాలయ్యాడు. ఒకవిధంగా ఆలోచిస్తే వింటర్ కంటే తానే అనేక రకాల సుఖమయిన జీవితం గడిపాడు. ఇది కేవలం భ్రమే అయినప్పటికీ అతని అయిష్టాన్ని తగ్గించటానికి మటుకు పనికివచ్చింది. ఈ బాధ అంతా వింటర్ ఎన్నటికీ కనబడకుండా పోయేంతవరకే! ఈ క్షణంలో అతను వింటర్‌తో కరచాలనంచేసి అతనియెడ సోదరభావం విస్తరింపజేయటానికి కూడా సంసిద్ధుడై వున్నాడు.

వాళ్లు వెలుతురువైపు వెళ్ళారు. సోవియట్ సైనికులు గోడలమీద కూర్చుని తేరిపారజూస్తున్నారు. పోలిస్‌వాళ్లు జనంతో కలిసిపోయి కేరింతాలు కొడుతున్నారు. ఉన్నట్టుండి పీటర్ ఒక కేకవిన్నాడు. ఈ కేక ఎక్కడినుంచి వచ్చిందో గమనించగలిగేలోపునే యేదో బరువైన వెచ్చనిపదార్థం అతని పాదాలవద్ద ముద్దగాపడి పైకిలేచి అతన్ని కౌగలించుకుంది. ఆమె శాలువ తలమీదనుంచి వెనక్కుజారి జుత్తు బయట పడింది. ఆమె దీనాతిదీనమైన దృక్కులతో నీరసంగా యిలా అంది: 'జీసస్ ! ఓ జీసస్ ! వాళ్లు అతన్ని తీసుకుపోతున్నారు. నాకు సహాయంచేయి ప్రభూ ! వాళ్లు నా ప్రియపుత్రుడిని ఎత్తుకుపోతున్నారు !' ఆమె పీటర్ దుస్తులకు పెనవేసుకుంది ! 'అయ్యా ! మీరు పోల్ జాతీయులు; యిదెలాసాధ్యం ? అతనెంతో అమాయకుడు. జర్మనులతో పోరాడుకదా !' అంది. పీటర్ ఆమె చేతులు విదిలించుకున్నాడు. 'నాకు సహాయం చేయండి. అయ్యల్లారా ! నన్ను రక్షించండి. వాళ్ళు నా కుమారుణ్ని ఎత్తుకుపోతున్నారు. వాడు యేం పాపంచేశాడు? ఎందుకట్లా ఎత్తుకుపోతున్నారు ?' పీటర్ చుట్టూ తన మనుషులు పోగవుతున్నారు. వాళ్లు కళ్లు కిందికి దించుకున్నారు. వాళ్ళ నోళ్ళు నొక్కుకుపోయాయి. 'నేనేం చేయను. యిది మా వ్యవహారంకాదు!' వింటర్ అతని ప్రక్కనే ప్రత్యక్షమయ్యాడు. 'ఏడవకమ్మా ! ఇది యుద్ధం ! సైనిక పటాలం యిక్కడికి వచ్చింది. వాళ్ళు మీవాడిని తనిఖీచేసి వదిలేస్తారు!' అన్నాడు. సైనికులకు వరుసగా నిలబడమని ఆజ్ఞయిచ్చాడు. తరువాత పీటర్‌తో యిలా అన్నాడు : 'యిదంతా పెద్ద గందరగోళం.

మనమేం చేయలేం. జిల్లాఅంతా శోధిస్తున్నారు. నిజానికి, యీప్రాంతపు యువకులందరూ కూడా కేంద్రసైన్యంలో పని చేసినవాళ్ళే! అంచేత యేమీ – ప్రయోజనంలేదు!'

## 3

"నెమ్మది – నెమ్మది! మాకు మాటలంటేనే ఎంతో ప్రమాదకరమైనవి. మనం వేరే యేదో భాష నేర్చుకోవాలి. ఏదేనా కథ చెప్పాలన్నా చాలా కష్టమే. ఆసంగతి మీకే తెలుసు. అదీకాక, నా అసహ్యాన్ని దాచుకోటం నా ఉద్దేశ్యం కాదు!"

—ఈ మాట్లాడుతున్నది జులియన్. అతన్ని ఎదురుగా వుంచుకోవటం అంటే – యేదేనా చరిత్ర పుటలలోంచి పునరుజ్జీవం పొందిన పాత్రను ఎదురుగా వుంచుకోవటమే, అనుకున్నాడు పీటర్. జులియన్ కళ్ళలో ఒకరకమైన వింతనవ్వు ద్యోతకమవుతోంది.

యూదులపేటనుంచి యింతకంటే ముందుగానే బయటకు రాగలిగేవాడిని! కాని మైకేల్ నన్ను తనస్థానంలో తీసుకుందా మనుకున్నాడు. మైకేల్ బాగా వున్నవాడు. పిండి వ్యాపారం చేస్తున్నాడు. కాని అతని ఆత్మమట్టుకు కొద్దిగా పంకిలమయింది. అతను చాల భయస్థుడు. అతనిభార్య అంతకన్నా భయస్థురాలు. అతనికోసమే ఆ భయమంతా. ఆ నికృష్టుడు టామ్ నన్ను ఉపన్యాసపదవినించి దింపేసి ఎవరో యూదుడికి అవకాశం కలిగించ జూచినప్పుడు కొందరందుకు అభ్యంతరం తెలిపారు. ఒక రకమయిన పిరికితనానికి, మరోరక

మైన పిరికితనానికి సంఘర్షణ – యిదే సిగ్గుచేటు. అందుచేత నేను అక్కడవుండిపోవటమే యోగ్యం అనుకున్నాను.

"అయితే మనుష్యులకు అసలు పిరికితనం అనేదే వుండ కూడ దంటావా?"

"అవును. నేనుకోరేదే అది! యూదులపేటలో నే నేదో పాఠాలు చెప్పుకుంటూ జీవితంవెళ్ళబోస్తున్నాను. యువకు లంతా చదువుకుంటున్నారు జనం అన్ని భాషలు నేర్చుకోవటం నే నెన్నడూ ఎరగను–ఇంగ్లీషు, ఫ్రెంచి, స్పానిష్, హీబ్రూ; లాటిన్–గ్రీక్ కూడా! ఎన్నో వాడుకలు ఎంతో వ్యాకరణం ఆకాశంలోకి ఎగిరిపోయినాయి. యూదులపేటలో ఎవరుగ్గానీ సజీవంగా వుండగలగటానికి అదొక ఆధారం! వ్యాకరణం గుర్తుంచుకుంటున్న వ్యక్తి ఎవరుగానీ తనకు ఆశలేదని ఎందు కనుకుంటాడు ?

జులియన్ బల్లమీాద చేతులుఆన్చి నిలబడ్డాడు. అతని నల్లకోటు దుమ్ముతో నిగనిగలాడుతోంది. దానికింద మిలటరీ సోవియట్ జుబ్బాధరించాడు. అతని ముఖంమీాదికి వొత్తుగా జుట్టుపడుతుంది.

"ఏమయినప్పటికీ నా శరీరాన్ని కాపాడుకోవాలను కున్నాను. 1942 లో అంతా స్పష్టంగావుంది. ప్రతిరోజూ నగరంలో పనిచేసివచ్చే జట్టులోవుండేవాడిని. మే మొక కార్య క్రమం తయారుచేసుకున్నాం. ఒకసాయంకాలం, డ్రైవరుకు లంచం యిచ్చి తిరిగి యూదుపేటకు తీసుకువెళ్ళటానికి మారుగా స్వేచ్ఛావాయువులు వీచే పొలాలవైపు తోలుకు వెళ్ళమన్నాం. నాలుగు ట్రక్కులు. అది సెప్టెంబరు నెల.

యూదుబానిస ఎంత అపలక్షణంగా వుంటాడో వివారు యెరుగరు. బుజాన రెండు కాన్వాస్ సంచులు తగిలించుకుంటాడు. ఆ సంచుల్లోనే అతని యావదాస్తి వుంటుంది. అవసరమయితే వీపుమీద మరోసంచి కట్టుకుంటాడు. పారిపోయినవాళ్ళు కుటుంబాలను మృత్యుముఖానికి వదులుతున్నారు. నేనూ నా తలిదండ్రులను వదలివచ్చాను. ముందుగానే పారిపోవటానికి ప్రయత్నం చేస్తున్నానని వాళ్ళతో చెప్పాను."

ఒక సేవిక వారందరిముందు కాఫీకప్పులు వుంచింది. యుద్ధంవల్ల బీదరికానికి గురయిన ఆడవాళ్ళను పీటర్ యిప్పుడు కొత్తగా చూస్తున్నాడు. పీటర్ ఆమెను చెరువులోని చేపను చూచినట్లు అలక్ష్యంగా చూస్తున్నాడు. ఆమె ట్రే పుచ్చుకుని నిశ్శబ్దంగా అక్కడినుంచి కదిలింది. జులియన్ ఆమెవంక చూడనయినాలేదు. కాఫీ కలుపుకోవటంలోనే మునిగిపోయినాడు.

"ఇప్పుడు, నేను ప్రజాసైన్యం తాలూకు గెరిల్లాగా మీకందరికీ తెలుసు. అదంతా అదృష్టం అనుకుంటాం. కాని యీరోజుల్లో అదృష్టం కాకతాళీయంగా రాదు!"

"జులియన్! అడవిలో వున్నావా? విచిత్రంగావుంది సుమా!"

"అడవిలో జీవనానికి నేను దారుణంగా తయారయ్యాను. వార్సా వదిలి దక్షిణంగా పయనించాం. వెనక్కు తిరిగి తూర్పుగా పయనిద్దామని సంకల్పం. అదే అనువైన ఆలోచన. ఎర్రసైన్యం అనుయాయులంతా అక్కడే వున్నారు. కేంద్ర సైన్యంలోకి యూదులను తీసుకోరు!"

"తీసుకోరా?"

"అవును. మేం రాత్రిళ్ళు మటుకే నడిచేవాళ్ళం. అయిదుగురం. ముగ్గురం మగవాళ్ళం - యిద్దరు అమ్మాయిలు! తరువాత జాతీయసైన్యం మమ్మల్ని దాచేసింది. వార్సాలోని మైకేల్ యిటువంటి వధకాలకు ఆదిగురువు. జాతీయత, ఆచార వ్యవహారాలు, మతప్రవృత్తులు, జర్మనులతో సంఘర్షణ - అంతా! మైకేల్ యీ గొడవలన్నీ వాళ్ళ రహస్య పత్రాలలో వ్రాస్తూవుండేవాడు. నిజానికి వాళ్ళదళాలు యూదులను, కమ్యూనిష్టులను వేటాడటంతో సరిపుచ్చుచునేవి. ఈ దండయాత్రతో మేం అడవులు దాటి పొలాలలో పడ్డాం. అక్కడ జర్మను పోలీసులు వేచివున్నారు. వాళ్లు తతిమ్మా నలుగురిని పట్టుకొని నరికేశారు. నేను మాత్రం అక్కడున్న నీటికొలనులో దూకి ఆవలిపక్క తుప్పల్లో దాక్కున్నాను.

వాళ్ళు నిజాన్ని తెలుసుకునేపద్ధతి అది. పీటర్‌కు యిదివరకు తాము రాత్రిపూటలు కాఫీహోటళ్ళలో కూర్చొని తీవ్రంగా చర్చించుకునే వివిధ అంశాలు గుర్తుకువచ్చాయి. నవ్వుతూ యిలా అన్నాడు: "జనం నిన్ను ఊసరివెల్లిలా అభిప్రాయాల రంగులు మారుస్తావనేవారు కదూ!"

"అందువల్ల యేమీ లాభంలేదు. నే నెట్లా బతికి బయటపడ్డానో నాకు తెలియదు. నేను ఒంటరిగాడిని. గ్రామాలకు వెళ్ళాలంటే తీరనిభయం. బలంవున్నరోజుల్లో రాత్రిళ్లు మటుకే తిరిగేవాడిని. చివరకు చావుకు సిద్ధపడ్డాను. ఆకలి, నీరసం ఎక్కువయి, నాకు అంతకంటే తరుణోపాయం దొరకలేదు. అదే-!"

ఇదంతా జరిగివుండటం నిజంగా అవసరమేనా? ఈ అనుభవాలు పవిత్రత కలుగజేస్తాయా? లేక వ్యతిరేకప్రభావం కలిగిస్తాయా? పీటర్ జులియన్ ముఖంవంక అతని భావాలను అర్థంచేసుకుందుకు చూచాడు.. జులియన్ తన కథనం కొన సాగించాడు!

"ఏదో చారిత్రక నవలలో జరిగినట్లు అయింది. నన్ను అడవిలో-యూదులే రక్షించారు. నన్ను తమగుహాకు తీసుకు వెళ్ళారు. అక్కడ ఎండహోజనం-కిటకిటలాడుతూ వున్నారు. అక్కడ ఆ కుటుంబం యావత్తూ జీవిస్తోంది. ఒక వృద్ధుడు- అత నికి మతప్రవక్తలాగ గడ్డం, అతని కొడుకు, భార్య, ముగ్గురు పిల్లలు-అందరూ బంకమట్టిలోతవ్విన సొరంగంలో నివశిస్తు న్నారు. ఆ ప్రాంతాల పరిశీలించిచూచినా, అక్కడ ఎవరూ నివసిస్తున్నట్లయినా అనుమానం కలుగదు!"

"వాళ్ళకు భయంలేదా? వాళ్ళునిమ్మల్ని ఎందుకు తీసుకువెళ్ళారు? తెలుసా?"

"భయమా? ఆ మాట చాలదు. అక్కడ వాళ్ళకే మసలటానికి సరిపోయే చోటులేదు. నేను వాళ్ళ కీచులాటలు, అంతఃకలహాలు యేదో జడపదార్థంలాగ వినవలసి వస్తూ వుండేది. ఆస్త్రీ అనవరతము వాళ్ళను సాధిస్తూనే వుండేది- నన్ను తీసుకువచ్చి మధ్యపడేసినందుకు, ముసలిఅతను యీపని తప్పనిసరిగా చేయవలసివచ్చిందని చెప్పుతూండేవాడు. ఈపనే శ్రేయస్కరమయినదని కుమారుడు అంటూండేవాడు. ఏమంటే, నేనేగనుక మరెవరికంటనయినా పడినట్లయితే వాళ్లు యీ

ప్రదేశమంతా గాలించి వదిలేవాళ్ళట! ఆ మనుషులు తమ భయాన్ని దాచుకునేవాళ్లు కాదు. అలా భయపడుతున్నందుకు సిగ్గుపడేవాళ్లుకూడా కాదు."

పీటర్ తన వెనకగా ఆడవాళ్లు కూర్చొనివుండటం, మగవాళ్లు కబుర్లుచెబుతూవుండటం గమనించాడు. ఈ మనుష్యులకు, సోవియట్ - పోల్ యూనిఫారాలు ధరించినవాళ్ళకు వైరుధ్యం దాదాపు నిజమైనదే.

జులియన్ కథనం కొనసాగించాడు: ఆ యూదులు పక్కగ్రామంనుంచి వచ్చారు. అక్కడ వాళ్ళకొక చిన్నదుకాణం వుండేది. రెండు మూడురోజుల కొకపర్యాయం, ముసలతని కొడుకు, రాత్రిపూటలు గ్రామప్రాంతానికి వెళ్ళి పూర్వపు స్నేహితులను సందర్శించి కావలసిన ఆహారపదార్థాలు తెస్తువుండేవాడు. వాళ్ళకు అదేదో యేర్పాటువుంది. శీతకాలం చాల దారుణంగా వుండేది. మంచులో కాలిబాటలు అగుపడుతూవుండేవి. నేను వెళ్లేసరికే వాళ్లు ఒకసంవత్సరంగా ఆ గుహలో వుంటున్నారు. శీతకాలమంతా బయటకు వెళ్ళనక్కర్లేకుండా తిండిపదార్థాలు సేకరించుకోవటానికి ప్రయత్నించారు. మరో అదనపు వ్యక్తికి భోజనం పెట్టవలసి రావటంతో వాళ్ళ అంచనాలు తల్లక్రిందులయినాయి."

పీటర్ కాఫీ కలుపుకుంటూ "అవును. మంచు దారుణమైనది. నాకు తెలుసు" అన్నాడు.

"నేను వాళ్ళతో ఒక మాసంవున్నాను. గ్రామస్థుల ద్వారా ఒక సమాచారం తెలిసింది. అదేమిటంటే - పారిపోయిన సోవియట్ఖైదీలు, యూదులు, నగరంలోని వివిధ

కోవలకు చెందినవ్యక్తులు...యిలా కొంతమంది జట్టు అడవిలో కనిపించిందని! ఇది నిజమో లేక కేవలం నన్ను వదలించుకోవటానికి వాళ్లు ఆడిన నాటకమో నాకు తెలీదు. ఏమయితేనేం, నేను వెళ్ళాను. వాళ్లు నాకు కొంతతినుబడి పదార్థం యిచ్చి దారిచూపారు. చివరకు నేనాజట్టును కలుసుకో గలిగాను. వాళ్లు నన్ను ఎన్నో మర్యాదలతో స్వీకరించారు. నేను విజ్ఞాననిధినికదా ! వాళ్ళకోసం నేనోపత్రిక సంపాదకత్వం వహిస్తువుండేవాడిని.''

పీటర్ వృద్ధుడైన జులియన్‌నుగురించి యేదో చెబుదామనుకుని మళ్ళీ మానేశాడు. తను అనబోయేమాటలు తన మనసుకే అసందర్భంగా తోచాయి. అందుచేత వాతావరణాన్నిగురించి ప్రస్తావిస్తున్నట్లుగా 'చివరకు మనం యీకొసకు చేరుకన్నాం. కొద్దికాలంలోనే వార్సా చేరుకుంటాంలెండి !'

జులియన్ చేతులతో అభినయిస్తూ'ఇక్కడ మనుషులు, అక్కడమనుషులు ! వాళ్లు యేమనుకుంటారో మీకు తెలుసా? ఇక్కడ యెంతో దారుణం జరిగిపోయింది. అయినా జనానికి యూదులు వదిలిపోయారన్న తృప్తి మిగిలింది !' అన్నాడు.

"అయితే యుక్రేయన్‌లో యేంజరుగుతోందో గమనించండి. జర్మనులు ప్రవేశించినప్పుడు ఒక్క యూదుడయినా నిష్క్రమించలేదు. ఎవరికీ ఆ అవకాశం రాలేదు. యూదులు కాని యుక్రేనియన్లు వాళ్ళను దగాచేశారు. వ్యక్తిగతమయిన ఆస్తిపాస్తులు లేనప్పుడు, వ్యక్తికూడా సంఘపరమై పోతాడు. సంఘంలో యూదులు వదిలిపోతున్నారు.''

"దీనికంతకూ వెనకవున్నశక్తులు మీకు తెలుసా ?''

"ఇంతకంటే వేరేమార్గం లేదనుకుంటాను!"

జూలియస్ గర్జించాడు: "వీళ్ళంతా కుక్కలు! సంవత్స రాలతరబడి యింగ్లండులో వుంటారు. వాళ్ళ అబద్ధాలు వాళ్ళనే నాశనంచేస్తాయి. పరస్పర విరుద్ధమైన రెండు వార్తా పత్రికలు ప్రచురిస్తారు. చచ్చిపోయేంతవరకు వాళ్ళకు యింతే పని!"

"వదో కొత్తప్రపంచాన్ని గురించి కలలుకంటున్నారు కద!"

"అవును, రోజులు మారిపోతున్నాయి. పద్ధతులు మారి పోతున్నాయి! అంతే!"

# 4

ఇదివరకు జర్మనులు తమ ప్రచారపత్రికలు ప్రచురించే భవనంలోనే యిప్పుడు 'నవశకం' పత్రికకూడా ప్రచురిత మవు తోంది. సంపాదకవర్గం అంతా రాత్రిపూట అక్కడే పడు కుంటారు. సంపాదకుడైన 'బారుగా' సేకరించిన భోజనపదా ర్థాల సంచులు ఏమూలచూచినా కనబడుతున్నాయి.

బారుగా టెలిఫోన్‌తో కుస్తీపడుతున్నాడు. అతని కను రెప్పలు ఎర్రగావున్నాయి. ముఖం, నిద్రలేకపోవటాన, ఉబ్బివుంది.

"తెలివితక్కువ వెధవలు! ఒట్టి వెధవలు!! కారు పంప మని చెప్పాను, ఇక్కడ బోలెడుపని మురిగిపోతూవుంటే — అక్కడ జనాన్ని అరెస్టుచేస్తూ ఆటలాడుకుంటున్నారు!" అని అరిచాడు. మళ్ళీ టెలిఫోన్ రిసీవర్ అందుకున్నాడు: "గాజేవిక్! నీవు వెంటనే వెళ్ళి పెకిల్‌స్కీని కలుసుకోవాలి! మంత్రిట—

మంత్రి! ఆ తెలివితక్కువమంత్రిని కలుసుకుని వాళ్ళను వెంటనే విడుదల చేయమని చెప్పు!”

“ఈ కరపత్రాలు యెక్కడున్నాయి? సైన్యం అప్పుడే విస్టులా వచ్చేసింది. నేడో రేపో వార్సా చెఱ వదలుతుంది. పని చేయటం చేతకాకపోతే యీ ముద్రాపకుల పీకలు తెగకొట్టి యిస్తాను!” అని మళ్ళీ గర్జించాడు.

పీటర్ క్వీంటో త్వరత్వరగా ఒక వ్యాసం వ్రాసుకు పోతున్నాడు. వేడికి ఒళ్ళంతా కుతకుతలాడుతోంది. అతని పక్కబల్ల దగ్గరకూర్చున్న జూలియన్ టెలిఫోన్ ద్వారా వార్తలు వింటూ నోట్సు వ్రాసుకుంటున్నాడు.

పీటర్ కు యీపత్రికలో ఉద్యోగం కొత్తజీవితం ప్రారంభించినట్లు వుంది. చేతినిండా పని క్షణం తెరిక వుండదు బిగ్గరగా అరుస్తూవుంటాడు. పగలు, రాత్రి అనే వ్యత్యాసం వుండదు. వ్యాసాలు, ప్రూఫులు, అచ్చుసిరావాసనలు! ‘పీటర్’ సైన్యం లోనే వుండిపోయాడు కనుక-కనుచూపు మేరలో లేదు.

అతను వ్రాస్తున్న వ్యాసం, ఎర్రసైన్యంతో పశ్చిమంగా వెడుతున్న కొత్తప్రభుత్వం విడుదలచేసిన ప్రణాళికకు వ్యాఖ్యానం. 1920లో ముగ్గురు విప్లవకారులు వార్సాలో అధికారం కైవశం చేసుకోవటానికి సిద్ధపడి, ప్రణాళికలు జారీ చేసిన రోజులు పునరావృత్త మవుతున్నట్లున్నాయి. కాని విప్లవ పరిస్థితులుమటుకు కొద్దికొద్దిగా మారుతున్నాయి. ఈ పాతిక సంవత్సరాల తరువాత, యిప్పుడు కొత్తగా అధికార గోక వస్తున్నవాళ్లు క్రమశిక్షణలేని బందిపోటులుకాదు. ఇన్ని సంవత్స రాలలోను యీ కొత్తమార్పుకు ప్రతిబంధకంగా నిలచిన

జాతీయభావాలు ఎండిపోయిన చెట్టుకొమ్మలలా దులిపివేయ బడినాయి. ఈ పనంతా చేసినవాళ్లు నాజీలు. అంతేకాక విప్లవ రీతుల్లో కూడా ఎన్నో అభివృద్ధులు వచ్చాయి.

"జనానికి కావలసింది తిండి! కడుపునిండా తిండి!" అని చెబుతూ వుంటాడు బారుగా. చరిత్ర అంచెలంచెలుగా పురో గమిస్తోందనేవాడు. 'ఈ విప్లవ స్టాయిలన్నీ ఎన్నాళ్లు ఇల్లా స్థావరించుకుంటాయి?' అనుకున్నాడు పీటర్. కొత్తప్రభుత్వం తీసుకువస్తున్న భూసంస్కరణలు వ్యక్తి, గత ఆస్తిపాస్తులను మన్నిస్తాయని వ్యాసం వ్రాస్తున్నాడు. అవును, యిలా చెబుతూ వుండటం ఎంతో అవసరం. ఏమంటే ఎవరూకూడా అకస్మా త్తుగా పరిస్థితులు తల్లక్రిందులవటం సహించలేరు. విప్లవం శాంతియుతంగా సాగాలి. కొత్త సాంఘిక స్వరూపాలు బయలు దేరాలి. రష్యాలోమాదిరి వుండకపోవచ్చు. పెట్టుబడిదారీ వ్యవస్థకింద వున్నట్లు వుండకపోవచ్చు. ఇక్కడ మరొకరూపం యేర్పడుతుంది. కొత్త సామాజికవ్యవస్థ వస్తుంది. పీటర్ సైని కుల మాదిరి, తూర్పున చూచిన దృశ్యాలకు తమలో కలిగిన హేయభావాలను మనసులో అణుచుకున్నవాళ్లు, తమ దేశపు ఔన్నత్యానికి సేవచేసేట్లు, జాతీయజండాకు వందనం చేసేట్లు చేయాలి!

ప్రతిమాటలోను, ప్రతివాక్యంలోను యీ 'జాతీయత' అనే భావం మిళితమై వుంటోంది. ఇదే పీటర్‌కు నచ్చటం లేదు. పాతభావాలనే కొత్తసీసాలలో దిగుమతిచేస్తున్నారు. పాతనినాదాలే కొత్తఅర్థాలతో వినబడుతున్నాయి. "జర్మను లను కొట్టండి, చంపండి, ఆడవాళ్ళను, పిల్లలను జాలితలచి

వదలకండి. దేశం పురోగమించటానికి - స్వాతంత్ర్యసముపార్జ నకు దోహదం చేయండి!" - ఇలాంటి నినాదాలు తరుచు విన బడుతున్నాయి. రేడియోలలో కూడ యిటువంటి పదజాలమే వస్తోంది! "లేవండి! జర్మన్లను కాల్చండి! పారిపోనివ్వకండి. పగతీర్చుకునే సమయం వచ్చింది. అవకాశాన్ని జారవిడువ కండి" ఇలాంటి మాటలు వ్రాయటానికి పీటర్‌కు చాల భాధగా వుండేది. కాని తతిమ్మావాళ్ళకు యీ పదజాలం చాల తేలికగా వస్తోంది

పీటర్ వ్రాయటం ఆపేసి బల్లమీద వారగిలపడ్డాడు. బారుగా మళ్ళీ గొడవచేస్తున్నాడు. ప్రూఫులుదిద్దటంలో పొర పాటువచ్చిందని ఎవరిమీదనో కేకలు వేస్తున్నాడు.

ఇంతలో జులియన్ పొలికేక వేశాడు. అరవకండి! నిశ్శ బ్దం." అందరి వాదనలు, టైప్రైటర్ల చప్పుడు ఆగిపోయినాయి. జులియన్ రెండు చేతులతోను ఫోనును చెవికి అదిమిపట్టు కున్నాడు. "వార్సాలో తిరుగుబాటు చెలరేగింది. లండను వాళ్లు అంతిమ ప్రయత్నంలో వున్నారు" అన్నాడు.

బారుగా ముఖంలో కళాకాంతులు లేవు. సిగరెట్టు చేతిలో ఎగురవేస్తున్నాడు. "ఓహో!...ఓహో—" అన్నాడు.

జులియన్ తిరిగి ఆలోచనలో పడ్డాడు. టైప్రుమిషిన్ల దగ్గరి అమ్మాయిలు నోరుతెరుచు కూర్చున్నారు. కొందరు కళ్ళజోడుఅద్దాలు తుడుచుకుంటున్నారు. వీధుల్లో సోవియట్ సైనికులు పదాలుపాడుకుంటూ నడుస్తున్నారు. పీటర్ తాను వ్రాసిన వ్యాసాన్ని పుటలవారీగా కూరుస్తున్నాడు. ఆ కాగితాల మీద బరువుపెట్టి, కుర్చీలోంచి లేచాడు.

# 5

మైదానం చదునుగా వుంది. దిక్చక్రం స్పష్టంగా కనిపిస్తోంది, గోధుమరంగు యిసుక. వేసవికాలం కనుక ఆకాశం పాలిపోయినట్లు అదోరకంగా వుంది. ఆకాశంలో పొగమేఘాలు యేర్పడుతున్నాయి. ఈ మేఘాలమధ్యగా పక్షులు బారులుతీరి పరుగెడుతున్నాయి. పక్షుల కిలకిలారావాలు లీలగా వినిపిస్తున్నాయి. గొడ్ల కాపలాకాస్తున్న కుర్రాళ్ళ పాలికేకలు, కొరడా ఝులుం తరచుగా వినబడుతున్నాయి.

పొగ పైగా చిన్న కాంతిపుంజాలు అగుపడుతున్నాయి. సూర్యుడి కాంతికి యివి అద్దాలలా వున్నాయి. భయపడి గూళ్ళలోంచి పారిపోయిన పావురాలు ఆకాశంలో ఎగురుతూ దారితెన్నూ తోచక కొట్టుమిట్టాడుతున్నాయి.

నగరాన్ని ఒరిసి ప్రవహిస్తున్న నది ఎర్రని గుడ్డపేలికలా గోచరిస్తోంది. చెడిపోయిన కర్రవంతెనలు అక్కడక్కడా పడి వున్నాయి.

దిక్చక్రంవైపు విమానాలు విడుస్తున్నాయి. అవి పొగలోకి దూరినప్పుడు దుమారం చెలరేగుతోంది. టాంకులు జోరుగా పనిచేస్తున్నాయి. తుపాకుల చప్పుడు విపరీతస్థాయిలో వినవస్తోంది.

# 6

నైఋతిమూలగా నగరం ఆగిపోయింది, అక్కడ పెద్ద పెద్ద భవంతులు వెలిశాయి. వీధులు గుర్తుపెట్టబడి వున్నాయి

కాని యింకా పూర్తిగా తయారుకాలేదు. చెదురుబదురుగా వున్న యిళ్లను కలుపుతూ చిన్నచిన్న కాలిబాటలుమటుకే వున్నాయి.

అక్కడవుండే ఆడవాళ్లు అవకాశం వచ్చినప్పుడల్లా పొలాలలోనికి పరుగెత్తి పిల్లలకోసం కారెట్లు, బంగాళదుంపలు తవ్వుకువస్తారు.

హెర్మన్ గోరింగ్ దళం యీ భవనాలకు నిప్పుఅంటించ సాగింది.

విశాలమయిన మైదానంలో జనం గుంపులు గుంపులుగా ముందుకు నడుస్తున్నారు. కొందరి బుజాలమీద మూటలు, సంచులు వున్నాయి. కొందరి చేతుల్లో కర్రలున్నాయి. వారు అలా నడుస్తూ అప్పుడప్పుడు వెనక్కుతిరిగి మహోజ్వాలంగా మండుతున్న మంటలను చూస్తున్నారు. మంటలు ఎందాక వచ్చినాయో యింకా తమతమ యిండ్లను సమీపించాయో లేదో అని భయంభయంగా చూస్తున్నారు. మంటల నీడలు ఒక పిల్లికళ్ళలో ప్రతిబింబిస్తున్నాయి. ఆ పిల్లి భయంగా, తనను ఎత్తుకువున్న స్త్రీ రొమ్ముల్లో కుదించుకు కూర్చుంది. ఒక చిన్న కుర్రవాడు పంజరంలోని చిలుకతో మాట్లాడు తున్నాడు. పారిపోవాలనే యేకైకవాంఛతో ఎక్కడికి వెడుతు న్నారో ఎందుకు వెడుతున్నారో – యేమీ ఆలోచించకుండా, అందరూ అలా పోతుగ్గా వెళ్ళిపోతున్నారు.

కుడివైపుగా యింకా నిర్మాణం పూర్తికాని ఎర్రని యిటుకలయిల్లు తగులబడుతోంది. ఆ యింటిముందు పోట్లాట జరుగుతోంది. టాంకులు జోరుజోరున తుపాకులు విడుస్తు

న్నాయి. ఒక్కొక్క గుండుదెబ్బకు భవనం విచిత్రంగా చిల్లులు పడుతోంది.

ఇంతలో కమాండర్ యీలవేశాడు. యూనిఫారం ధరించిన వాళ్ళంతా ఒక వరుసలో నిలబడ్డారు. ఒక క్షణంలో అందరూ అలాబారుతీర్చి పొలాలవెంట నడువసాగారు. సైనికుల నడకకు దుమ్ము పైకిలేచి మేఘాలుగా తయారవుతోంది. కమాండరు మళ్లీ యీలవేశాడు. సైనికులు మరో దిక్కుగా నడవసాగారు. దండయాత్ర ఆగిపోయింది!

పొలాలు ద్వంద్వకాంతిలో వెలుగుతున్నాయి. ఒక కాంతి మండుతున్న నగరంనుంచి వచ్చినది, రెండవకాంతి అస్తమిస్తున్న సూర్యునిది. పావురాలగుంపులు ఓటు పొలాల మీదుగా ఎగురుతున్నాయి. విమానాశ్రయానికి వెళ్లే రోడ్డు యింద్రధనస్సులా అనేక రంగుల్లోవుంది. కొందరు రష్యను సైనికులు ముందుకు, వెనక్కు నడుస్తున్నారు. కాలిపోతున్న పట్టణానికి దూరంగా, మైదానంలో అరుపులు నవ్వులతో కొందరు సైకిలు తొక్కడం ఎలాగో నేర్చుకుంటున్నారు.

## 7

మైదానం గుండా పశ్చిమంవైపుకొక కాలిబాటవంటిది వెడుతుంది. స్వల్పవిరామంలోనే ఆదిక్కుగానే రైలుబళ్లు కూడా వెడుతూవుంటాయి. ప్లాట్‌ఫారానికి వెనుకవైపు సాయుధపోలీసుదళం జాగ్రత్తగా నిలుచుని వుంటారు. జనసమూహంలో వున్న ప్రొఫెసర్ గిల్‌ను ఎవరో భుజంతట్టి పిలిచినట్లయి వెనుదిరిగి చూచాడు.

"ప్రొఫెసర్, మీరు నాకు తెలుసు. మనం యిప్పుడు కిందికి దూకేయాలి. లేకపోతే ఆస్పిడ్జ్‌లో తునాతునకలై పోతాం" రైలు బాగా అటు యిటు ఊగుతోంది. ఆ మనిషి మళ్లీ యిలా అన్నాడు: "యింకా టైంవుంది. ఈ అవకాశం జారిపోతే మళ్లీ మనం మనుష్యులం కాలేము. ఇప్పుడు యీ పని అంతకష్టంకూడా కాదు. ముందుకు దూకేయండి చాలు. మన మిద్దరం, రెండు వేపులకు దూకామంటే మనకు మంచి అవకాశంకూడా వుంటుంది.

ప్రొఫెసర్ గిల్ భార్యచేతిని తనచేతిలోనికి తీసుకుని నిమురుతున్నాడు. చుట్టూవున్న జనసమూహాంమూలంగా కాకపోతే ఆమెకు నిలుచునే స్తోమతలేదు. ఆమె తలచుట్టూ రుమాలు చుట్టుకుంది. ఆమె కళ్లు పైకిఎత్తలేదు. ప్రొఫెసర్ ఆమెకు తన హావభావాలన్నీ స్పర్శమూలంగానే తెలియజేస్తున్నాడు.

"ఊహు. నేను యిదేం ఐత్యంచేయను. నా భార్యతోనే వుంటాను."

అవతలిమనిషి బుర్రపక్కకుతిప్పాడు. బండి కదలికవల్ల జనం కుదుపుడు అయ్యారు. ఒకళ్ళనొకళ్లు బూతులు తిట్టుకుంటున్నారు. అతను ప్లాట్‌ఫారం కొనవైపు నడుస్తున్నాడు. ఎన్నోనిమిషాలు గడిచాయి. 'అతను దూకనేలేదు' అనుకున్నాడు ప్రొఫెసరు. కాని ఆక్షణంలోనే జనంలో కేకలు పెడబొబ్బలు వినవచ్చాయి. 'అవును—అతను బతికే వున్నాడు', 'లేదు. అతను చచ్చిపోయాడు'— 'పారిపోతున్నాడు...' ఇలా జనం రకరకాలుగా చెప్పుకుంటున్నారు.

రైలునుంచి కిందికిదూకిన అతను విచిత్రంగా భావించుకున్నాడు. రైలు మీదపడకపోతే తనకేం ప్రమాదం లేదనుకున్నాడు, నేలమీద పడగానే చేతులతో ఆనుకోవా లనుకున్నాడు—వెంటనే లేవాలనుకున్నాడు. కాని అలా జరగలేదు. అతను తలఎత్తి చూడగలిగేసరికి రైలు చాలాదూరంపోయింది. ముఖం చేతితో తడుముకున్నాడు. అంతా రక్తమయం. గడ్డితో ముఖం తుడుచుకుని పొలాలవెంట పరుగు ప్రారంభించాడు. రైలుమార్గంనుంచి చాలదూరం వచ్చేసి యింకేమీ ప్రమాదం లేదనుకుంటూవుండగా అతను అకస్మాత్తుగా ఒక కంచకంలో పడిపోయాడు.

మోకాళ్ళు తడిమిచూచుకున్నాడు. మణికట్టు కదలించాడు. ఎముకలేమీ విరిగినట్లులేదు. ఒకసారి ఒళ్ళు విరుచుకున్నాడు. సాయంకాలం అవటాన ఆకాశం మూసుకుంటోంది. నగరంలోనిపొగమే ఘాలుగా పైకిపోతోంది.

అర్ధరాత్రి మెలుకువవచ్చింది. విమానఘోష వినవచ్చింది. ఒకపక్కకు ఒరిగి ఆలకించాడు. ముక్కుపుటాలు మట్టికంపుతో బద్దలవుతున్నాయి. ఈ వేళప్పుడు ఆకాశంలో విహరిస్తున్న విమానాలు ఎవరివా అని ఆశ్చర్యపోయాడు.

ఆ భూమిమీద అతను ఒంటరిగాడు. జరిగినదంతా అతని మనఃపథంలో గ్రామఫోను రికార్డులా తిరుగుతోంది. వేగమే కాని శబ్దంలేదు. జరిగినదంతా తనకేమీ సంబంధం లేదనుకోవాలనిపించింది. "కానీ! తగులబడనీ. నాకేం? ఈ గొడవలన్నీ నాకెందుకు?" అనుకున్నాడు. బాధ్యతనుంచి యివతల

పడ్డాడు. తను చేయవలసిందే తనుచేశాడు. అంతే! కాని ఏదో సిగ్గుతెర – దానితోపాటు అసహ్యం కలిగాయి.

దేవుడు అందరినీ అన్యాయంచేశాడు. తన భోగ భాగ్యాలు, ఆస్తిపాస్తులు, అందచందాలు అన్నీ జరిగిపోయినై. మాతృదేశంకోసం జర్మనులతో పోరాటం! మొదటి నుంచి యిదంతా అబద్ధం అనిపిస్తోంది. ఇంతకంటే ఎక్కువ విశదీకరించలేడు. యుద్ధంముందు మోస్తరుగానే వుండేవాళ్ళు, మరో ప్రపంచం – అందరికీ సుఖం – కాని యీ సుఖానికి నిర్వచనం యేమిటో తెలీదు. ముందుమాట – జర్మనులందరినీ వొళ్ళు వాచేట్టుకొట్టాలి. ఈ పోరాటంలో కూడ ఉత్సాహభక్తిగా తను పాల్గొన్నాడు.

గిల్ జ్ఞాపకంవచ్చాడు. అతని పద్ధతివేరు. సంపాదకుడు గిల్ వ్యాసాలను అంతగా యిష్టపడేవాడుకాదు. చాల అరుదుగా ప్రచురిస్తూవుండేవాడు.

“నీవు స్వాప్నికుడవు, మార్టినాక్ : రివాల్వర్ చేత పట్టుకున్న తాత్వికుడవు!” అంటూవుండేవాడు బూటుచాటునుంచి వ్రాతప్రతులు బయటకుతీస్తూ. కాని గిల్ తక్కినవాళ్ళ లాగ అబద్ధం చెప్పేవాడుకాదు. అతన్ని చూచి నేర్చుకోవలసింది చాలావుంది.

నేల. దూరంగా కుక్కలు మొరుగుతున్నాయి. కింద తను ఒక్కడే వున్నాడు. పైన ఆకాశంవుంది. అక్కడ యంత్రాలు ఘోషపెడుతున్నాయి. ఆకాశంలో కదుల్తున్న దీపాలను, నక్షత్రాలను వేరు వేరుగా పోల్చుకోవటానికి ప్రయత్నిస్తున్నాడతను.

# 8

విమానాల మీదుగా వార్సా మీదికి బాంబులు వేయటం చాలదూరం వచ్చింది. "బారి" నుంచి దూరంవచ్చేసి పర్వతపంక్తుల మీదుగా చివరకు పోలండ్ వచ్చారు. రష్యన్లు తమ భూభాగంలో వాళ్ళ విమానాలు విడవటానికి అభ్యంతరం చెప్పారు.

హెర్మన్ గోరింగ్ డివిజన్‌లోని "ఎడ్మండ్ లాంపా" అనే ఒక ఉద్యోగి వార్సా ప్రాంతాలలో ప్రమాదంలో చిక్కుకున్న విమానం పరిశోధించి ఒక చిన్న నల్లనిపుస్తకం సంపాదించాడు. దాన్ని వజ్రంలా దాచుకున్నాడు. లాంపా సైలీషియా వాడు అయినప్పటికీ ఇంటిదగ్గర తలిదండ్రులతో పోల్ భాషలోనే మాట్లాడుతూవుంటాడు. యుద్ధంలో చేరాక అనేక మండలాలలోపని చేశాడు. యుద్ధం ముగిశాక యేం చేయాలో తోచలేదు. తలిదండ్రులు యింకా సైలీషియాలోనే వున్నారు. కాని అతను అక్కడికి తిరిగివెళ్ళటానికి భయపడ్డాడు. అంచేత నేరుగా ఫ్రెంచి విదేశదళంలోచేరి "ఇండో చైనా" వెళ్ళాడు. 1946 లో గాని యీ నల్లపుస్తకం హాంబర్గ్‌లో నాథన్ హాక్స్‌కు దొరికిందికాదు, చివరిపేజిలో అతని కొడుకు యిలా వ్రాశాడు:

"ఒక వివరం; జులియా వెళ్లే దారిలో ఎట్టమైన గోడలు, రంగునీడలు. గదిలో కిటికీ. బాగా పాతబడిన బల్లమీద ఆహారపదార్థాలు. ఒక కుటుంబం భోజనంచేస్తోంది. వారివెనుక తెరిచివున్న తలుపులు, కాంతి. గ్లాసుల్లో సారాయం, బల్ల

మీంద ఉట్టిచేతులు - మెడలు! మా అమ్మాయికి గాజుపొర లాంటి కంఠం! వెలుగులో చూచి ఆమె యేంతింటుందో యేం తాగుతుందో చెప్పవచ్చు." వాళ్ళ వెనుక, గోడ. బాగాతోమిన కంచు. విషయాలు బాగా చెప్పాలంటే వివరాలు పూర్తిగా వుండాలి. ఒకవివరం గమనించాక ఆ వివరంయొక్క వివరాలు కనిపెట్టాలి. ఆ ఇటాలియన్ కుటుంబం - అగ్గాసులు, చేతులు, ముఖాలు, కంచుపదార్థాలు - రకరకాల రంగులు, ఆకారాలు. వివరం పూర్తిగా తెలిశాక, యింకేమీ వివరం లేకుండా పోతుంది. జనం బొమ్మలు గీయకూడదు.

యుద్ధానంతరం యిక్కడే వుంటానని జూలియాకు చెప్పాను. పాపం, బెట్సీ. మానవజీవితాలు చాలా అసందిగ్ధంగా చెదిరిపోతున్నాయి. కొందరికి కొద్దిచోటే అనేకవివరాలు దొరుకుతాయి, కొందరికి కేవలం నీడలు, ఆలోచనలు, సముద్రం, భూమి, భోజనం - మటుకే కనిపిస్తాయి. పూర్వం నాకు ఎలా గమనించాలో తెలిసేదికాదు. ఏది యేమయినా - యుద్ధంమటుకు మంచిదే!

జూలియాతో, గ్రామసీమలో - చెట్ల మధ్య. పుస్తకాలలో వ్రాసేది, స్కూళ్ళలో చదివేది - అంతా అర్థంలేని చెత్త. అదంతా బాగుండటానికి వ్రాసిన వ్రాతలు. కాని యీ సుఖం మనకు అనుభూతం కాకపోతే, యేదీ నిజంకానేరదు.



క్రాడెట్ ఆఫీసర్ "సీల్" దీర్ఘంగా ఆలోచిస్తూ వంగి కూర్చున్నాడు.

సీల్ తలపైకెత్తి చూచాడు.

"పదిహేను! అంతకంటే లాభంలేదు."

కుర్రవాడు అయోమయంగా మాట్లాడాడు.

"ఇరవైచేయలేవా? రివాల్వర్ల మందు అయిపోయింది!"

"మీకేకాదు. అందరికీ అంతే. నీ కిదే హెచ్చరిక. ఇప్పుడు యిదివరలాగ కాదు. ఏమీ పదార్థం మిగిలిలేదు!"

"అయితే యేం చేదామంటారు?"

"నీళ్ళగొట్టాలు కొస్తున్నాం. ఇంకేమయినా వున్నాయేమో చూడు" అతను ఒకటి చూపాడు. కుర్రవాడు అపనమ్మకంగా అతనివంక తేరిచూచాడు.

"హోరి దేవుడా! అది పనిచేస్తుందా?"

"లక్షణంగా! పరీక్షచేసి చూచాం."

భూగృహం పేల్పులతో కదిలిపోయింది.

"అన్నింటికీ కాదంటావేం? పారాషూట్ చుక్కల్లోంచి ఏమయినా దొరికిందా?"

"రెండు దొరికాయి. కర్నల్ రాగ్ గారి కుర్రాళ్ళు మందుగుండంతా సంపాదించారు. వాటితోనే యిప్పుడు తంటాలు పడుతున్నాం. తతిమ్మాది మనం కొల్లగొట్టినది!"

"సీసాలేమయినా వున్నాయా?"

"సెల్యులాయిడ్ ఫ్యూజులవిమటుకే వున్నాయి. వాటిని వెలిగించాలి."

"పరిస్థితులు ఎలా వున్నాయి?"

"ఇవాళ అంతా చెడ్డగాలేవు. ఇద్దరు గాయపడ్డారు.

మనం వాళ్ళ టాంకులు తగులబెట్టి హూణులను చంపాం. కాని మనకు(రవాళ్లు అయిదుగురు పోయారు.”

“పాపం!”

“మళ్లీ రేపు కలుసుకుంటాను.”

“సరే! –”

సీల్ తనపని కొనసాగించాడు. ఎవరయినా చేయగలి గింది అంతే. పరిస్థితులు దారుణంగా వున్నాయి. కాని అత నిలో కోపమంతా యింకేదోరూపం తాలుస్తోంది. అదేమిటో అతనికి తెలియటంలేదు. దండయాత్ర ఆరంభమైన కొద్దివారా లలో అతను ఎన్నో వికారాలకు లోనయ్యాడు.

అంతా సాయంకాలం అయిదుగంటకు ఆరంభమైంది. ఆర్టిమ్ అనే సోషలిస్టుఅగ్రనాయకుని కలుసుకునేందుకు అతను రోడ్డువెంట నడుస్తున్నాడు. దండయాత్ర అప్పటికి చాలాముందే ఆగిపోయింది. కాని ఎందుచేతనో రోడ్లమీదజనం పరుగులు పెడుతున్నారు. అతను చుట్టూ కలయజూచాడు. కొందరు యువకులు తనవెనకగా పేవ్‌మెంటుమీద వస్తున్నారు. ఇళ్ళ లోంచి జనం బయటకు దూకుతున్నారు. అందరికీ ముందుగా ఒక లావుపాటివ్యక్తి తుపాకి చేతపుచ్చుకుని నడుస్తున్నాడు. అతను అరుస్తున్నాడు. ‘ముందుకు–ముందుకు–’ అంటూ కేకలు వేస్తున్నాడు. గుంపులో అందరికీ జోడుగుళ్ళ తుపాకులు వున్నాయి. రోడ్డుమీద వెళ్ళేవాళ్ళ సంఖ్య పలుచబడింది. అందరూ యిళ్ళలో జొరబడుతున్నారు. జర్మను భవనాల నీడలలో సందు మలుపులనుంచి మరతుపాకుల సవ్వడి విన వస్తోంది. పిల్లలు గుంపులుచెదిరిపోయాయి. వాళ్ళను అనుస

రించి సీల్ ఒక చెట్లవరుసదగ్గరకు చేరుకున్నాడు. ఊపిరి పీల్చుకోవటానికి ఆగాడు. అతని పక్కనే పలచటి బడికుర్రాడు నిలుచున్నాడు. వయసు పదిహేడు లోపేవుంటుంది. నల్లటి జుట్టు నుదుటిమీద పడుతోంది, కంగారుగా జేబులోంచి ఆయుధాలు తీశాడు. నాయకుడు అతన్ని నిరాయుధుడిని చేశాడు. తన వెనకనే రమ్మని అరిచాడు. కుర్రవాడు ముందు సందేహించాడు. తరువాత అందరినీ అనుసరించి పరుగెత్తాడు.

## 10

ఈ కుర్రవాడు బాగా భయపడిపోయాడు. అతని జ్ఞాపకాల్లో యింకా లెక్కలు, పగటికలలు, నదులు, నగరాలు, దూరదేశాలు వున్నాయి. అతని శరీరపు వేడిలో సత్తువ యేర్పడుతోంది. స్వేచ్ఛ! హాయి! అతనిలో వందల కొద్ది వేలకొద్ది పూర్వీకులు వున్నారు; తరతరాల చరిత్ర అతనినరాల్లో జీర్ణించివుంది. అయితే యిప్పుడు తుపాకుల చప్పుళ్లు, అతని స్నేహితులు మటుకే మిగిలివున్నారు. వాళ్ళను కొద్దిచేయటం అతనికి యిష్టంలేదు. తన తల్లిని కావలించుకుని యేడుద్దామనిపించింది. ఈ క్షణంలో అతను చాల నీరసంగా వున్నాడు; కాని పరిస్థితులను యింతకంటే చక్కబరచటానికి యేమీ మార్గంలేదు.

సీల్ అతనివంక చూచి సిగ్గుపడ్డాడు. ఎంత దారుణం జరిగిపోతోంది! వాళ్ళకి అయుధాలు ఎక్కడ దొరికాయి?

అతని స్మృతిపథంలో అందమైన కన్నెపిల్ల అగుపించింది. తను ఆమె వలువననుకున్నాడు. అతనికేమీ అర్థం

కావడంలేదు. ఇలా కాథరైన్‌నుంచి విడివడటం దుస్సాధ్యం. వివాహమయిన మొదటి నెలలోనే భార్యతో తగాదావచ్చింది. తను యెందుకలా ప్రవర్తించాడు? వెంటనే ఆమెదగ్గరకు పరు గెత్తుకువెళ్ళి ఆమె పాదాలను ముద్దాడి ఆమెకు క్షమాపణ చెప్పుకోవాలనివుంది. ఆమెను కలుసుకోవటానికి యీ నగరం మధ్యకు చేరుకోవాలనుకుంటూ వుంటేనే – ఎన్నో రోజులు, సంవత్సరాలలాగ గడిచిపోతున్నాయి. ఆమెను, ఎలాగయినా సరే ఒకసారి చూడాలి. అంతకంటే ముందు చనిపోగూడదు. కోరికకూ సత్యానికి నడుమ అంతర్యుద్ధాన్ని తలపోసుకుంటూ అతను అపజయాన్ని అంగీకరించటానికి ఒప్పటంలేదు కాని ఎప్పుడో ఒకరోజు తెలుస్తుంది, తన భావన అంతా తప్పనీ, తను గతమంతా మరిచిపోయి ప్రవర్తించవలసి వస్తుందనీ!

అతను పరుగెత్తుతున్నాడు. ప్రతిఅడుగు కాథరైన్‌కు దగ్గరగా తీసుకువెడుతోంది. వాళ్ళు వెదుక్కుంటూ వస్తున్నారు. అతను బంగాళదుంపల పొలంలో దూరాడు. వాళ్ళు తనవైపే పరుగుతీస్తూ వస్తున్నారు. అతను నేలమీద సాచుకుపడు కున్నాడు. పాతకల! భూమినంతటినీ దహించివేస్తున్న కాంతి యేదో తనను కాల్చివేస్తున్నట్లువుంది. అతను పరుగెత్తాడు. కాని ఆ మంట అతనిని దహించివేసింది. కాని అతడు చని పోయాడు – ఇంతలో మెలకువ వచ్చింది. కళ్ళకు ఎదురుగా గోడ కనిపించింది. ఈగోడఎక్కుతూ వుండగానే పట్టుకుంటారు– అనుకున్నాడు, ఆవలివైపు విశాలప్రదేశం వుంది. అక్కడ గోడ లేదు. అకస్మాత్తుగా రెండు మానవాకారాలు కనిపించాయి. మిలటరీబూట్లు, పొడుగైనకోటు ధరించిన కుర్రవాడు – ఒక

చేతితో రివాల్వర్ బిగువుగాపట్టుకుని నడుస్తున్నాడు. అతని వెనుక ఒక అమ్మాయివస్తోంది. పొడుగైనజుట్టు; చేతిలో సంచి కూడా వుంది. వాళ్ళు సురక్షితంగా గోడదాటారు. "నేను కూడా ఆపనేచేయాలి. ఆమె నాకోసం ఎదురుచూస్తోంది" అనుకున్నాడు. ఉన్నట్టుండి గబుక్కున పైకిఎగిరాడు. మరు క్షణంలో గోడకు ఆవలిపక్కపడ్డాడు. కాబట్టి కలలు ఎప్పుడూ నిజంకావు, అనుకున్నాడు మొట్టమొదటగా!

అతనో బల్లదగ్గర కూర్చున్నాడు. అభ్యాగతి కాఫీ కప్పుల్లోపోస్తూంది. కొత్త చిత్రాలు, గుడ్డలు, కప్పులు, గిన్నెలు. ఆమె సిగరెట్టు కాలుస్తోంది. ఆమెభర్త లాయరు. ఆల్డస్ హాక్స్లీ నవల చదువుతున్నాడు."ఈవిధంగా అయితే నీవావని చేయలేవు. అక్కడ జర్మన్‌స్థావరాలు వున్నాయి. కాని యే క్షణంలోనయినా అదంతా సమాప్తి కావచ్చును. పారిస్ ఆక్ర మించుకున్నారు. రష్యన్లు నది దాటుతున్నారు. వాళ్ళ తుపాకి చప్పుళ్ళుకూడా వినవస్తున్నాయి – కిటికీకి ఆవల కేకలు, తుపాకి దెబ్బలు వినవస్తున్నాయి. తలుపు తెరుచుకుంది. క్రూరవాళ్ళ గుంపు లోనికివచ్చింది. ఆమె వాళ్ళను అక్కడే ఆపటానికి ప్రయత్నించింది– "దయవుంచి యేమీ చేయకండి. ఏమన్నా చేస్తే వాళ్ళు యింటినంతా తగులబెడతారు!" వాళ్ళు ఆమె మాటలు వినలేదు. కిటికీదగ్గరకు వెళ్ళారు. చేతిబాంబులు విసి రారు. పేల్పులు. గాజుసామాన్లు బద్దలయినాయి. కప్పులు బల్లలమీదనుంచి చెదిరి సీల్ మీద పడ్డాయి. ఆమెమీద లాయర్ మీదకూడా పడ్డాయి.

ప్రతిగంటా తనకు కాథరైన్‌కు మధ్యనున్న దూరాన్ని

అధికంచేస్తూంది. తను వేరేదారి ఆలోచిస్తే మంచిది. అప్పు డొక వంటెన నిర్మాణంలోవుంది. అతను పచ్చికమీద పడుకుని ఆలోచిస్తున్నాడు. ఆగష్టురాత్రి, కన్నుపొడుచుకున్నా కాన రావడంలేదు. దూరంగా కాల్పులచప్పుడు, కాంతి. ఈ చీకట్లో అతనికి ఎవరో గొంతు సరిచేసుకుంటున్నట్లు వినిపించింది. ఈ చప్పుడు ఎక్కడినించి పచ్చిందో ఆ కిటికీదగ్గరకు వెళ్ళి శ్రద్ధగా విన్నాడు. ఒకబల్ల దానిమీద సోడా-సీసాలు, ఒక లావుపాటి వ్యక్తి, సన్నటివ్యక్తి - కనిపించారు. వాళ్ళ చేతుల్లో గ్లాసులు గలగల్లాడుతున్నాయి. వాళ్ళు ఆ చీకట్లో నిశ్శబ్దంగా కూర్చుని తనివితీర తాగుతున్నారు. సీల్ మృదువుగా నవ్వుకున్నాడు. "బహుశ వాళ్ళకూ తెలిసేవుంటుంది - వాళ్ళకు యింకే ఆశా లేదనుకుంటాను" అనుకున్నాడు సీల్.

## 11

కర్నల్ చిత్రపటంమీంది దుమ్ముదులుపుతున్నాడు. తరు వాత తనముఖంకూడా తుడుచుకున్నాడు.

"జర్మనులు నదినిదాటి వచ్చినప్పటినుంచి పరిస్థితి యేమంత బాగాలేదు. అప్పుడు యింకా అవకాశం వుండింది. ఇప్పుడు నగరంలో నాలుగుభవనాలు మటుకే మిగిలాయి-" అన్నాడు ఆగదిలోనేవున్న కమాండర్.

"దక్షిణానవున్న నదిరేవులు యింకా మనస్వాధీనం లోనే వున్నాయి."

"ఏమో, యీసరికి యేమయివుంటాయో!"

"మనం జాగ్రత్తగా వుండాలి. ప్రభుత్వాజ్ఞ మీకు తెలుసుగా!"

"కమాండర్ కిందిపెదవి మెలిపెట్టాడు."

"రష్యనులు ప్లానుమార్చు రనుకుంటాను!"

"అదే తరుణోపాయం"

"నేను కాంపినోస్ దాకా తరుముకు వెడదామనుకున్నాను. కనీసం యువకులనైనా రక్షించగలిగి వుండేవాళ్ళం. క్రూరవాళ్లు యాతనలపాలవటం నేను చూస్తూ సహించలేను!"

"ఇప్పుడా ఆలోచన లాభంలేదు. చాల ఆలస్యం అయిపోయింది. ఏమయినా మనం పారిపోకుండా వుండాల్సింది. జర్మనులు యావత్తుజనాన్ని చంపివుండేవాళ్లు!"

"నేనూ ఆజ్ఞమేరకు ప్రవర్తించాను. ఇప్పటికే నా సైన్యంలో సగం తగ్గిపోయింది. ఇళ్ళన్నీ మొదలునరికిన చెట్లలా కుప్పకూలుతున్నాయి!"

"సైనికుల దృక్పథం ఎలావుంది?"

"నా మనుష్యులు చివరిదాకా యుద్ధంచేస్తారు."

కర్నల్ ముఖాన్ని చేతిరుమాలతో తుడుచుకుంటూ "ప్రజాసైన్యం మాటేమిటి? నాకు వాళ్ళ ధోరణేమీ అర్థం కావడం లేదు" అనడిగాడు.

"వాళ్ళఆఫీసర్లంతా దాదాపు చనిపోయారు. వాళ్ళలో కొంతమంది జొలిబార్‌కు పోదా మనుకుంటున్నారేమో!"

"మనం ఆ దారిని కట్టుదాటుచేశాం కదూ?"

కమాండర్ గోడమీద పూర్వం బొమ్మలు తగిలించిన స్థలాలు చూస్తున్నాడు. "పాతపట్టణాన్ని రక్షించలేం; యిరుకు

గొందులు, పాతయిళ్లూను! ఇప్పుడు అది పేరుకైనా మిగిలి లేదుగా. నీటికొరత ఎక్కువగా వుంది ఇంకా కొద్దిరోజులపాటు యింతే!"

"ఆ తరువాత?"

"కేంద్రానికి సరాసరి త్రోవ కనిపెట్టాలి!"

కర్నల్ నింపాదిగా తలవూపుతూ వింటున్నాడు.

"ఈ మార్గాలు అన్వేషించాలి. సాల్విన్ తోటచుట్టూ వున్న జర్మన్ స్థావరాలు చాల బలిష్టమైనవి. బహుశ యిది చివరి అవకాశం అనుకుంటాను!"

"దాని సాధించటం ఎలాగాఅనేదే ప్రశ్న! ఈవిషయం నగరంలో ఎవరికీ తెలియకూడదు. తెలిస్తే పెద్దగొడవ!"

"మనం యేదన్నా ప్రణాలిక తయారుచేసి పైకిపంపాలి!"

కర్నల్ యేదో ఆలోచించుకుని చివరకు యిలా అన్నాడు: "మనచర్యలు ప్రపంచానికి లీలామాత్రంగానే కనిపిస్తున్నాయి. ప్రపంచం నిర్లక్ష్యంతో చూడలేదు. ఆమ్మి్మక వైభవాన్ని గురించి వార్తా ఒక పుట వ్రాస్తోంది!"

కమాండర్ దృష్టి కిందికి దించాడు.

"ఏది యేమయినా – కనీసం మన మనుష్యుల నయినా రక్షించుకునే ఉపాయం ఆలోచించాలి!" అన్నాడు.

## 12

నేను తిరిగి కాథరైన్‌ను చూడలేను. ఆమె ముఖం కళ మారిపోయి వుంటుంది. ఆ ముఖంలో వెనుకటి మందహాసం చూడలేను. కాలం దాన్ని ధ్వంసం చేయగలిగితే ఒకప్రాణికి

మరో ప్రాణి మీద వుండే ఆత్మీయత యెంతకనుక ? ఇప్పుడు నా వయస్సు 24 సంవత్సరాలు కాదు. ముప్పై ఆరు యేళ్ళన్నా వచ్చివుంటాయి.

అసలు కాథరైన్ అనే మనిషి వుందా ? ఆమెను మొదట చూచినప్పటికీ యిప్పటికీ నాలో యేమన్నా మార్పు వుందా ? ఈ భూమిమీద నా సంకల్పమంతా నెరవేరుతుంది. ఇలా అతనికి ఎన్నో విచిత్రమైన భావనలు కలుగసాగాయి.

కొన్ని క్షణాల క్రితం తనతో లాంఛనంగా కరస్పర్శ చేసినవాళ్లు యిప్పుడు మృత్యుముఖంలో పడివుంటున్నారు.

పాతనగరం చుట్టుముట్టబడింది. శత్రువు దక్షిణంనుంచి దండెత్తివస్తున్నాడు. నగర కేంద్రానికి దగ్గరగావస్తూ ఉత్తరం నుంచికూడా కొన్ని సేనలను రమ్మని ఆజ్ఞాపించాడు. దక్షిణాన ప్రజలమీద బాంబులు మొదలయిన మారణాయుధాలు వేస్తున్నారు. సెంట్ జాన్ కాథడ్రెల్ చుట్టూవున్న సన్నని గొందుల్లో విడవకుండా తుపాకి పేల్పులు వినవస్తున్నాయి. ప్రతిమూలనుంచి యుద్ధం ప్రకోపిస్తోంది.

నిశ్శబ్దంగా వున్నప్పుడు యిరుపక్షాలవారూ యేంజరుగుతున్నదీ వినగలుగుతున్నారు. జర్మనుల వైపునుంచి రైనునదీ తీరపు పల్లెపదాలు వినవస్తున్నాయి. ఇవతలిపక్షంలో ఒక విద్యార్థి పియానోమీద తన ఇష్టమైనగీతం వాయిస్తున్నాడు. అతని కుర్చీకింద రివాల్వర్ భద్రంగావుంది. పాతనగరానికి ఉత్తరంగా, 1943లో వినాశానికి గురిఅయిన ఆవరణవుంది. పది పదిహేను రోజులక్రితం యీదారిన జొలిబార్జ్‌కి వెళ్లటం సుగమంగా వుండేది. అటునుంచి అడవిలోకి పారిపోవటం తేలికగా

వుండేది. ఇంతలో ఆశ్చర్యకరమైన సంఘటన జరిగింది. చేతి తుపాకులు, ఆటోమాటిక్ ఆయుధాలు ... ఇలాటివి ఎన్నో పేలాయి. మనుషులను సజీవంగా మారణంచేసే మంటలు మహోజ్వలంగా మండుతున్నాయి. ఇళ్ల కిటికీలోంచి జర్మను తుపాకులు ఎటు గురిచూచివున్నాయో తెలుస్తూనే వుంది. ఇంకాపైన, నదీగర్భం, తీరం అగుపిస్తున్నాయి. అయితే రష్యన్లు ఎక్కడ వున్నారో ఎవరూ ఎరగరు.

సీల్ ముందునరుసలోకి బదిలీచేయమని కోరుకున్నాడు. అతనికి కళ్లముందు జరిగేదంతా స్పష్టంగా కనిపిస్తోంది. ఇంకా కొద్దిక్షణాలలో తను కాథరైన్‌దగ్గరకు చేరుకోగలడు. ఆమె చెక్కిళ్లను నిమరగలడు. నిద్రపోతున్నప్పటి ప్రశాంతమైన ఆమె ముఖారవిందాన్ని చూడగలడు. కాని ఇప్పుడు తను విధిని నిర్వర్తించాలి. ఇప్పుడు ఇదే అమితముఖ్యం. తను యెంతో ముసలివాడైనట్లు తనరోజులన్నీ లోగడే గడిచిపోయినట్లు భావించుకున్నాడు.

ఏదీకూడా అనుకున్నట్లు, ఊహించినట్లు ముగియటం లేదు. జీవితం చుట్లు తిరుగుతోంది. విషయాలకు వివరణలు పెరిగిపోతున్నాయి. అనేక చిక్కులు వస్తున్నాయి. కొత్తమను షులువస్తున్నారు. కాలంతోపాటు ఎన్నోమార్పులువస్తున్నాయి.

శిథిలమైన ప్రాంతంలో ఎత్తయిన భవనం ఒకటుంది. దాని కిటికీలలోంచి శిథిలతరభాగాలు విశదంగా కనిపిస్తున్నాయి. పద్దెనిమిది మాసాలక్రితం ఇక్కడ ఇళ్ళువుండేవి. ఆ ఇళ్ళ కిటికీలగుండా యూదులు జర్మనులపైకి తుపాకులు పేల్చేవారు. ఆ వసంతఋతువు అతనికి గుర్తువచ్చింది. పైనుంచివచ్చిన ఆజ్ఞల

మేరకు తను బాగుచేసిన తుపాకులన్నీ అక్కడికి పంపబడ్డాయి. దీన్ని అలావుంచి, తతిమ్మావిషయాలలో అతను కేవలం చూపరియే. క్రాసిన్‌స్కీ చదరంలో జర్మన్ తుపాకులనుంచి తప్పించుకోవటానికి అటు ఇటు పరుగెత్తుతున్న పిల్లలవంక చూస్తూ నిలుచున్నాడు. తుపాకులు పేలటం, గుండ్లు దూసుకు పోవటం, చావు కేకలు— వినాశం, అంతా కళ్ళముందు క్షణంలో జరుగుతోంది. తగులబడుతున్న భవనాలమీదుగా పొగ ఆకాశంలోకి వెడుతోంది. వృద్ధులైన స్త్రీలు "ఇప్పుడు యూదు లను కాలుస్తున్నారు. తరువాత మనవంతు!" అనుకున్నారు. ఎన్నో వేల మరణాల ముద్రలు ఆస్థలంలో వున్నాయి.

ఆ భవనంగట్టిదే. తుపాకి పేల్పులకు విచ్చిపోయిన సున్నం మటుకే రాలుతోంది. కాని భవనాని కేలా పెద్దదెబ్బతగలటం లేదు. కిటికీలలోంచి రక్షకులుకూడా తుపాకులు పేలుస్తూ జర్మనులను దూరంలో వుంచటానికి ప్రయత్నిస్తున్నారు. సుమారు యేడువందల గజాలదూరంలో వున్న పురాతన గృహం ఒకటి అప్పుడే శత్రువుల అధీనం అయింది.

భూగృహాలలో అమ్మాయిలు భోజనపదార్థాలు సమ కూరుస్తున్నారు. అక్కడకూడ యేమీ పనిలేనివాళ్ళు నిద్రపోతు న్నారు. వాళ్ళలో చాలమంది పదిహేడు పద్దెనిమిది సంవత్స రాల కుర్రవాళ్ళు, కొందరు మరీపెద్దవాళ్ళుకూడా వున్నారు. క్రమ క్రమంగా సీల్‌కు యిక్కడిమనుష్యుల్ని గురించి తెలియనారం భించింది. ప్రతివ్యక్తికి వెనుక బోలెడుగాథ వుంది; బోలెడు చరిత్రవుంది!

# 13

డాన్, నాయకుడు. యుద్ధానికిముందు అతనుకూడా ఒక ఉద్యోగిగా వుండేవాడు. అతని తలకు గాయం, కట్లు వున్నాయి. అతను తగు మోతాదులో వోడ్కా తాగి నిషాగా వుంటాడు. అంతేకాని ఎప్పుడూ విపరీతంగా తాగడు.

యుద్ధానికిముందు "మైకేల్" జాతీయవిప్లవపంథాకు గురువు. ఏవేవో గూఢపత్రికలకు సంపాదకత్వం వహిస్తూవుండేవాడు. పోర్చుగల్‌లో సాలాజర్‌పాలన మాదిరిగా యిక్కడ కూడా మతం, శక్తి దృష్టిలోవుంచుకుని తయారుచేసిన సాంఘిక వ్యవస్థ వర్ధిల్లాలని వ్యాసాలు వ్రాస్తూ వుండేవాడు. ఒకబాంబు అతని ముద్రాపకయంత్రాలను నాశనం చేసినతర్వాత యిటు వచ్చాడు. అతనిభార్య రెడ్‌క్రాస్‌సంస్థలోనర్సు పాతనగరంలో ఉన్న హాస్పిటల్‌లో ఉద్యోగం. "డాన్" మైకేల్‌పట్ల గౌరవ మర్యాదలు చూపుతూ అతన్ని బెర్ట్రాండ్‌నుంచి కాపాడుతూ వుంటాడు.

బెర్ట్రాండ్ – అతను అదృష్టజాతకుడు కనుక అతన్నేమీ తప్పుపట్టి ప్రయోజనంలేదు. కాని డాన్ దృష్టిలో అతని పన్నుగడలన్నీ వమ్మయినాయి. అతని వయస్సు ఇరవైరెండు. టెక్నికల్ కాలేజినుంచి నేరుగా వచ్చాడు. నిదానంగా ప్రశాంతంగా వుంటాడు. సైన్యంపట్ల, యుద్ధంపట్ల అతనికి వున్న అసహ్యాన్ని దాచుకోవటానికి ప్రయత్నించేవాడు కాడు. సైన్యంలోని వారంతా అతన్ని శాంతిప్రియుడు అని పిలుస్తుండేవారు. ఒకరోజు గాయపడిన జర్మన్‌సైనికుణ్ణి రక్షించాడు. అతని తరహా

యేమిటో ఎవరికీ అర్థమయ్యేదికాదు. అతని ధోరణి అర్థం చేసుకోవటం ఎవరికీ తరంకాదు. యుద్ధానంతరం అతను గణిత తర్కశాస్త్రం అభ్యసించాలనుకున్నాడు. బెర్ట్రాన్డుకు మైకేల్ దర్శనం ప్రమాదకరం. అతనితో స్నేహంగావుండాలని ప్రయత్నించాడు. కాని రెండు మాటలు మాట్లాడటంతోటే నిరుత్సాహం ముంచుకువచ్చి దూరంగా వెళ్లేవాడు. మైకేల్ మూలంగా అతనికి తనుచేస్తున్నపని వివేకాన్ని సందేహించాల్సివస్తోంది. సీల్‌తో ఒకసారి "ఈ మనిషి హింసావాది. ఇలాంటివాళ్ళతోనే స్నేహం చేయాలి!" అన్నాడు. మైకేల్‌కు కోపంవచ్చి అందరినీ ఒకసారి తిట్టాడు. డాన్ ఓపికగా అదంతా విన్నాడు. కేవలం సిద్ధాంతాలతోను పుస్తకాలతోను బెర్ట్రాన్డు లక్ష్యాలను మెచ్చుకోగలగటం అతనికి చేతకాలేదు.

వైద్యశాఖలోవున్న 'విలా'కు పద్దెనిమిదేళ్ళువుంటాయి. బొద్దుగా పొట్టిగా వుంటుంది. తెల్లనిశరీరం, ఎర్రనిజుట్టు, తన హుందాతనంవల్లనే కుర్రవాళ్ళనందరినీ అదుపులో పెట్టుతూ వుంటుంది. అదేశాఖలోవున్న 'మార్గా' మరోరకంగా వుంటుంది. ఎవరూ ఆమెమాట వినరు.

కెప్టెన్ ఓస్మన్‌యొక్క పాతజీవితాన్నిగురించి ఎవరికీ యేమీ తెలియదు. 'ఎయిర్‌ఫోర్స్ ఆఫీసర్ల' యూనిఫారం వేసుకుంటాడు. అతని ఎడమకంటిమీద నల్లనిమచ్చ వుంటుంది. తలమీద చదునైన టోపీ వుంటుంది. ఒక్కొక్కసారివన్నెండు గంటలదాకా కనపడకుండా మాయమవుతూవుంటాడు. అందరూ గందరగోళ పడుతూవుంటారు. ఇంతలో అతను ప్రత్యక్షమై

యేదో అసంగతవిషయాన్ని గురించి ఉపన్యాసం యిస్తాడు. జర్మనులను వేటాడటంలో తీరుబడిలేకుండా వున్నదంటాడు.

ఓస్మాన్‌కు, మార్గాకు మధ్యజరిగిన కథ యిది. మార్గా తనను ఇంటిపైదాకా తీసుకువెళ్ళమని కోరింది. 'భయపడతా వేమో' అన్నా డతను. లేదన్నది. కాని భయపడనని తనకు మాత్రం రూఢా? వాళ్ళిద్దరూ పైఅంతస్తుకు వెళ్ళారు. ఓస్మాన్ ఆమెకు అక్కడున్న రంధ్రాన్ని చూపించాడు. ఈ రంధ్రం నేలమట్టంనుంచి పైకప్పుదాకా వుంది. "జర్మనులకు కనిపించే ట్టుగా ఇక్కడనుంచో" అని ఆజ్ఞాపించాడు.

ఆమె అతనివంక కోపంగా చూచింది.

"మరి నీవు భయపడ నన్నావుగా!"

"వాళ్లు నన్ను చూడటం తటస్థిస్తే, కాల్చి చేస్తారేమో!"

"అవును; నా క్కావలసింది అదే. వాళ్లు కాల్చటం మొదలెట్టింతర్వాత వాళ్ళపని పడతాను!"

మార్గా భయపడింది. కాని ఆ భయాన్ని పైకి వ్యక్త పరచటానికి సిగ్గుపడింది. "ఊరికే నాతల ముందుకువంచాను. వెంటనే వెనక్కు తీసుకొన్నాను. ఇంతలోనే జర్మనులు నెత్తి నట్లు కాల్చ నారంభించారు."

ఓస్మాన్ మార్గాను తన కిటికీదగ్గరకు పిలిచాడు. ఆమె చేయిపుచ్చుకొని వేలితో ఎట్లోచూపాడు కిటికి తెరలవెనుక, శత్రుగృహంలో, ఒక శవం వేలాడుతోంది. చేతులు వూగలు తున్నాయి. జర్మనులు కాళ్ళుపట్టుకొని వెనక్కు లాగుతు న్నారు. ఈప్రకారంగా మార్గా జీవితరేఖ ఎవరో తెలియని

వ్యక్తి, జీవితరేఖకు అడ్డంగా వెళ్ళింది. ఆ వ్యక్తి ఎవరయినా కావచ్చు, హైడెల్‌బర్గ్‌లో వాచ్‌రిపేరరు, బెర్లిన్‌లోవనివాడు. నల్లఅడవిలో రైతు - వీరిలో అతను ఎవరయినా కావచ్చును. వివరంమట్టుకు ఎవరికీ తెలియదు.

## 14

డౌన్, మైకేల్, బెర్ట్రాన్డు మధ్య అంతర్యుద్ధం, ఫాదర్ ఇగ్నాషస్ వచ్చిన రోజుకు ధారస్థాయిని అందుకుంది. అత నొక బల్లమీద కూచున్నాడు. అతని జుబ్బా చిరిగి పేలి కలై వేలాడుతోంది. అతని రాక క్షణంలోనే ఇంటిలోని వాళ్ళందరికీ తెలిసిపోయింది. అతనుకూడా తమతోచేరినాడన్న వార్త అందరికీ కొత్త ఉత్సాహాన్ని కలుగజేసింది. ప్రపంచ మంతా సక్రమమార్గాన పడినట్లయింది. ఇది కేవలం సాధా రణమైన యుద్ధం. సీల్ ఫాదర్ ఇగ్నాషస్‌ను గుర్తుపట్టాడు. అతని నిజనామం సీల్‌కు తెలుసు. ఆ గంభీరమైన ముఖం, నల్లనికళ్లు, సన్నని పెదవులు, హుందాతనం అంతా కొట్టవచ్చి నట్లు కనిపిస్తోంది. అందరూ ఆయనకు సాష్టాంగనమస్కారం చేశారు. బెర్ట్రాన్డు దూరంగా నిల్చున్నాడు. తదేకంగా ఆ దృశ్యంవంక చూస్తున్నాడు. సీల్‌కు తను యేం చేయాల్సింది తోచలేదు ఇతరుల చర్యలకు చేష్టలకు భిన్నంగా ప్రవర్తించటం దుర్భరం. బెర్ట్రాన్డు పైకి వెళ్ళాడు. అతనొక్కడే మేడ మీదికి వెళ్ళటం సీల్‌కు బాధకలిగించింది. ఊహు, ఇప్పుడు అతన్ని ఒంటరిగా మిగిల్చి ప్రయోజనంలేదు.

అతను పరుగెత్తుకుంటూ వెళ్ళి మేడమీదికి చేరుకున్నాడు. బెర్ట్రాన్డ్ వెనక్కితిరిగి చూశాడు. అతని ముఖంలో కృతనిశ్చయం కనిపిస్తోంది. అతను ఆగాడు. నింపాదిగా నవ్వాడు. ఏడుస్తున్నట్లుగా అతని పెదవులు కదులుతున్నాయి.

ఇద్దరూ పక్కపక్కనే నేలమీద సాగిలపడుకుని గోడ సందుల్లోంచి జర్మనుస్థావరాలను పరిశీలిస్తున్నారు. యుద్ధం సవ్వడులు ఒకొక్కసారి బిగ్గరగా ఒకొక్కసారి నిదానంగా వినిపిస్తున్నాయి. బెర్ట్రాన్డ్ సీల్ వంక తలతిప్పాడు. తన రైఫిల్ కొన గట్టిగా పట్టుకుని ఇలా అడిగాడు: "అక్వినస్ ఎవరో నీకు తెలుసా?"

"ఆఁ, తెలుసు. ఇదివరలో తలుచుకుంటూ వుండేవాడిని!"

"అతను గణితశాస్త్రతర్కం ఎందుకు ఉపయోగిస్తాడో తెలుసా?"

"ఆఁ!"

ఫాదర్ ఇగ్నేషస్ దేవు డున్నాడని నిరూపించటానికి గణితశాస్త్ర తర్కమీమాంస వాడాడు. ఆరోజుల్లో ఎందరో విద్యార్థులను ఆహ్వానించి రహస్యోపన్యాసాలు ఇస్తూవుండేవాడు. సీల్ ఇటువంటి ఉపన్యాసాలు మూడు విన్నాడు. మొదటిరెండు అభిరుచిదాయకంగా వున్నాయి. కాని ఫాదర్ చెప్పే కారణాకారణాలు, వ్యాఖ్యానాలు అంత సమంజసంగా తోచలేదు. మూడవ ఉపన్యాసంలో ఫాదర్ యిగ్నేషస్ తన "మెటాఫిజిక్స్"కు రాజకీయాలతోవున్న ఆంతర్యాన్ని వివరించాడు.

"సీల్, నీవెప్పుడైనా థామస్ మాన్ రచించిన - విచిత్ర పర్వతం - చదివావా?"

"ఆఁ. చదివాను–"

"అందులో మతాచార్యుడైన నాఫ్తాకు, సెట్టిబ్రిన్‌కు జరిగే వాగ్వివాదం గుర్తుందా ? నేనయితే చివరివరకు సెట్టి బ్రిన్ పక్షం వుంటాను!"

"అవును. బెర్ట్రాన్డు చెప్పింది నిజమే. ఫాదర్ ఇగ్నాషస్ • నాఫ్తావంటివాడే, చాల విచిత్రం! మూడవ ఉపన్యాస సందర్భంలో అతని ముఖం ఎలావుంటుందో నాకు గుర్తులేదే! ఎందువల్ల ?"

ఈ ఉపన్యాసం తరువాత సీల్‌కు మతవిషయంలో అభిరుచి చచ్చిపోయింది. సెయింట్ ఆగస్టయిన్ తిరిగి చదవాలనే కోరిక నశించటానికి ఫాదర్ ఇగ్నాషస్‌యే కారకుడనుకున్నాడు.

అయితే తను యెందుకు నివేదన చేయకూడదు ? తన నివేదన ఫాదర్ ఇగ్నాషస్ సమక్షంలోనే ఎందుకు జరగకూడదు. అదికూడా యే కొండముందో ఆకాశంముందో, సముద్రంముందో తన పాపాలకు నివేదన ఇచ్చుకున్నట్లు కాదా ? అయినా తను ఎందు కీ పని చేయాలి ? తను యీ పని చేస్తున్నాడా లేదా అనేది ముఖ్య విషయంకాదు.

సీల్ కిందుగా చూచాడు. యుద్ధం, నగరం, కాథరైన్! [ఇప్పుడు కాథరైన్ యేం చేస్తూవుంటుంది?] భూమిని చూచాడు. ఇక్కడ బెర్ట్రాన్డుతోబాటు వుండటమే శ్రేయస్కరం. బెర్ట్రాన్డు తన పక్కనే సజీవంగా తన సహాయం కోరుతూ పడివున్నాడు. ఈ క్షణం చాల ముఖ్యమైనదని సీల్‌కు

తెలుసు. ఇదే నిజమైన స్నేహానికి నాంది. బెర్ట్రిన్డు దీక్షకి, నిశ్చయానికి అతనికి అసూయ కలుగుతోంది. బెర్ట్రిన్డు సామాన్యంగా కాలకృత్యాలు తీర్చుకున్నట్లే స్నేహాన్ని కూడా నిలుపుకుంటాడు. పరిస్థితులకు అనుగుణంగా ప్రవర్తిస్తాడు. సీల్ ఇదంతా ఆలోచిస్తూవుండగా శ్రద్ధగా – అతిశ్రద్ధగా – ఆలకిస్తూ బెర్ట్రిన్డు యిలా అన్నాడు: "ఒక్కొక్కప్పుడు మనం చదువుతూ వచ్చే విషయాలే నిజం అవుతాయి. ఈరోజు నాలాంటి మతాచార్యులరోజు ఎరుపో, నలుపో! అందుకే నేను బ్రతికివుండకూడదు!"

ఫాదర్ ఇగ్నాషస్ దొడ్డో – గుహాకు వెళ్లే మెట్లవరుస పైన కూర్చున్నాడు. నివేదనలన్నీ విన్నాక, ఇతరుల జీవిత గాథలు విషాదాల వివరాలు అన్నీ అతని కడుపులో తిప్పినట్లు అయినాయి. పాపం, యీ పిల్లలు! వీరి దుర్మరణానికి కారకుడు తను. వృత్తిధర్మంగా తను త్యాగాన్ని ప్రోత్సహించాడు. తనే కారకుడనటంలో యేమాత్రం అతిశయంలేదు, సందేహం లేదు. కాని నిజానిజాలు చర్చించవలసిన తీరుతెన్నులు ఇవేనా? ఉన్నట్టుండి అతనికాళ్లు భయంతో అల్లాడిపోసాగినాయి. మాసిపోయిన చేతిరుమాలుపైకిలాగి నుదుటిమీది భయమనే చెమటను తుడుచుకున్నాడు. ఎదురుగావున్న మైకేల్ అంతర్మథనలో లీనమైనాడు. మైకేల్ ఏమీ గ్రహించకుండటానికి, అతనుకళ్లు మూసుకున్నాడు. కళ్లుమూసుకుని తుపాకులపేల్పులు వింటున్నాడు. ఈ పేల్పు కాస్సేపాగి దానంతట అదే ఆగిపోతుంది. తనుపైకి లేచేముందుగానే ఆగిపోతుంది. అతను

మైకేల్‌ను "అందరూ నివేదనలు చేయటం అయిపోయిందా?" అనడిగాడు.

"ఆ! అందరిదీ అయింది. కాని మేడమీద యిద్దరున్నారు. వాళ్ళకు నివేదన యిష్టంలేదట!"

"వాళ్ళు కమ్యూనిష్టులా?"

"కాదు. కాని ఆ మతాలోవాళ్ళే! విద్యార్థులు. ఒకడు మతవాది. నాడీ బ్రహ్మత్కంతో గూడుకట్టింది రెండోవాడు ఒక సోషలిస్టు కుటుంబానికి చెందినవాడు. రాడికల్ తత్త్వంతో సతమతమవుతున్నాడు."

క్రీస్టు తన శరీరంలోని భయంతో పోరాడుతున్నాడు. ఈ భయమనేవ్యాధి తన శరీరంలోవుంది. ఇది కేవలం తన స్వంతం, వ్యక్తిగతం అంటువ్యాధిలా మరొక వ్యక్తికి అంటదు.

"మైకేల్ ? శక్తిని నిరసించేవాడు యింక బలాన్ని ఎక్కడనుంచి తెచ్చుకుంటాడు. ఇప్పుడు మనం విన్న నివేదనలు చేసిన వాళ్ళ పాపాలుయేమిటి?" గాయపడ్డాడని ఎరిగికూడా ఒక జర్మనును తుపాకితో పేల్చి చంపటం పాపం అవునా కాదా అని ఒకరు నన్ను అడిగారు. ఈ యువకులు తమ పవిత్రతనే ఆలంబనగా తీసుకొని శక్తివంతులై వున్నారు!"

మైకేల్ తన గడ్డాన్ని సవరించుకున్నాడు.

"చాలమందికి – యీ కుర్రవాళ్ళకు కూడా – పోరాటం అనేది కేవలం విధి! దేవునిపట్ల మాతృదేశంపట్ల నిర్వర్తించవలసిన విధి. కాని కొందరికి యిది ఆత్మహత్య వంటిది!"

క్రీస్టు సూర్యునివైపు తిరిగాడు. పొగమేఘాల వెనుక మండుతున్న ముద్దలా సూర్యుడు వెలుగుతున్నాడు.

"ఎన్నో చావులు! మన ఆశలు, జాతీయవికాసాలు! ఇదంతా ఎక్కడినించి వస్తోందో తెలుసుకోలేకపోతే మీరంతా గుడ్డివాళ్ళన్నమాట. వాళ్ళ నాగరికత! పునరుజ్జీవనం, జీవన వికాసం, మతతత్త్వం, ప్రజాస్వామిక రూపాంతరం! ఆమెరికన్లు, బోల్షెవిక్కులు కలిసిచేసుకున్న సంధి. పశ్చిమం! పశ్చిమం! ఆ పశ్చిమతీరం ఒకప్పుడయినా అర్థంచేసుకుంటుంది, ఇక్కడేం జరిగిందో తెలుసుకుంటుంది. కాని అప్పటికి చాలా ఆలస్యం అయిపోతుంది. సమయం మించిపోతుంది!"

మైకేల్ బుసలుకొట్టాడు.

"ఈవద్ధతే వాళ్ళకు చాలాపీలు. వాళ్ళ సిపాయిల ప్రాణాలు రక్షించుకున్నారన్నమాట. అన్నిటికంటె ప్రాణాలు విలువైనవి! కాని యీ ప్రాణాలవిలువలు, లక్షణాలు ఎలా వున్నా ఒకటే... ఒకటే!"

"చర్చిజరిపిన పోరాటమంతా సవ్యమైనదే! వాళ్లు కేవలం తమ జేబులునింపుకొనేందుకు అనుకూలించే వాదాన్ని సమర్థించారు. తమజేబులు నింపుకొన్నారు. వాళ్ళకు చావటం ఇష్టంలేదు!"

ఫాదర్ ఇగ్నాషస్ అకస్మాత్తుగా పైకిలేచాడు.

"వాళ్ళు జీవితాన్నిపట్టుకొని వేలాడుతారు. సహాయానికి స్టెప్పీలనుంచి బాగ్జేరియన్లను తీసుకువస్తారు. వాళ్ళు తమ రక్తం విలువ ఎరుగుదురు. సిరికివాళ్ళ రోమన్ సామ్రాజ్యం పడిపోయింది!"

ఫాదర్ ఇగ్నాషస్ వెళ్ళిపోయిన తర్వాత మైకేల్ బెర్ట్రినుతో యేవిషయం మాట్లాడటానికైనా స్వస్తిచెప్పాడు.

అప్పటినించి అతనితోను సీల్‌తోను ముభావంగా వుండేవాడు. డాన్ వారివంక ప్రశ్నార్థకంగా చూస్తూవుండేవాడు. ఇద్దరి ప్రవర్తనలోను అసంగీకారం వ్యక్తమవుతూవుండేది. వారి అనుబంధం తెగిపోయింది.

# 15

కెప్టెన్ ఒస్మన్ మరణం ఎవరూ ప్రత్యక్షంగా చూడలేదు. ఫాదర్ ఇగ్నేషస్ సందర్శనసమయంలో అతను దండయాత్రలోవుండి రాలేకపోయాడు. కొత్తసైన్యం ఆవరణ దాటి నడుస్తూవుండగా కెప్టెన్ నల్లనిటోపీ వారి పాదాలదగ్గరపడింది. వాళ్లు మేడమీదికి పరుగెత్తారు. అతను వెల్లకిలా పడివున్నాడు. అతని ముఖమంతా రక్తమయమైవుంది. చేతులు బార్లజాపుకొని వున్నాయి. అందరూ అతనిచుట్టూ చేరారు. కొందరు యేడుపుఆపుకోవటానికి ప్రయత్నిస్తున్నారు. ఈ కుర్రవాళ్ళకు కెప్టెన్ దైవసముడు. డాన్ కిందికివచ్చి ఓస్మన్ నల్లని యూనిఫారం జేబులన్నీ తడిమిచూచాడు. అతని సంచిలోంచి కొన్ని కాయితాలు ఇవతలకులాగి అతని నిజనామధేయం చదివాడు. ఒక యువతి ఫోటోలు కొన్ని కిందపడ్డాయి. ఆయువతి ఒడిలో చిన్న బాలికకూడా వుంది. డాన్ చేతిసంచి మూసివేసి తన జేబులో వుంచుకున్నాడు. 'అయితే ఇతనికి సంసారంకూడా వుందన్నమాట. మనం వాళ్ళను కనిపెట్టి, ఇతని వస్తువులన్నీ వాళ్ళకు చేర్చాలి!' వాళ్ళు అతన్ని కిందికి మోసుకువెళ్ళి ఆవరణలో అన్నిసమాధులపక్క పాతిపెట్టారు.

ఆ రాత్రి సీల్ మాగ్దాచేయిపట్టుకుని–దేన్నిగురించిప్రత్యే

కంగా ఆలోచించకుండా–గంభీరంగా నిట్చున్నాడు. ఇల్లంతా చీకటిగావుంది. దూరంగా వెలుగు మారుతూ కనిపిస్తోంది. ఆ వెలుగులో కొందరు నిశ్చలంగా నిలుచున్నట్లు అగుపించింది. సీల్ వాళ్ళు మనుషులు కాదనుకున్నాడు. బహుశ అక్కడ చంపబడ్డవాళ్ళ తాలూకు ప్రేతాలేమో! ఆ ఆకారాలు క్రమంగా కదిలిపోసాగినాయి. వాళ్ళు జర్మనులా?

"కాల్చకండి! ఎవరో అరిచారు. ఒక క్షణం తర్వాత తిరిగి అదేకంఠం ఇలా వినిపించింది: 'వాళ్లు సెయింట్ జాన్ వైద్యాలయంలోని రోగులు!'

ఇప్పుడు సీల్ వాళ్ళను స్పష్టంగా చూడగలిగాడు. వాళ్ళు తెల్లనిదుస్తులు ధరించి చేతిలో పచ్చని చెట్టుకొమ్మ లతో యేవో మంత్రాలు జపిస్తున్నారు. చీకటిలో మాయమవుతూ తిరిగి వెలుగు ప్రసరించినప్పుడు కనుపిస్తున్నారు. వాళ్లు ఒకసారి చుట్టూ తిరిగారు. తరువాత వెనక్కు నడిచారు.

విలా, మాగ్దా గుహాలలోనుంచి పైకివచ్చారు. ఆ క్షణంలో కొన్ని తుపాకిగుళ్లు శత్రుస్తావరంనుంచి ఆ తెల్లని ఆకారాలవైపు దూసుకుపోయాయి. మాగ్దా సీల్‌చేతిని పట్టుకుంది. ఆమె చేయి వేడిగా వుండటం అతను గమనించాడు. తరువాత మరో మానవాకారం! శరీరం వేడిరక్తంతో ఉడికిపోతోంది. ఆ ఆలోచనలు, గతము, స్మృతులు, యేకాంతము తిరిగి స్తావరించుకున్నాయి. తను ప్రత్యేకవ్యక్తి కావటం అసాధ్యం! తనలో ప్రత్యేక శక్తులన్నీ ఎప్పుడు నశించాయి.

జాలి, ఆప్యాయత - మాగ్డా అంటే తనకేమీ తెలియదు కనుక, యేమీ తెలుసుకోనవసరంలేదు కనుక ! పూర్తిభద్రత, గతానికి - భవిష్యత్తుకు సంబంధంలేని భద్రత !

ఆ ఆకారాలు అదృశ్యం అయినాయి. ఆ స్థలం తిరిగి ఖాళీ అయింది. సీల్ దూరంగా వున్న చెట్లను చూస్తున్నాడు. మాగ్డా చేయి అతనికి తగిలింది. తనచేతిలోకి తీసుకున్నాడు. ఇప్పుడు ఆమె చేతిలో భయంలేదు. తనపక్కనే నిలుచుని వున్న ఆమెలో తన భావనలలో ఒకటిగాని, తన ఆలోచనలలో ఉద్రేకాలలో ఒక పొరగాని లేదనుకున్నాడు సీల్. క్షణాలు, నిమిషాలు, గంటలు ! వాళ్లు నిశ్శబ్దంగా వున్నారు. హెచ్చరిక లేకుండా వచ్చిన దృశ్యానికి సాక్షులు.

ఆమె వెళ్ళిన తర్వాత అతని కో స్వప్నం వచ్చింది. అందవికారంగా వున్న బాలిక వివరీతంగా యేడుస్తూ బట్టలు పైకెత్తుకుని పడవ యెక్కటానికి పరుగెత్తుతోంది. ఆ పడవ ముందుగా పరుగెత్తుకు పోంతోంది. తనుకూడా పడవ వెనుక యీత కొడుతున్నాడు. అమ్మాయివంక వెడుతున్నాడు. చేతులు చాచుకొని, రక్తసిక్తమైన ముఖంతో ఓస్మాన్ ఎదు గని నగరాలనుంచి దేశాలనుంచి వస్తున్నాడు.

ఆకాశంలో వెలుగుదీపాలు యిటు అటు కాంతులు వెదజల్లాయి.

బెర్ట్రిన్డు "ఇవాళ జర్మన్లు మన వెనుక ఇళ్ళు రెండు ఆక్రమించుకున్నారు. మనపని ఐపోయినట్లే - అంతా సంసిద్ధులై వుండండి!" అన్నాడు.

# 16

ఆ రాత్రి గుహాకు వెడుతున్న దారిలో ఎవరో తనభుజం తట్టినట్లయింది. ఆ చీకట్లో ఆగిపోయాడు. గుండె ఝల్లుమన్నది. ఆ అమ్మాయి తనచేయి పుచ్చుకుంది. తనబాల్యం గుర్తుకు వచ్చింది. ఈ దృశ్యానికి తను భయపడాలో అక్కర్లేదో – యేంచేయాలో అర్థంకావటంలేదు. దీనికి మొదలులేదు, తుది లేదు. భయంలేదు, మృత్యువులేదు. ఒక మానవునికి మరో మానవునికి మధ్య అడ్డంకిలేదు. అతను ఆమె వొంపుకు ముఖం అనించి, ఆమె హృదయంలోని ఆక్రందనలను విన్నాడు.

తరువాత చీకట్లో ఆమె కంఠస్వరం మంద్రస్థాయిలో వినిపించింది – "ఈ సూర్యుడు, ఈ నక్షత్రాలు... అన్నీ మనంపోయిన తరువాతకూడా యిలాగే వుంటాయి!"

అతని వేళ్ళు ఆమె వేళ్ళను వెదికి పట్టుకున్నాయి. కను రెప్పలు మూసుకుని వున్నాయి. కనుకొసలు తడిసివున్నాయి.

తిరిగి ఆమె కంఠం వినిపించింది. ఈసారి తనతో కాకుండా ఊరికే పైకి అన్నట్లుంది: "తీరుబడివుంటేనా? సంధ్యాసమయంలో ముసలమ్మలు యిళ్ళముందు కూర్చుని –"

అతనిచేతికింద మెత్తని గడ్డంతగిలింది. ఆమె మూతి రాతితో చెక్కినట్లు వంపులుతిరిగివుంది. కాథరైన్ కనురెప్పలు! ఈ ఇద్దరు ఆడవాళ్లు ఒకేపోలికగావున్నారు. ఒకదాన్లో ఒకరు తాదాత్మ్యం పొందుతున్నారు. ఇద్దరినీ వేరుచేయటం అసాధ్యం!

ఆమె మళ్ళీ మాట్లాడింది: "జీవితంవల్ల ప్రపంచం అర్థమవుతుం దనుకుంటారు! ఒక గంటలో, రేపు – లేకపోతే ఒక

సంవత్సరం తరువాత నయినా అర్థమవుతుందని ఆసిస్తారు. అయితే యేంలాభం? ఇది ఎప్పటికీ అర్థంకాదు. బహుశ ఇదేం ఫరవాలేదనుకుంటారు !"

శవపేటికలో స్త్రీ పురుషులు అచంచలంగా పడుకుని శతాబ్దాల వెనుకటిసంగతులు గుర్తు చేస్తున్నట్లు వుంది.

ఆమె నవ్వుతున్నట్లు అనిపించింది.

"నీవు బెర్ట్రిస్లతో వున్నావా? మంచిది !"

అతనన్నాడు: "నీ ఉనికే నా కర్థంకావటంలేదు."

ఆమె అతని చెంపమీద చేయి ఆనించింది. మృదువుగా నిమిరింది. అతనివైపు నోరువిప్పి ఇలా అంది: "కుర్రవాడుచాలా బాధపడుతున్నాడు. నీవప్పుడే కష్టదశను దాటేశాననుకుంటాను. నేనూ దాటగలిగాను."

ఉన్నట్లుండి యీ కోరిక: ఆమె జీవితమంతా విప్పి తెలుసుకోవాలని. అన్ని సంగతులు, అన్ని ప్రభాతాలు - రోజులు - సాయంత్రాలు... ఆమెవుండే బజారు, ధరించే ఉడుపులు, అన్నీ తెలుసుకోవాలని కాంక్ష. తనను పూర్తిగా ఆమెకు సమర్పించుకోవాలని ఆశ ! కాని, అది చాలకష్టం.

"కాథరైన్ యింకా నగరకేంద్రంలోనే ఎక్కడో ఉండి వుంటుంది. ఆమె నాభార్య! నేను నిరాశలో మునిగివున్నాను."

తరువాత అతను అనేక ఆలోచనలుచేశాడు. "సంవత్సరాలు - ఒక్కనిమిషంలో గడచిపోతాయి. ఒక్క నిమిషంలో, చెట్లు చేమలు, యిల్లు, తోట, పిల్లలు - సంసారం యివన్నీ ఊహించవచ్చు. ఎంతోమంది యిలాగే జీవిస్తున్నారు."

చివరకు ఆమెను అడిగాడు: "ఇంతకూ నీనారోజు ఓస్మాన్‌ను యేంచేదామనుకున్నావు?"

"యేమంటే—" అంటూ ఆమె తడబడుతూ చెప్పింది. "మానవులందరూ ఒకటే. ఎవరికయినా యేదయినా చేయటానికి సామర్థ్యం వుంటే అదెలాగో కనుక్కోవాలి!"

ఆమె ముఖాన్ని దగ్గరకు లాక్కున్నాడు.

" నా ఆశాపాశం..."

"నేను నీకెంతో నీవు నాకంత!"

ఎక్కడో మేడమీద తుపాకీపేల్పులు వినిపించాయి. తలుపు తెరుచుకుంది. ఏవో సామాన్లుపడ్డాయి. మళ్ళీ చీకటి – నిశ్శబ్దం. ఏదో తరంగం వాతావరణాన్ని చుట్టుతోంది. ఆమె అతని పెదవులకు తన పెదవులు తాకించి – "నే నెవరో నీవు తెలుసుకు వుండాల్సింది. నా నిజనామధేయం జోనాగిల్!"

## 17

నూనెదీపం కాంతి కాగితాలమీద పడుతోంది. కిటికీ రెక్కల్లోంచి వస్తున్న పిల్లగాలులకు దీపం అడపదడప రెపరెపలాడుతోంది. వింటన్ కుర్చీలోకూర్చుని చేతులు కట్టుకుని ఎదుట కూర్చున్నవ్యక్తి చెబుతున్నమాటలు వింటున్నాడు. ఆ మనిషి ముఖం ఎర్రగా కందగడ్డలావుంది. మెడ ముడతలు పడివుంది.

"అందరికంటే భయంకరుడు స్టాసియాక్ జనాన్ని భయపెడుతూ గందరగోళం సృష్టిస్తూ తిరుగుతున్నాడు. ఏ విషయము ఎక్కడా పూర్తిగా చెప్పడు. ఇక్కడోమాట, అక్కడో

మాట...అలా నవ్వులు, కేకలు...అంతే! జనం కల్లోలప
తారు; ఈ ఉల్లోకల్లా దౌర్భాగ్యుడు, నికృష్టుడు అతనే
అతనొక్కడే!"

విక్టర్ అడిగాడు: "అతనికి ఎంతభూమివుంది? ...
మాటలనుబట్టి చాలా భాగ్యవంతుడే అయివుండాలి!"

ఆ మనిషి అసహ్యంగా చూచాడు. "అంత చెప్పుకో
వలసినంతేమీ లేదు. పన్నెండు ఎకరాలు – అదయినా యిసుక
పఱ్ఱ. ఎందుకూ పనికిరాని బంజరు. అయితే అతనిదగ్గరో గుఱ్ఱం
వుంది. అడవుల్లో పనిచేయించేవాడు. వీళ్ళకూ వాళ్ళకూ
పొలాలు దున్ని పెడతాడు."

"ఇంతకూ అత నేం చెప్పాడు?"

అతనిచూపు విక్టర్ మీదనుంచి కాగితాలమీదికి,
తుపాకులమీదికి మారింది.

"ఆ భాగ్యవంతులు ఇలా అంటారు: భూమిని తీసుకో
కండి. ఏమంటే యజమానులు తిరిగివస్తారు. అమెరికావాళ్లు
తిరిగివస్తారు. ఎవరైనా భూమి ఆక్రమించుకున్నారంటే వాళ్ళను
ఉరితీస్తారు. స్టాటియాక్ ఇలా చెప్పాడు. ఇంకా నిశితంగా
సూక్ష్మంగా ఇలా అంటాడు: యజమానులు తిరిగిరారు. కాని
అమితానందంలో మునిగిపోకండి. మనకు భూమిని యిస్తారు,
గొడ్డుగోదకూడ ఇస్తారు. కాని ఫలసాయంమట్టుకు వసూలు
చేసుకువెడతారు. రైతులు యిప్పుడేకాదు, ఎప్పుడూకూడా
అణగద్రొక్కబడినవాళ్ళే. మీరు తెలివిగలవాళ్లైతే నగరం
లోనికి–కర్మాగారాలలోనికి వెళ్ళిపోతారు. సంస్కరణ అనేది
కేవలం కళ్ళతుడుపే!...అదీ అతను చెప్పేది. యజమానులు

తిరిగినస్తారంటే ప్రజలకు నమ్మకంలేదు. అయినా అతనికథలు మట్టుకు జీర్ణంచేసుకుంటారు!"

"అతను ఆదర్శవాదుల్తో తిరుగుతూవుంటాడా?"

"తిరుగుతాడో తిరగడో చెప్పలేం. అతని కుర్రవాళ్ళంతా లేతవయస్సువాళ్ళే. పెద్దవాడికి పన్నెండేళ్లు! అందరికీ ఆదర్శవాదులంటే భయమే. ఎవరూ వాళ్ళమాటకు వ్యతిరేకం చెప్పరు. అత నెప్పుడూ అనుమానంమనిషే. అడవుల్లో మనుషులవల్ల ఎప్పటికీ మంచిజరగదని అత నంటాడు. గంభీరంగా చెప్పడనుకో. రష్యనులు జోనిపిక్కులను అరెస్టుచేసినప్పుడు-వాళ్ళు ఎత్తుకుపోతున్న బంగారం వాళ్ళకేమీ ప్రయోజనకారి కాదనీ, రైతులకు పోయించే నోడ్కాకూడా అంతేననీ-తప్ప, ఇంకేమీ పలుకలేదతను."

స్టాసియాక్‌ను పట్టుకురావటానికి సిపాయిలకు ఆజ్ఞలున్నాయని వింటర్‌కు తెలుసు. మొత్తంమీద విషయమంతా సరిపోయింది. తన ఎదురుగా కూర్చున్నవ్యక్తికి, స్టాసియాక్‌తో వ్యక్తిగత విభేదం యేమీావుండివుండదు. జీవితంలో మొదటి సారిగాతనదనేభావం అలవరుచుకుంటున్నాడు. తన బుర్ర ఎలా ఉపయోగించాలో తెలుసు. పార్టీలో చేరుతాడు, అతనిమొద్దుబారిన వేళ్ళు ఉత్తరాల దొంతరను పరిశీలిస్తాయి. చివర కతను గ్రామంలో ప్రముఖవ్యక్తి అవుతాడు. సంయుక్త మండలాలకు అధ్యక్షుడు అవుతాడు. అతని పిల్లలు పాఠశాలలకు క్రమంగా కాలేజీలకు వెళ్ళి చదువుకుంటారు. కుటుంబంలోవాళ్లు తమ చర్చలలో వివేకవంతమైన విషయాలు మాట్లాడతారు.

"మరో విషయం-" వింటర్ అతనివంక చూచాడు:

"గెస్టపో యూదులను ఎత్తుకుపోయినప్పుడు అతనెలా ప్రవర్తించాడు. యూదుల స్థావరా లేమయినా ఆక్రమించుకున్నాడా?"

ఆ వ్యక్తి వింటర్ ముఖంలోకి చురుక్కున చూచాడు.

"కొందరు ఆ పనిచేశారు. అందరూ సామాను పంచుకున్నారు. అతను మాత్రం ఆచాయలకే పోలేదు. అబద్ధం చెప్పటం నాపనికాదు. తరువాత స్వతం యజమాని భార్య "అబ్రహాం" పారిపోయి అక్కడ చేరింది. గ్రామ పెద్ద ఊళ్లో వాళ్ళందరినీ పోగుచేసి బోలెడుసేపు చర్చలు సాగించాడు. కాని యేమీ నిర్ణయం కాలేదు. వాళ్ళందరికీ జర్మనులంటే భయం. అంచేత ఎవరూ యీ పని తమమీద పడవేసుకోలేదు. జర్మనులు వచ్చి అడవిలోని యూదులను కాల్చేశారు. ఎప్పుడూ గ్రామపెద్దతో పోరాడే స్టాసియాక్, గ్రామపెద్దే జర్మనులకు కబురుచేశాడన్నాడు. కాని నిజం మటుకు ఎవరికీ నిర్ధారణగా తెలియదు"

"గ్రామపెద్ద ఎవరు?"

"బులందా"

వింటర్ పెన్సిల్ తీసి ఆ పేరు వ్రాసుకున్నాడు.

"యిప్పుడు యీ స్టాసియాక్ మనకు చాల హాని చేశాడు. చాలాఅపకారం చేశాడు."

వింటర్ లేచాడు. "మీకు ధన్యవాదాలు. ఇప్పుడుశక్తి ప్రజలది. అధికారం ప్రజలకైవశం అయింది. ఇకముందుకూడా ఇదేస్థితి కొనసాగుతుంది. అధికారం నీబోటి ప్రజలదే. మనం

అజ్ఞానాన్ని జయిస్తాం. కొవాలన్నా అక్కర్లేదన్నా - భూ సంస్కరణలు వచ్చితీరుతాయి !"

తన కాగితాలు పరిశీలించుకుంటూ వింటర్ గతించిన రోజునుగురించి తలపోసుకుంటున్నాడు. కష్టభూయిష్టమైనరోజు. అందరూ భయార్తులయ్యారు. అడవులలో ఆదర్శవాదులు చేరారు. పక్కగ్రామంలో ఇద్దరు విప్లవవాదులను, భోజనం చేస్తూవుండగా, కాల్చివేశారు. హంతకులు యెవరో యెవరూ కనిపెట్టలేదు విషవలయాలు, రక్తధారలు - భర్తలకోసం విల పించే ప్రాణకాంతలు, పిల్లలకోసం దురపిల్లుతున్న మాతృ మూర్తులు ! అదీ దృశ్యం. అతని తండ్రి పగటికలలో ఇలా అంటున్నాడు: "తనయుడా! ఈ ప్రపంచం పాపపంకిలమయినది: అన్యాయభూయిష్టమయినది. మనకంటే నికృష్టులయినవాళ్ళు మనను విచారణ చేస్తున్నారు." మైదానానికి ఆవలివైపు స్మశా నంలో అతని తల్లి తండ్రి బూడిద అయ్యారు. తను ఇక్కడేం చేస్తున్నాడు? తనబాల్యం ఇక్కడే గడిచింది. అయినా ప్రస్తుతం తను ఇక్కడ కొత్తవాడు. నూతనుడు. వింతవ్యక్తి. ఆరోజులు పోయినాయి. అలసట మిగులుతోంది. అంతే!

తలుపుదగ్గరి సైనికుడు ముందుకువచ్చి "స్టాసియాక్ అనే అతన్ని పట్టుకువచ్చాం" అన్నాడు.

"లోనికి తీసుకురా !"

ఆవ్యక్తి నల్లగా పొట్టిగా వున్నాడు. వింటర్ సైనికులను బయటకు పంపేసి అతనికో కుర్చీ చూపాడు. స్టాసియాక్ కూర్చున్నాడు.

పింటర్ ఇలాఅన్నాడు: "నీవు నీగ్రామంలో భూసంస్కరణ లకు వ్యతిరేకంగా ప్రచారం చేస్తున్నావటగా!"

స్టాసియాక్ యేదో అన్నాడు. మాటలు పైకి రాలేదు.

"కాదనకు. లేదనకు. మాకు అంతా తెలుసు. నీవు ప్రజల అభీష్టానికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్నావు. మేం పేదలకు భూములుపంచటం ప్రజల కోరికమీదనే!"

ఆవ్యక్తి ఇప్పుడు స్పష్టంగా బదులు చెప్పాడు: "అది నిజంకాదు. మీరంటున్నది నాకు తెలియదు. రైతులకు భూములు వుండాల్సిందే!"

"సమిష్టిభూములు, సమిష్టివ్యవసాయక్షేత్రాలు మేం యిక్కడ నెలకొల్పబోతున్నామని నీవు ప్రచారం చేస్తున్నా వటగా! పోలండ్‌లో సమిష్టిక్షేత్రం అనేది వుండదు. భూమిని రైతులకు సర్వహక్కులతో యిచ్చేస్తున్నాం. ప్రజాపరిపాలనను గురించి లేనిపోని కల్పనలతో దుష్ప్రచారాలుచేసే వాళ్ళను మే మేమని పిలుస్తామో, యేం శిక్షవిధిస్తామో నీకు తెలుసా?"

స్టాసియాక్ బదులు చెప్పలేదు.

భూస్వాముల యెస్టేటులను రైతులు – పేదరైతులు – ఎందుకు ఆక్రమించుకోగూడదు? ప్రజాప్రభుత్వం మిమ్మల్ని శాపీనంనుంచి దరిద్రంనుంచి లేవనెత్తటానికి ప్రయత్నిస్తోంది. నీవు నీ పిల్లల సుఖాలనుగురించి ఆలోచిస్తున్నట్లు లేదు. వాళ్ళు కూడా నీలాగ అజ్ఞానంలో అవివేకంలో మునిగివుండాలని నీ ఉద్దేశమా?"

"లేదు. నా అభిప్రాయం అదికాదు. భూమితీసుకో గూడదని నే నెప్పుడూ చెప్పలేదు."

వింటర్ అనుకోకుండా అడిగాడు: "నీకు బులందా తెలుసునా?"

"ఆహాఁ! నాకు తెలుసు."

"యుద్ధం రోజుల్లో అతను జర్మన్లతో మంచిగానే వుండేవాడు కదూ? అవునా?"

అతను కదలకుండా చూస్తున్నాడు.

"ఆ విషయం నాకు తెలియదు!"

"జర్మనులచే చంపబడిన యూదురాలి సంగతేమిటి? ఆమెను ఎవరు మోసగించారు? బులందాయేనా?"

స్టాసియాక్ గడచిపోయిన విషయాలు నెమరువేసుకుంటున్నట్లుగా యిలా చెప్పాడు: "జర్మనులు వచ్చారు, యూదురాలు ఇంట్లో వుంది. యూదు పడతిని వెంగల్చకూడదని వాళ్ళే అనుకున్నారో లేక ఎవరైనా వాళ్ళ చెవిలో వూదారో తెలియదు. కాని ఎవరో ఒకళ్ళు చెప్పివుంటాలి. లేకపోతే వాళ్ళకు ఎలా తెలుస్తుంది. అయితే ఎవరూ తాము ఆపని చేశామని ఒప్పుకోరు. అందరూ అతనిమీదే ఆ నిందవేశారు. జనం తీరే అంత! ఎప్పుడూ ఒకళ్ళమీద ఒకళ్ళు చాడీలు చెప్పుకుంటూ వుంటారు?"

"నీవు మాకు చేసిన అపకారానికి నిన్ను అర్ధరాత్రి జెయిలుకు పంపగలను, తెలుసా? నీకు పిల్లలెందరు?

"ఆరుగురు"

వింటర్ అతనివంక విచిత్రంగా చూచాడు.

"నిన్ను కారాగారానికి పంపగలను. కాని యీసారికి క్షమిస్తున్నాను. కాని గుర్తుంచుకో, యిలాగే వాగుడుకాయలా

వున్నావంటే యిట్టే అమస్టుచేయిస్తాను. మేం మీా పూర్వపు యజమానుల వంటివాళ్ళం కాదు; జర్మనుల వంటివాళ్ళంకూడా కాదు. ప్రజాప్రభుత్వానికి ఎక్కడెక్కడ ఏం జరుగుతున్నదీ తెలుసు."

"చిత్తం."

వింటర్ లేచి అతనితో కరచాలనంచేశాడు.

"ఒకనాటికయినా నీఅంతట నీకే తెలుస్తుంది, మేం సాధించబూనుకున్న దేమిటో. మాకు కావల్సింది మీా శ్రేయస్సు. భూమితీసుకో. ఎవరినీ తీసుకోవద్దని దుర్బుద్ధులు చెప్పకు. ఈ భూమిమీాది దీన్ని మీానించి ఎవరూ ఎప్పుడూ తీసుకోలేరు."

# 18

సిల్కుగుడ్డ చిరిగిన చారలాగ గోడలో పొడుగైన పగులువుంది. గోడ అక్కడలోపలికి తెగుచుకుంది. బాంబు గుండు కిటికీలోంచి వచ్చి పేలింది. ఆ క్షణంలోనే డాన్ అరిచాడు: "అందరూ బయటకురండి. త్వరగా! గాయాలు తగిలినవాళ్ళను బయటకు తీసుకురండి. మైకేల్! మైకేల్ ఎక్కడ?"

అతని తలమీాది కట్టుఊడి కళ్ళమీాద పడింది. చిరాగ్గా దాన్ని అవతలకు పారవేశాడు. నుదుటిమీాద ఇంకా రక్తం కారుతున్న గాయం కనిపిస్తోంది. జేబులోంచి ఫ్లాస్కు బయటకు తీసి అందులో పానీయం తాగాడు. 'మైకేల్! జర్మన్ ఇంటికి ఎదురుగావున్న స్థలంలో మనిషివున్నాడు! ఈ దండ

యాత్ర అక్కడినుంచి వస్తోంది. ఏంజరిగినా భరిస్తూవుండు. పొలాలమీదుగా వస్తూన్నవాళ్ళందరినీ వడదాం' అన్నాడు.

పెద్దపెట్టున ప్రతిధ్వని వినిపించింది. జోనా, విలా ఇంకా కొందరు కుర్రవాళ్ళు మేడమీదికి వరుగెత్తారు. ప్రభాతం శీతలంగా వుంది. ఆకాశం ఎర్రవాలుగా వుంది. వాళ్ళు దొడ్లోకి వరుగెత్తారు. మరిన్ని చప్పుళ్లు, గోడలుకూలటం, ఇటుకపొడి రేగి గాలిలో ఎగరటంతో వాతావరణం దుర్భరంగా తయారయింది. మైకేల్ తనచుట్టూ సీల్, బెర్ట్రిన్డు ఇంకా పదిమందిని పోగుచేశాడు. బెర్ట్రిన్డు డాన్‌దగ్గరకువచ్చాడు.

"నే నో విషయం చెబుదా మనుకుంటున్నాను"

"ఏమిటది?"

"పైవాటాలు ఆక్రమించుకోవటం శ్రేయస్కరంకాదనుకుంటాను. అందరినీ కిందిఅంతస్తువద్దనే జాగ్రత్తగా కాచుకువుండమనండి. అన్నివైపులా కాయాలి. పైఅంతస్తు నిలుపుకోవటం కష్టం. మనను తుదముట్టించా లనుకుంటే వాళ్ళు పైగా ఒకవిమానం పంపుతారు! అంతే!"

డాన్ అతనివంక కోపంగా చూచాడు.

"అంతబద్ధం! కిందిఅంతస్తులో వుండి మన మేలా చేయలేం. అదీకాక, పైకివెడుతున్నవాడిని నేను, నీవుకాదు—" అన్నాడు.

బెర్ట్రిన్డు వెనుదిరిగివెళ్ళగానే డాన్ 'బలహీనుడా!' అని ఉమ్మేశాడు.

బెర్ట్రిన్డు వక్కకుతిరిగాడు. తలవంచి 'ఆ సంగతి నీకేం తెలుసునని అలా అంటున్నావు?' అన్నాడు.

డాన్ ముఖం వివర్ణమైంది 'నీసంగతి నాకు బాగా తెలుసు, నీకు ఇక్కడివాళ్ళందరిపట్ల హేయభావం వుంది. నిన్న మీదోరోజు సేవు కబళించకుండా సెయింట్ మార్క్సను ప్రార్థించుకో. నీ వొక్కడివే గొప్పవాడివి, నాశనం కాకూడని వాడివీ అనుకుంటున్నావు కాబోలు!'

మైకేల్ మధ్యలో అందుకుని "అతన్నలా వదిలెయ్యి, డాన్, అతన్ని యేం చేసుకుంటావు? ఇలా కీచులాడుకుంటూ కూర్చోవటానికి ఇది తగినసమయం కాదు"

జర్మనులు స్వాధీనం చేసుకున్న ఇల్లు నిశ్శబ్దంగా వుంది. ఎక్కడా ప్రాణికదులుతున్న సవ్వడేలేదు. సీల్ రహస్యంగా బెర్ట్రాన్డుతో "డాన్‌తో వివాదం పెట్టుకుని కాలయాపన చేశావు!" అన్నాడు. బెర్ట్రాన్డు మెడవెనుక చేతులుంచుకుని "నాకు అతని తరహా అర్థమయింది!" అన్నాడు.

అయిదు నిమిషాలు గడిచాయి. పది నిమిషాలు.

జోనా సీల్‌ను అతని మతంపేరిట పిలిచింది "స్టెఫెన్, ఒక్క క్షణం యిటువచ్చి గాయపడినవాళ్ళ విషయంలో సహాయం చేయి."

మైఖేల్ "నేను వెళ్ళవచ్చుకదూ?" అన్నాడు.

"ఆ! కాని త్వరగా తిరిగిరా."

జానీ – అందరికంటే చిన్నవాడు–రక్తసిక్తమైన స్ట్రెచర్ మీద పడుకున్నాడు. అతనిజుట్టు చిందరవందరగా ఎగురు తోంది. పల్చనిశరీరం కిందుగా నీలిధమనులు కనుపిస్తున్నాయి.

'నేను సెలవు తీసుకుందామనుకుంటున్నాను. అతన్ని

తక్షణమే యిక్కడనుంచి తీసుకెళ్ళాలి. ఆపరేషన్ చేయించాలి. లేకపోతే యిక్కడే చనిపోతాడు." అంది జోనా.

ఎదురు బొదురుగా నిలుచుని యిద్దరూ కరచాలనం చేశారు. జోనా చేతికి ఆకుర్రవాని రక్తం అంటింది.

"నీవిషయం జాగ్రత్త తీసుకో" అన్నాడు సీల్.

విలా నవ్వి ఇలా అంది: "భగవంతుడు నిన్ను దయతో కాపాడుగాక ! ఈ సందు ములుపుకు రెండువందలగజాల అవతల, పరిస్థితి మరింత అగోచరంగా వుంది. తరువాత హాయిగా వెళ్ళ వచ్చును. అబ్బ ! నా కాళ్ళు నొప్పులుపుడుతున్నాయి. నాకో తాడుముక్క యివ్వు. అతన్ని స్ట్రెచర్‌కు కట్టాలి. లేకపోతే పడిపోతాడు."

సీల్ దారిలో గోడనానుకుని నిలుచున్నాడు. అక్కడ భద్రంగా నిల్చోవటం అతనికే సిగ్గనిపించింది. కాని అప్పుడే - యేమీ చేయకుండావుండటం విశ్రాంతిదాయకం అని తోచింది.

అమ్మాయిలు గేటుదాటి వెళ్ళారు. జోనా ముందు నడిచింది. బరువంతా ఆమెమీదికే కుంగినట్లుంది. విలా వెనక నడుస్తోంది. బాంబుల దెబ్బలనుంచి తప్పించుకుందుకు గంతులు వేస్తున్నారు. వాళ్ళకు దగ్గర్లోనే చిన్నచిన్న రాళ్ళు మట్టిపెళ్లలు పడుతున్నాయి. వాళ్లు పరుగుతీస్తున్నారు. మరతుపాకులు మొరగటం ఆరంభించాయి.

సీల్ అనాలోచితంగా గోడ తడిమాడు. ఏదో విద్యుద్ఘాతం తగిలినట్లనిపించింది. గోడ తెరుచుకుని విరామస్థలం కనిపించింది. కాళ్ళు కిందికి కుంగిపోయాయి. సరీగా ఆసమయం లోనే, జోనా ముందుకుపడటం - స్ట్రెచర్ తలకిందులవటం -

విలా దాన్ని ఒకపక్కకు పోగుచేయటం కనిపించింది. అదృశ్యం దగ్గరగానే వుంది. అతను జోనాను తన కౌగిలిలోకి తీసుకుంటు న్నాడు. రక్తం. ఆమెదో లేక జానీదో! అతను పరుగెత్తు తున్నాడు. గేటుదగ్గరకు చేరుకున్నాడు జోనాను కిందికిదింపాడు. ఇంతలో గోడవిరిగి కిందపడింది. జోనా ప్రాణంకూడా పోయిం దని తెలిసింది. పెద్దచప్పుడు. అంధకారం. తతిమ్మావాళ్ళంతా యేమయ్యారు? నేను బతికేవున్నానా? వాళ్ళదగ్గరకుచేరటం ఎలా? మైకేల్ గొంతు వినపస్తోంది: "వాళ్ళను దగ్గరకు రానివ్వ కండి మీామీా చేతిబాంబులు వుపయోగించండి." అతను బెర్ట్రాన్డును గుర్తించాడు జర్మన్లు బయటకు వస్తున్నారు. "వాళ్ళని పట్టుకోండి... పట్టుకోండి!" అతను తుపాకిపేల్చాడు. ఒక జర్మను చావుకేకపెట్టి నేలకు ఒరిగాడు. తరువాత పెద్దపెద్ద కేకలు - తుపాకిగుండ్ల రొద. పై అంతస్తుఅంతా నాశనమయిం దనీ, అందులోవాళ్లంతా మారణ మయ్యారని స్పష్టంగా తెలుస్తోంది.

బెర్ట్రాన్డు గాయపడిన ఓ మనిషిని లాగుతున్నాడు. సీల్ అతనికి సహాయంచేయటానికి రెండడుగులు ముందుకు వేశాడు. ఆ క్షణంలో బెర్ట్రాన్డు కూలబడ్డాడు. అతని కళ్ళలో విచిత్రమైన చూపు కనిపించింది. అది ఒక క్షణంమటుకేవుంది. అతని ముఖం తెల్లగా పాలిపోయింది. సీల్ అతనికి చేయి అందించాడు. బెర్ట్రాన్డు "అమ్మా!" అని అరచి కిందపడ్డాడు. "అతన్ని మోసుకుపోవాలో ఊహు! అతన్నికాదు!" సీల్ గాయపడ్డ మనిషిని పైకిఎత్తి పట్టుకున్నాడు. ఆమనిషి హిట్లరును అనుకరిస్తూవుండే "కూలా" అనే అతను.

ఎవరో "తొందరగా రండి" అని అరవటం వినిపించింది. జర్మనులు యే క్షణంలోనైనా యిక్కడికి వస్తారు. అతను "గూలా"ను బుజంమీద వేసుకుని పరుగు ప్రారంభించాడు. గేటుదగ్గర జోనా శరీరం పడివుంది. దానిమీద అప్పుడే దుమ్ము పేరుకుపోయింది. అతను ఆగి, ఆమె ముఖాన్ని శుభ్రంగా తుడిచాడు. సగం తెరచివున్న నోటిలోంచి ఆమె దంతాలు ధవళంగా ప్రకాశిస్తున్నాయి. వాళ్లు పరుగెత్తుకు వస్తున్నారు. పట్టపగలు. మరో వికాసప్రపంచంలో జీవనం యింకా చేరువకు రాలేదు ఇంకా రాలేదు.

సందుమలుపుకు వచ్చాడు. తడసిన నేలవంకచూచి యేం జరిగిందో ఊహించుకున్నాడు. ఎవరూ కనుక్కోలేరు, ఎవరూ తెలుసుకోలేరు. తనే జోనాను చంపినట్లు బాధపడ్డాడు. తను వదలినప్పుడు గులా యింకా బతికేవున్నాడని తను ఎవరికీ చెప్పడు. విచిత్రమైన వికారంతో యేడుపువచ్చేసింది. వెనుక నుంచి ఎవరో అరిచారు: "అతని బుర్రమీద ఒక దెబ్బకొట్టు! దాంతో పడిపోతాడు."

## 19

గేటుదగ్గర గంటమోగింది. మార్టినిక్ వదినవంక ప్రశ్నార్థకంగా చూచాడు. కూరగాయలతోట మధ్యాహ్నపు సూర్యుని కాంతిలో ప్రశాంతంగావుంది.

ఆమె బవురు కిందికి దించి చేతులు రుమాలుతో తుడుచుకుంది.

"ఇక్కడి కంచె రంధ్రాలలోంచి తొంగిచూస్తాను. నేను సైగచేస్తే అప్పుడు పొదదాటి పరుగెత్తు!"

ఆమె కంచెవైపు వెళ్ళింది. అతని కళ్ళు ఆమె ననుసరించాయి. ఆమె కంచెలోనుంచి చూచి, వెనక్కు తిరిగి ధైర్యం చెప్తున్నట్లు చేయివూపింది. తరువాత గేటుదగ్గరకు వెళ్ళి కటకటాల ద్వారా సంభాషణ ఆరంభించింది. చివరకు తాళంతీసి తలుపు తెరిచింది.

ఎర్రని బొద్దయిన మనిషి ఆమె వెనుక యింటిలోనికి వచ్చాడు. దూరంనుంచే చూచి, మార్టినిక్ సంపాదకుడిని గుర్తుపట్టాడు. పెద్ద ఉద్యోగులందరికిమల్లేనే ఉన్నాడు. అతని చంకలో చిన్న పెట్టెవుంది. మార్టినిక్‌ను చూచి సంతోషంగా చేయి ఊపుతూ! "హల్లో! మార్టినిక్! చాలాకాలమయింది నిన్ను చూచి – ఈమధ్య నీకోసం తెగతిరిగాను" అన్నాడు. ఇద్దరూ కరచాలనం చేశారు. చికాకును కప్పిపుచ్చుతూ మార్టినిక్ చిరునవ్వు నవ్వాడు. "ఎవరో జర్మనులనుకున్నాను. నీవింకా జీవించివున్నావని నాకు తెలియదు."

ఆ వ్యక్తి నవ్వాడు. "ఓ: ఏదో ఏర్పాటు చేసుకున్నాను. ఇక్కడ ఇలాంటి విషయాలు రోజూ జరుగుతూనే వుంటాయి. ఈరోడ్డు మీద అందరూ వార్సా వెడతారు. మీరు మాత్రం మంచిచోటు చూసుకున్నారు. ఆహా! ఎంత సుందర ఉద్యానవనం! ఏం గందరగోళం జరిగినా కప్పిపెట్టటానికి బోలెడంత చోటు. మీరు వార్సా వదిలింది ఎప్పుడు?"

"ఆగస్టు పదిహేనోతేదీన! నే నొక రైలుబండిలోంచి దూకి తప్పించుకున్నాను"

"ఓ! అయితే రెండు వార్తాలైందన్నమాట. మరి, ముద్రాపక యంత్రం – ఆ ఇల్లు, యేమైనట్లు?"

"తగలబెట్టారు"

బొరొవ్స్కి పొడుగాటి చేతిరుమాలు బయటకు తీశాడు. "ఇంకా ఎండగావుంది. వేసవికాలం వెళ్ళినా ఇంత ఎండలేమిటో! నీతో మాట్లాడాలనివుంది మార్టినిక్. చాల ఆంతరంగికంగా మాట్లాడాలి. ఎంతో రహస్యమైనవిషయాలు!"

తోటమాలి ఇల్లు శాయ్యతో కట్టినదే. మార్టినిక్ తలుపు తెరిచి సంపాదకుడిని ఒక గదిలోనికి తీసుకువెళ్ళాడు. ఆ గదిలో ఒకపక్క, బేసిన్, కుళ్ళకూజా వున్నాయి. నేలమీద చిన్నచిన్న గుడ్డలలో విత్తులు ఆరబెట్టివున్నాయి. ఇద్దరూ ఎదురెదురుగా కూర్చున్నారు. అతిథి పక్కమీద కూర్చున్నాడు. మార్టినిక్ మటుకు కుర్చీలో కూర్చున్నాడు.

"సిగరెట్ కావాలా?– ఒట్టి దొంగపొగాకు"

అరచేత్తో మోకాళ్ళు నిమురుకుంటూ బోరొవ్స్కి అన్నాడు "అయితే, నీవింకా బ్రతికే వున్నావన్నమాట. పొయిటెక్ కూడా ఇక్కడేవుంది. తతిమ్మావాళ్ళవిషయం నాకు తెలియదు. బహుశ చనిపోయారేమో!"

మార్టినిక్ ఇలా అడిగాడు; వార్సాలో యేం జరుగుతున్నది? నగరాన్ని అన్నిరకాలుగాను ధ్వంసం చేశారు!"

"ఏమీ చేయలేకపోయాం. ఎన్నో త్యాగాలు వున్నాయనుకో. కాని రహస్యాలు. సహాయంచేసే వుద్దేశ్యం లేకపోయినప్పటికీ, యేమీ తెలియనట్లు నిల్చోవచ్చు. కాని

అవసరం వాళ్ళను ముందుకు లాగుతుంది. నగరమంటే నగరమే. మనం దాన్ని పునర్నిర్మిద్దాం" అంటూ అతను మార్టినిక్ వంకకు జరిగాడు.

"కాని—యిప్పుడు...మనం సోమరిగా కూర్చోలేం కద, ఏదో చేయాలి. అంటే మళ్ళీ యేదన్నా పత్రిక ఆరంభించాలి. మనదగ్గర డబ్బువుందిగా!"

మార్టినిక్ ఆలోచిస్తున్నాడు. అయితే యిదన్నమాట. వాళ్లు ఎవరినీ ఎప్పుడూ ఒంటరిగావుండనివ్వరు. నగరం తగులబడిపోంతోంది, వాళ్ళకు కావల్సిందేమో పత్రికట! అది యేమి పత్రికో, దానిలో యేమేమి విషయాలు వుంటాయో వాళ్ళకే నిమిత్తంలేదు.

"ఇది మంచిఆలోచనే కావచ్చు. కాని యిప్పుడు మనమేంచేయగలం ? మనదగ్గర కాగితంలేదు, ముద్రాపక యంత్రం అంతకన్నా లేదు. ప్రతిరోజూ దండయాత్రలు సాగుతున్నాయి. పత్రిక పంచటం ఎట్లా కుదురుతుంది?"

బొరొవ్స్కి మధ్యలోనే అందుకుని యిలా అన్నాడు :

"ఆ విషయం నీకేం బెంగవద్దు. ఈరోజుల్లో దేన్నయినా జయించవచ్చు. బోలెడంత కాగితం ప్రెస్సు కావాలంటే జర్మన్లే మనకు ఎక్కడయినా చూచిపెడతారు. వీలయితే వార్సాలోనే బాగా డబ్బుయిస్తే యీ పేపరు పట్టుకెళ్ళి హిట్లర్ కేఇస్తారు. కాని దీనికి చోటు ? ఇక్కడే... యీ ఉద్యానవనంలోనే! ఇంతకంటే మంచిచోటు దొరకదు !"

"నీవుచెప్పింది బాగానేవుంది, బొరొవ్స్కి, కాని రష్యన్లు వస్తున్నారు కద !"

"అయితేనేం? ఇక్కడివాళ్లు చాలమంది బంగారం కొంటున్నారు. జర్మనులతోపాటు వియన్నా వెళ్ళిపోదా మను కుంటున్నారు. కాని నేను వుండిపోతాను, నీవూ వుండిపోతావు. ఎవరో ఒకరు పనిని కొనసాగించాలి. మనం జర్మన్లకు లొంగ లేదుకద, అలాగే రష్యన్లకు లొంగము. మనవెనుక అమెరికా వుంది. మనకేమీ ప్రమాదం జరగకుండా చూస్తుంది."

మళ్ళీ ఆరోజుల చరిత్ర చెబుతున్నాడు. మార్టినిక్ అతనివంక చూచాడు.

"మార్టినిక్! మాకు కావలసింది నీమాదిరివాడే! నీవు వప్పుకుంటావు, నాకు తెలుసు! లోగడ నీవు వాగ్దానం చేశావుగదా!"

"అయితే మనం ఇప్పుడు ఆరంభిద్దాం. ఇప్పుడేనా? ఇవాళేనా?"

"ఎంతత్వరగా వీలయితే అంతత్వరగా! ముద్రావక యంత్రంపెట్టేచోటు కుదిరిన తర్వాత అన్ని యంత్రాల్నీ తీసుకు వస్తాం. నేను ఉంటున్నచోట అంత స్థలంలేదు. కనీసం సూది మోపటానికయినా సందులేదు. పొలుటిక్ వుండేచోట ఒకే యింట్లో యాభైమంది నివసిస్తున్నారు"

"అయితే నేను చూస్తానులే! ఇక్కడో, ఇంకెక్కడో - తప్పకుండా ఆపనిచేద్దాం! నేనేదయిన మంచిచోటు కనిపెడితే- ఆవిషయం నీకు చెప్పటం ఎలా? ఎక్కడ కల్సుకోవచ్చు నిన్ను?"

బరోక్స్కి అతనికి తన చిరునామా ఇచ్చాడు.

అతన్ని సాగనంపి మార్టినిక్ లోపలికివెళ్ళి వదినను చూచాడు. ఆమె త్రవ్వటం ఆపి "ఎవరతను ? ఏమంటాడు ?" అనడిగింది.

"వార్సానుంచి వచ్చాడు. కాని నీవు చెప్పదలుచుకున్న విషయంవేరు — నేను వెంటనే ఇక్కడినుంచి వెళ్ళిపోవాలి. చెప్పకోవాకు వెడతాను —"

"అయితే నీ పన్ను గడ తిరిగి కొనసాగిస్తావన్న మాట. వంటరిగా వెడతావా ?"

"ఏమీ పన్ను గడలేదు. ఈమనిషి మళ్ళీ నేను ఇంట లేనప్పుడు వస్తే, నేను బయటకు వెళ్ళానని జర్మన్లు చుట్టుముట్టి పట్టుకుపోయారని చెప్పు. అతను ఇక్కడికి తరుచు వస్తూ వుండటం మంచిది కాదు !"

# 20

సీల్ తన మనోనేత్రంతో యీ దృశ్యాన్నంతటినీ పరికిస్తున్నాడు. అతను జ్వరంతో మగ్గిపోతున్నాడు. గాయాల బాధ మటుకు అంతగా లేదు. అతని ప్రయత్నమంతా మైకేల్‌ను తన చేయిదాటి పోకుండా చూడటానికే.

నగర కేంద్రంవైపుకు రెండు రోజులుగా దండయాత్ర సాగుతోంది. ఇది విఫలం అయిందట. అతని స్మృతిపథంలో ఒక్క కాథరైన్ మటుకే యేమీ మారకుండా వుంది. అతనికి ఎంతో ఆత్మమథన ఆరంభమయింది. మైకేల్ అతన్ని మధ్య మధ్యలో తమవంతు వచ్చిందని హెచ్చరిస్తున్నాడు. పోరాటం

తీవ్రంగా సాగుతోంది. జర్మనులు బహుశ గూలాను చంపా రేమో. సీల్ ఆత్మసమర్థన ఆరంభించాడు.

సీల్, మైకేల్ భూగృహంవైపు నడిచారు. సీల్ మైకేల్‌ను అనుకుని నడుస్తున్నాడు. ముందుగా దీపం వెలిగింది. వాళ్ళు నిచ్ఛలంగా నిల్చున్నారు. మెల్లిగా యీ మాటలు వినిపించాయి! "పైన జర్మన్లు వున్నారు. నీ వొంతుకోసం వేచివుండు. ఇద్దరిద్దరుగా రంధ్రంలో ప్రవేశించి పరుగెత్తండి. అందరూ వెళ్ళాక తలుపులు గట్టిగా బిగించండి."

# 21

పీటర్ క్వింటో అక్కడ మంచుగడ్డలు వుండటంచూచి అమితానందం పొందాడు. తెల్లని టేబుల్‌క్లాత్‌ను చేతితో నిమిరాడు. యుద్ధంముందు పరిస్థితులు, చూచిన ముఖాలు నెమరుకు తెచ్చుకున్నాడు. జరుగబోయే విందుకు ఎందరో అతిథులు ఆహ్వానింపబడ్డారు.

పెకిల్‌స్కీ రష్యన్ అతిథులను ఉద్దేశించి ఉపన్యాసం ఆరంభించాడు. దేశాన్ని ఉద్ధరించిన ఎర్రసైన్యాన్ని ప్రశంసించాడు. అక్కడక్కడ నవ్వులు వినవస్తున్నాయి. కళ్లుమాత్రం భోజనంప్లేట్లమీదా దేవున్నాయి. పెకిల్‌స్కీకంఠం గంభీరంగావుంది.

అతని తరువాత బారుగా మాట్లాడాడు. అతను మేజర్ యూనిఫారంలోనే వున్నారు. అందరూ కనుబొమలుముడిచి శ్రద్ధగా విన్నారు. అతని ఉపన్యాసం ఇటు పోలులను అటు రష్యనులను అందరినీ ఆకర్షించింది. అతని ఉపన్యాసానంతరం హాలంతా కరతాళధ్వనులతో మోగిపోయింది.

తరువాత అతిథులు కొందరు మాట్లాడారు.

పీటర్ కార్టనోవ్‌కు ఎదురుగా కూర్చున్నాడు. నాజీల దురాగతాలకు గురైన విధ్వంస కేంద్రాల చిత్రపటాలుగీస్తూ అతను రెండువారాలుగా ఇక్కడే వున్నాడు. కొద్దిరోజుల ముందు అతను కార్పనోవ్‌ను వీధిలో కలుసుకున్నాడు. ఇద్దరూ కొన్ని క్షణాలు రష్యన్ భాషలో మాట్లాడుకొన్నారు. పీటర్ చేతిలోని పుస్తకంచూచి కార్టనోవ్ "యేమిటిది? నేను చూడవచ్చా!" అన్నాడు. పీటర్ పుస్తకాన్ని గట్టిగాపట్టుకొని "ఓ! ఇదేమంత గొప్పపుస్తకం కాదు" అన్నాడు. తరువాత "కవిత్వం" అంటూ ఆ పుస్తకాన్ని అతనికి అందించాడు. అతని హేళనాత్మకమైన నవ్వును గమనించాడు. మన కవిత్వం, మన లాటిన్ అక్షరములు-ఇటువంటివేవీ రష్యన్లకు ఇష్టం లేవు. కార్టనోవ్ ఒకసారి పుటలన్నీ తిరగవేశాడు. ఈ సంఘటన తర్వాత గాయం ఎప్పుడూ మాయదనుకున్నాడు పీటర్. కార్టనోవ్ ఎవరు? అతని ఆలోచన లేమిటి?

పీటర్ కూడా అందరితోపాటు తనివితీర తాగాడు. ఇక్కడిమనుషుల ప్రవర్తన చాల మర్యాదగావుంది. పొగుడుతూ అసహ్యంగా కనపడుస్తారు, అసహ్యించుకుంటూ పొగుడుతారు.

అందరూ పళ్లాలమీదికి వంగి భోజనం కానిస్తున్నారు. యుద్ధంముందు వుండిన ఆహారపదార్థాలనుగురించి చర్చించుకొంటున్నారు. అక్కడక్కడ స్నేహితులనుగురించి తెలిసిన వాళ్ళనుగురించి సంభాషణ నడుస్తోంది.

"అవును! మొదటిబహుమానం లియోన్‌కు చెందాలి,

సెప్టెంబర్‌లో లావోలో అతను విషభూయిష్టమైన ఆహారంతిని చనిపోయాడు. ఎంత దారుణం!"

పీటర్‌కు కొన్ని ఎరిగిన ఊళ్ళపేర్లు, మనుషులపేర్లు విన వచ్చాయి. "వాళ్ళు అందరినీ దుస్తులువేసుకుని తయారవ మన్నారు. రోమన్ అటకమీాదికి పరుగెత్తాడు. ఛార్లెస్ కిందికి పరుగుతీశాడు..." ఇలా కబుర్లుచెప్పుకుంటూ వాళ్లు అందరి స్మృతికి చిహ్నంగా పానీయాలు తాగుతున్నారు. యుద్ధ కాలంలో తమకు అనుభూతం అయిన అనేక విచిత్రసంఘటన లను గురించి చెప్పుకుంటున్నారు.

వాళ్ళధోరణి క్రమంగా జ్యోతిషంమీాదకుకూడా పోయింది. "జ్యోతిషుడు నాకేమీా చెప్పలేదు. ఒక్కటే విషయం—నీకు యెనభైయేళ్లు వచ్చేదాకా మంచిమంచి రెస్టా రెంట్లలో భోజనంచేస్తావు!" అనిమటుకు చెప్పింది.

"జ్యోతిషాలు ఒక్కోసారి నిజం అవుతాయి!"

"అవును. టాడ్యూన్‌ను నేను హెచ్చరించాను. కాని అతను తనకేమీా ఫరవాలేదని మే పదమూడో తేదీ తన వివా హం అవుతుందని జ్యోతిషం చెబుతోందనీ అన్నాడు. ఏం లాభం? సరిగా మే పదమూడునే అతన్ని జర్మన్లు పట్టుకున్నారు. కాల్చివేశారు. బహుశ జీవితరేఖను, హృదయరేఖను కలిపి చదివాడేమో జ్యోతిష్కుడు!"

బునియో విపరీతంగా నవ్వాడు – అతను పీటర్ దగ్గరకు వచ్చి "అంతా చూస్తున్నారుగా! నేనేం అబద్ధం చెప్పటం లేదు. నాకు చేతనయిన పనల్లా నవ్వువచ్చే తమాషా కథలు

వ్రాయటం. నాకు డబ్బిచ్చేవాళ్ళందరికీ కథల వ్రాస్తాను. రచయితలందరూ చేసేపనే యిది. మరేదయినా పెద్దకబుర్లు చెబితే అదంతా అబద్ధమన్నమాట!"

నిషా బాగా ఎక్కువయింది. అందరూ ఒకరొకరు కౌగలించుకుంటున్నారు; గోయాను గురించి పక్కవ్యక్తితో మాట్లాడుతున్న కార్పనోవ్ మిన్నకుండిపోయాడు. వాళ్ళ చుట్టూ పోగయిన కొందరు కవిత్వాన్ని, పుస్తకాలను ప్రశంసిస్తున్నారు. "[illegible]వై సంవత్సరాలుగా ఇంతగొప్ప నవల రాలేదు!" "మనను మించి ఇంక స్సాహిత్యమే లేదు." "టామ్‌తో పోల్చకూడదు. అతని శైలి వేరు!" "మహత్తరగీతాలు వ్రాసిన కవులకు అంజలులు!"

అందరూ బల్లలమీదనుంచి లేస్తున్నారు. నింపాదిగా నడుస్తున్నారు. ప్రశాంతమైన రాత్రి. చల్లనిగాలి హుషారు కలిగిస్తోంది. జనం వీధుల్లో జోరుగా వెడుతున్నారు. పీటర్ ఒకచోట నిలుచున్నాడు. ఇంతసేపూ తను వార్సాలో యేం జరుగుతున్నదో ఆలోచిస్తున్నాడని గుర్తువచ్చింది.

తన పక్కనే కార్పనోవ్ జేబుల్లో చేతులురిక్కించుకుని నిల్చున్నాడని గమనించాడు. నక్షత్రాలవంక తేరిపార చూస్తున్నాడు.

"నాకు విందులంటే ఇష్టంలేదు."

"యుద్ధం యింకా కొనసాగుతూన్నదన్న విషయాన్ని మర్చిపోయేటట్లు చేసేది ఇలాంటి విందులే!"

కార్పనోవ్ ముభావంగా దగ్గి ఊరుకున్నాడు.

# రెండవ భాగము

## 1

పీటర్ క్వింటో జీపులో వార్సా చేరుకునేసరికి అప్పుడే ఏప్రిల్‌మాసం ప్రవేశించింది. ప్రాగాపరిసరప్రాంతాలు యుద్ధం ముందు ఎలావున్నాయో యిప్పుడూ అలాగేకనిపిస్తున్నాయి. ధూళిధూసరమైన యిళ్లు, రాళ్లురప్పలతో నిండిన వీధులు! గుడిగోపురాలు విరిగిపోవడం, గోడలు శిథిలమవటం చూస్తూ వుంటే యుద్ధపరిణామాలు గుర్తువున్నాయి. ఏమయినప్పటికీ, ప్రాగా మారింది. నగరంలోని ముఖ్యమైన వీధి బజారువీధిగాను, మజిలీగాను తయారయింది. వజ్రోజాలు ముందుకు పొడుచుకు వస్తున్న సోవియట్ యువతులు రోడ్ల మీది ట్రాఫిక్‌ను అజమా యిషీచేస్తున్నారు. మిలిటరీలారీలు, జీపులు, కారులు, రిక్షాలు, చేతితోలాగేబండ్లు, జనసమూహం – సోవియట్‌పౌరులు, సైని కులు, శాలువలుకప్పుకున్న సోవియట్‌స్త్రీలు, పోల్‌సైనికులు, చొక్కాలు అమ్మేవాళ్ళు–కొనేవాళ్ళు, యితరవ్యాపారస్థులు– వీటిలో రోడ్లన్నీ యిరకాటంగా వున్నాయి. కొత్తప్రభుత్వం తన ఆఫీసులనన్నిటినీ ముఖ్యనగరానికి మార్చింది. కొత్తగా కల్పిస్తు కొన్నిశాఖలను మటుకు యీ ప్రాంతంలో నెల కొల్పుదామనుకుంటున్నారు అందుచేత కొన్నికొన్ని భవనాల దగ్గర కాపాలావాళ్లు వుంచబడ్డారు. బజార్లన్నీ జనసందో హంతో గలగలలాడుతున్నాయి. వాహనాలు ముందుకు పోవ టానికి బారులుతీరి నిలిచాయి. కుర్రవాళ్ళ చప్పట్లే కారు హారన్లమాదిరి పనిచేస్తున్నాయి.

పీటర్ డ్రైవర్ తిట్టుకుంటున్నాడు. నగరంలోకివెళ్ళే రోడ్డుమీద ఎన్నో కార్లు అడ్డదిడ్డంగా వున్నాయి. కొద్దిగా ముందుకుపోవటం, తరువాత స్థలంలేక ఆగిపోవటం, కొన్ని క్షణాలు ఆగాక తిరిగి పైకిపోవటం, ఇలా గంటలతరుబడి వేచి వుండాల్సి వస్తోంది. పీటర్ కళ్ళముందు జరుగుతున్నదంతా చూచి వినోదిస్తున్నాడు. సైన్యంతో నిండిన లారీవెనుక కాళీస్థలం కనిపిస్తోంది. ఒక సోవియట్ సైనికుడు లారీపైకి ఎక్కబోయి కాలుజారి కిందపడ్డాడు. ఇదంతా యేదో సినిమారీలు చూస్తున్నట్లుంది. చిట్టచివరకు ఆ సైనికుడు పైకి చేరుకోగలిగాడు. ఒక సైనును పక్కకు నెట్టబోయి - విపరీతంగా తాగివుండటచేత, దానిమీదికి ఒరిగాడు.

చివరకు వాళ్లు నదిదగ్గరకు చేరుకున్నారు. ఆకాశంలో సీతకాలపు మేఘాలు అగుపిస్తున్నాయి. గాలి చల్లగా వీస్తోంది. నాశనంచేయబడ్డ వంతెన స్తంభాలు కనిపిస్తున్నాయి. బురద నీళ్ళలో సుడులుతిరుగుతున్న తరంగాలు. మరోపక్క, శిధిలమైన ప్రాంతం కనిపిస్తోంది. ఆరంగుచూస్తే ఎందుచేతనో పీటర్‌కు గుల్తింమాసం రంగు గుర్తుకువచ్చి, తిరిగి, యీ ఆలోచనకు తనలోతనే నవ్వుకున్నాడు. పీటర్ పరిశీలనగా చూచి, తాను పూర్వం ఎరిగిన ఇళ్ళు గుర్తుపట్టటానికి ప్రయత్నించాడు. కాని యేమీ ప్రయోజనం లేకపోయింది. గోడలు కూలిపోగా పడిన మట్టి కుప్పలుగా పడివుంది. అక్కడక్కడ కొన్ని గోడలలో చిల్లులు, నెర్రెలు అగుపిస్తున్నాయి. నెపోలియన్ స్క్వేర్‌లోని పధ్నాలుగు అంతస్తుల భవనం పూర్వవైభవం కోల్పోయి, నమిలిపారవేసిన చెరుకుగడలా, జీవచ్ఛవం మాదిరి నిలిచివుంది.

కృత్రిమంతైన దాటి ముందుకువెళ్ళారు. బరువుకు ఆవంతెన కిరకిర లాడుతోంది. కాని నది దాటటానికి ఇదొక్కటే మార్గం. దీన్ని సోవియట్ సైనికులు నిర్మించారు. ఆవలివైపు, కొయ్య చెక్కలమీద చిత్రింపబడిన కొత్త ప్రభుత్వాధినేతల బొమ్మలు పైనుంచి పలకరిస్తున్నాయి. పురుషులు, స్త్రీలు – స్థలాభావం చేత నిలబడ్డ లారీలు హడావడిగా పరుగెత్తుకు వెడుతున్నాయి. చేతిసంచులు, ట్రంకుపెట్టెల పట్టుకు నడుస్తున్నవాళ్ళు వచ్చే పోయే కార్లు, లారీలనుంచి తప్పించుకుని జాగ్రత్తగా వెడుతున్నారు.

పీటర్‌కు ఎక్కడికివెళ్ళాల్సిందీ స్పష్టంగా తెలియలేదు. ఎక్కడా చిరునామాలు, ముఖాలు, టెలిఫోన్లు లేవు! ఉన్న దల్లా బారులుతీరిన వీధులు! ఇవయినా సక్రమంగా సజావుగా లేవు. లారీలు వెళ్ళినందువల్ల జనం అడ్డదారుల్లో నడిచినందు వల్ల యేర్పడ్డ బాటలు వీధులకు అడ్డంగా వెడుతున్నాయి. వీధుల్లో వున్న చెత్త చెదారం గుట్టలమీదుగా వెడుతూ జీప్ కుదుపు ఎక్కువగావుంది; దుమ్ము రేగుతోంది. గాలితోపాటు కళేబరాల కంపు కూడా సోకుతోంది. యుద్ధానికి పూర్వం తాము నివశించిన వీధుల దగ్గరకు చేరుకున్నారు. అడ్డ వీధికి అడ్డంగా పెట్టిన గొట్టాలు పీపాలు ఇంకా పక్కకు నెట్టివేయ లేదు. అందుచేత జీప్‌ను అక్కడే ఆపి, పీటర్ కాలినడకను బయలుదేరాడు.

రాళ్ళ వరుసలన్నీ పగులగొట్టబడ్డాయి. ఇసుకలో కొయ్యముక్కలు కూరుకుపోయి వున్నాయి. కొందరు మను ష్యులు గుంపులు గుంపులుగా చేరి అదేపనిగా తవ్వుతున్నారు.

వాళ్లు ముక్కలకు నోళ్ళకు చేతిరుమాళ్లు ఆచ్ఛాదనగా కట్టుకున్నారు. ఆడవాళ్ళు కిందికి వంగి కంతల్లోనుంచి చూస్తున్నారు. ఒకావిడ పీటర్ వంక తదేకంగా చూస్తూవుండిపోయింది. చిరిగిన పీలికలు ధరించివుంది. శరీరమంతా ధూళిధూసరమై వుంది. కుంతలాలు మటుకు నల్లగా అందంగా వున్నాయి. ఆమెముఖం మీద పొడుగైన విచారరేఖలున్నాయి. కళ్ళలోంచి అశ్రువులు రాలుతున్నాయి. పీటర్ సిగరెట్ పొగ లోపలకు పీలుస్తూ వడివడిగా ముందుకు వెళ్ళాడు.

నిశ్శబ్దం. ఆకాశం స్వచ్ఛంగా నీలంగా అగుపిస్తోంది. ఎక్కడా పక్షులసవ్వడే వినరావడంలేదు. అతను పూర్వం తాను ఉన్న ఇంటిముందు ఆగాడు. అక్కడక్కడ కాలిన గుర్తులుతప్ప తతిమ్మా ఇల్లంతా అలాగే నిలిచివుంది. ఆవరణ అంతటా బాంబులు పడిన గుర్తులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. పచ్చిక వున్నచోట సమాధులు కన్పిస్తున్నాయి. వాటిమీద ఉక్కుకవచంవుంది. ఆవరణలో నిలబడి, తెరిచివున్న కిటికీల వైపు చూచాడు. అప్పుడుగాని అతను పొగను గమనించలేదు. గోడకు ఆనించివున్న తగరపుగొట్టంలోంచి పొగ ఉధృతంగా వస్తోంది. జనం మళ్లీ లోనికివెడుతున్నారు. ఒక వృద్ధుడు తన వెంట ఇనుపముక్కలు యీడ్చుకొంటూ గుహాలోంచి బయటకు వచ్చాడు. అతడు పీటర్ వంక నిర్లక్ష్యంగా చూచాడు.

"ఈయింట్లో నివశిస్తూ వుండిన జనమంతా ఏమైనారు? నువ్వు ఇక్కడివాడివేనా?" అనడిగాడు పీటర్.

తనతల్లి సజీవంగానే ఉన్నదనీ, వార్సాదగ్గర ఏదో పల్లెటూళ్లో నివశిస్తున్నదనీ అతను ఎరుగును. కాని యిక్కడి

వాళ్లు చాలమంది అతనికి తెలుసు. వాళ్ళ అనుదిన వ్యవహారా లన్నీ అతనికి తెలుసు. వాళ్ళ జీవితాలపట్ల, జీవనవిధానాల పట్ల అతనికి ప్రత్యేక అభిరుచికూడావుంది

"నేను పదో నెంబరునించి వస్తున్నాను. నాకు యిక్కడి మనుష్యులతో పరిచయంలేదు – నా భార్యకు బహుశ తెలిసి వుండవచ్చు. ఆమె యిక్కడికి "క్లీనర్"గా వస్తూండేది!"

వృద్ధురాలు అతనివంక ఒక జడపదార్థాన్ని చూచినట్లు చూచింది. ఏమిటి వీళ్ళవ్యవహారం? వాళ్ళుమటుకు వాళ్ళే దహనగృహాలతాలూకు కళేబరాల మాదిరి కనిపిస్తున్నారు! వినాశానికి మూర్తుల్లా అగుపిస్తున్నారు.

"క్రాజెస్కీ ఏమయ్యాడో నీకేమైనా తెలుసా? అతను పూర్వం యీ మొదటిఅంతస్తులో వుండేవాడు"

"క్రాజెస్కీ!" అంది. ఆమె గుర్తుతెచ్చుకోవటానికి ప్రయత్నిస్తున్నట్లు – "అవును, ఆపేరుగలవాళ్లు యిక్కడ ఎవరో వున్నట్లేగుర్తు. కాని అతను 1939 తరువాత యిక్కడికి వచ్చి నట్లే లేదు. ఎక్కడో ఇంగ్లండ్‌లో వుంటున్నాడని చెప్పు కున్నారు."

"మరి – గోంటాక్ విషయం?"

"అతన్నాకు తెలుసు. కాని యేమయ్యాడో ఎవరూ ఎరుగరు. అతని భార్య, కుమార్తెలు యిక్కడ వుంటూండే వాళ్లు. కాని వాళ్ళను చంపేశారు."

"మార్టినాక్ తెలుసా?"

"అచ్చుయంత్రం బాపతు మనిషేనా? అతను వెళ్ళి పోయాడు."

"ఉ(బాన్‌స్కీ కుటుంబం యేమయ్యారు."

పీటర్ యిదివరకు, కిందిఅంతస్తులో వుంటున్న ఉ(బాన్‌స్కీల కర్మాగారం చూడటానికి ముచ్చటపడుతూ వుండేవాడు. కార్ఖానాలో ఎందరో పనివాళ్లు కొయ్యముక్కలకు నగిషీపడుతూ వుండటం, వాటికి రకరకాల ఆకారాలు కూరుస్తూ వుండటం చూడటానికి ఎంతో ముచ్చటగా వుండేది. ఉ(బాన్‌స్కీకి తన పనిఅంటే ఎంతో ఆప్యాయత. టేబుల్‌కుగాని మరేదయినా పరికరానికి గాని కొత్తరకం డిజైన్ వచ్చినప్పుడు, దాన్ని పీటర్‌తో చర్చిస్తూ వుండేవాడు. అంతా విశదంగా తెలియపరుస్తూ వుండేవాడు. తూర్పు ప్రష్యా సరిహద్దుల్లోని కాకులుదూరని కారడివికి చెందిన తన ప్రాంతాన్ని గురించి కథలు– గాథలు చెబుతూ వుండేవాడు. అతని భార్య జుట్టు లేత పసుపుపచ్చనిరంగులో వుండేది. కళ్లు నల్లగావుండేవి. వాళ్ళ ముగ్గురుకూతుళ్ళూ కూడా తల్లి మాదిరే వుండేవాళ్ళు. పీటర్ రాత్రిపూటలు వాళ్ళను చూడటానికి వెళ్ళినప్పుడు, ఆమె టీకప్పు తెచ్చి అతని ముందుంచి, తన కుర్చీలో కూర్చుని అల్లికపని కొనసాగిస్తూ వుండేది. మధ్యమధ్య కళ్లుపైకెత్తి చూస్తూ అంతా గమనిస్తున్నట్లు వుండేది.

"ఉ(బాన్‌స్కీయా" అబ్బో! చాలాకాలం కిందటి విషయం! ఎప్పుడో '40లో అతన్ని అరెస్టుచేసి తీసుకువెళ్ళారు. ఆస్విజ్ దగ్గర అతను చనిపోయాడు. అతనిభార్య, ముగ్గురు కూతుళ్ళూకూడా–ఇక్కడి అందరికిమల్లే నే. . ." అంటూ ఆమె వాక్యం పూర్తిచేయకుండా ఆపింది.

"ఏమిటది? యేమయ్యారు? ఇక్కడ అందరికీమల్లేనే—?"

వృద్ధురాలు నేలవైపుగా వేలుసాచి చూపుతూ: "ఈ ఇల్లు అంత క్షేమకరమయింది కాదన్నారు. బాంబులదెబ్బకు ఆగలేదన్నారు. అంచేత అందరు ఆ పెద్దయింటి భూగృహంలో పదహారో నెంబరు ఇంటికి వెళ్లారు. తర్వాత ఆ యింటిమీద కూడా ప్రత్యక్షమైన దాడిజరిగింది. అందరూ సజీవంగాసమాధి చేయబడ్డారు. వాళ్ళింకా కిందనే పడివున్నారు. వాళ్ళను తవ్వి తియ్యటానికి యెవరూలేరు. ఇంకా కొన్ని నెలలు పడుతుం దనుకుంటాను."

రోడ్డుమధ్య నడుస్తూ పీటర్ ఆ స్థలాన్ని దూరంనుంచి చూచే గుర్తించాడు. పగిలికూలిన గోడలు కుప్పలుగా పడి వున్నాయి. ఉర్బాన్‌స్కీ సతికళ్లు తనకు ఇదివరకు చాలసార్లు గుర్తుకువచ్చాయని స్ఫురించింది. ఆమె కళ్లు దీపకాంతులు వెదజల్లుతూవుంటాయి. ఈ గుర్తులన్నీ నాశనం చేయబడు తున్నాయి. ఆమె నేత్రాలు తనకు యింటెనించీ ఒకచిహ్నం అవుతేనా? పోలండుకే ఒక చిహ్నప్రాయం అవుతేనా? తను వార్సారావడం మంచిదేఅయింది. మిలటరీటోపీ తీసేసి కొద్దిసేపు నిశ్చలంగా నిలుచున్నాడు. హతులైన వారి బాధలను తలపోసు కుంటున్నాడు.

## 2

ప్రాగానగరంలో పార్టీకేంద్రభవనప్రాంత వీధుల్లో మేజర్ బారుగా విసురుగా నడుస్తున్నాడు. అతనికి కొన్ని గజాల వెనుక, ఆటమాటిక్ ఆయుధం మెడకుకట్టుకుని ఒకకుర్రవాడు నడుస్తు

న్నాడు. తన రక్షణకోసంగాని యితరుల రక్షణకోసంగాని ఎవరినేనా నియోగించటం బారుగాకు యిష్టంలేదు. కాని యిటీవల భార్యప్రోద్బలంవల్ల యీ యేర్పాటుకు లొంగక తప్పలేదు. కొన్ని మాసాల్రకితం, లూబిన్‌లో, కేంద్ర సైన్యంలో పనిచేసిన కారణంగా శిక్షకు లోనవుతున్న కొందరు సైనికులలోనుంచి యీ కుర్రవాడిని, బారుగా రక్షించాడు. భయంకరులయిన బోల్షివిక్కుల బారినుంచి యీ కుర్రవాడు రక్షణకోరాడు. బారుగా ఇతనికి తనయింట్లో ఒక గదియిచ్చి స్వతంత్రంగా మెలగటానికి అవకాశంయిచ్చాడు. "డైరెక్టర్ ఆఫ్ పబ్లికేషన్స్" గా తన విధి నిర్వహణలో వచ్చే చర్చలు, వాదనలు వినటానికి కూడా ఆ కుర్రవాడికి అవకాశం కల్పించాడు. ఇదే మంచిపద్ధతి. క్రమం, ఆ కుర్రవాడు పిరికిగా ప్రశ్నలు వేయటం ఆరంభించాక చాలసార్లు అతనికి గంభీరంగా మాట్లాడాడు. కుర్రవాడు ఎప్పుడూ బారుగాతోనే వుండటం అతనిపట్ల విధేయతగా అణుకువగా వుండటం అలవరచుకున్నాడు. అందుకనే బారుగాకు తగిన శరీరరక్షకుడుగా తయారయ్యాడు. ఇలాంటి కుర్రవాళ్లు బారుగాకు గర్వకారణం.

శీతకాలపు వాయువును లోపలికి పీల్చాడు. ఈమధ్య జరిగిన ఘాతుకాలు, కొత్తమానవాళికి చెందబోతున్న యీ నగరవీధులలో తను నడుస్తున్నవిషం-ఇవన్నీ అతన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. అన్నిపనులు చక్కదిద్దుకోవటానికి యీ జీవితం సుదీర్ఘమైనదైతే ఎంత బాగుంటుంది? ఈ మానవజీవితాన్ని పొడిగించటానికి యేదో ఒకమార్గం కనిపెట్టాలి. పూర్వాం, ఫాసిజమ్ గెలుపొందుతుందన్న సందేహం కలిగిన

క్షణంలో తను వెనెజులా పారిపోదా మనుకున్నాడు, నిజంగా అట్లావెళ్ళిపోయినట్లయితే యేమయ్యేది? ఒకొక్కొక్క క్షణంలో చేసుకొన్న తప్పుడు నిర్ణయాలు-వాళ్ళవాళ్ళ జీవిత క్షేమాలలో ఎన్నో దౌర్భాగ్యాలను తీసుకువస్తాయి. పిరికిపంద అనేపేరుతో దేశద్రోహి అనేపేరుతో-కాళ్లు విరగ్గొట్టబడి ఇక్కడికి రావలసి వచ్చేది. తనేగనుక పూర్వం ఆ నిశ్చయానికే కట్టుబడి వున్నట్లయితే.

కేంద్రసంఘ భవనంమెట్లు మురికిగా ఉమ్ములతో సిగరెట్టు పీకలతో నిండివున్నాయి. తలుపులు చప్పుడవుతున్నాయి. ఏవో కంఠస్వరాలు వినవస్తున్నాయి. ఒక సేవకుడికి తనపేరు చెప్పాడు. ఎక్కువసేపు వేచివుండ నవసరం లేకుండానే లోనికి ప్రవేశం దొరికింది.

సెక్రటరీజనరల్ కుర్చీలోంచిలేచి సాదరంగా అతనివైపు నాలుగుఅడుగులు వేశాడు. యుద్ధానికిపూర్వం, జైలునుంచి పారిపోబోతూండగా జైలర్లు అతనికాళ్ళకు తుపాకులు గురిపెట్టి పేల్చారు. అతని ముఖంలో అలసటకనిపిస్తూంది ఆ కళ్ళలోనే అతని జీవమంతా వున్నట్లుంది. పసుపుపచ్చని చర్మం, బట్టతల, మూసినట్టున్న నుదురు, చారలతోనిండినమూతి-ఇవన్నీ అతన్ని నిక్షేపాలను కాపాడే దేవతలా అగుపింపజేస్తున్నాయి. బారుగా బరువుగా ఒక వాలుకుర్చీలో జారగిలపడ్డాడు.

“మేం పరిస్థితినంతా చర్చించాం. పర్యవసానంగా నేను నిశితమైన ఆలోచనతో ఇక్కడికి వచ్చాను. అంతా దాని తోనే వుంది. మనం ఇలా ఒక హెచ్చరికచేయటానికి సంసి

ద్ధులమైవున్నాం: "మా ప్రస్తుత లౌకికప్రయోగాలకు వ్యతిరేకు లందరూ అన్నింటికీ వ్యతిరేకులే!" అని.

అతను భారంగా ఊపిరిపీలుస్తున్నాడు. సెక్రటరీజనరల్ అతనికి సిగరెట్ కేస్ అందించి, తనుకూడా ఒక సిగరెట్ తీసుకొని కేస్ మూసేశాడు. అతను తలఊపాడు. బారుగా కోటు గుండీలు విప్పుకుని ఆరంభించాడు:

"అంతా సుస్పష్టం! కష్టపరిస్థితులలో ఇక్కడవున్నారు కనుక మీ కీదేశపువిషయాలన్నీ తేలికగా అవగాహన అవుతాయి. దురదృష్టవశాత్తు మనం, 1917లో రష్యా ఎటువంటి చిక్కుల్లోవుందో అలాంటిచిక్కుల్లో వున్నాం ప్రస్తుతం. అందుకనే సునిశితమైన వాక్యం ప్రయోగించాలి!"

సెక్రటరీ జనరల్ నీరసంగా సిగరెట్ పీలుస్తున్నాడు. అతని కనుబొమ్మల మధ్య ఒక ముడత యేర్పడింది.

బారుగా "మీకోసం ఒక ముద్రాపకయంత్రం సృష్టించాను. పార్టీ కోరినంతవరకూ నేను ఆ ముద్రాపకయంత్రాన్ని నిర్వహిస్తాను. కాని నాకు సహాయం కావాలి. ఒక్కొక్కసారి మీకు యితర స్నేహితులకు విజ్ఞాపన పంపవలసి వస్తుంది. నాఅంతట నేను ఎంత చేయగలనో అంతా చేస్తున్నాను" అన్నాడు.

"నిన్ను తరలించటం అసాధ్యమని నీకూ తెలుసు!"

"పోలిష్ సోషలిస్టుపార్టీ కోసం నా కాంటిన్‌లోని వంటమనిషిని తీసుకువెళ్ళారు. మూలమలుపులో వున్న చిన్న దుకాణంలోనూ – తతిమ్మా దుకాణాలలో కూడా కొత్త కొత్త వాళ్ళను ఎన్నుకుంటున్నారు. సోషలిస్టు నాయకులంతా

చచ్చిపోయారనే మనం భావించవలసి వుంటుంది. ఇప్పుడు పనికిమాలిన వాళ్ళంతా వచ్చి ఆ పార్టీలో చేరుతున్నారు. ఎందుచేతనంటే వాళ్ళకి దేశభక్తిగల పార్టీ, న్యాయసమ్మత మైనది కూడా! ఇంతలో, నేను పేదలపార్టీనుంచి బాగా ఆలోచించగలవాడిని వ్రాయగలవాడిని ఎవడినైనా తీసుకుందా మనుకుంటున్నాను. ఇంతకూ ఇప్పుడు ఆలోచించవలసింది - యీ విషయంకాదు. ఈ నగరం శిథిలమైపోవటం మన మాన సికతను చాల యిబ్బంది పెడుతోంది. ప్రభుత్వ కేంద్రాన్ని ఇక్కడినుంచి ప్రాగాకు మార్చాలని నిశ్చయించటం చాలా మంచిపనే! కాని దాని ఫలితం కొన్నాళ్లు పోయింతర్వాత కాని అనుభవంలోకిరాదు. గతమంతా భారంగా తలుపుకు వస్తోంది. అదీగాక వాళ్లు మన మనుష్యులను చంపేస్తున్నారు."

సెక్రటరీజనరల్ కళ్లు ఎత్తకుండానే ఇలా అన్నాడు:

"తప్పనిసరి భయాలు, తాత్కాలిక మినహాయింపులు సరితూగే యేర్పాటు చేయాలి."

బారుగా ముఖం ఎర్రబారింది. అతనిలా అన్నాడు: "నామటుకు నాకు, ఇదొక మినహాయింపు కాదనుకుంటాను. మానసిక వాతావరణం యెలావుందా అని చూడటం నావిధి. విజ్ఞతను కాపాడటానికి మనం ఎక్కువచర్యలు తీసుకోలేక పోతున్నాం. అదే భీభత్సానికి లక్ష్యం. లోయపొడుగునా అక్కడక్కడా వీలయిన చోటనల్లా కాలివంతెనలు నిర్మించాలి. వాళ్లు భయపడుతున్నారు గనుక యీ వంతెనలు వాడేట్లుగా చూడాలి. ఇక వేరేదారి లేకపోతే, అడవులకు వెడతారు!"

సెక్రటరీ జనరల్ కిటికీవంకచూస్తూ ఇలా అన్నాడు:

"కాని ప్రస్తుతక్షణానికి కావలసినదేమో నీవు అర్థంచేసుకోవాలి కద! యుద్ధం ఇంకా సాగుతూ నేవుందని నీకు గుర్తుచేయనక్కర్లేదుగా!"

మళ్లీ అదే కదలిక. బారుగా ఇలా జవాబుచెప్పాడు: "సంయుక్త పద్ధతులు అవసరమైన పరిణామాలను సృష్టిస్తాయి. వాటివల్ల మనం భయాన్ని కలిగించవచ్చు. నేను కేవలం విషయవ్యాపకుడినే నేను కాలివంతెనలు కావాలంటున్నాను. నిశితమైన ఆలోచన చేయాలంటున్నాను."

సెక్రటరీ జనరల్ అతనివంక వింతగా చూచాడు. బారుగా "బహుశ నేను పొరబడి వుండవచ్చు. కామ్రేడ్ లాంపె కార్యక్రమం కొనసాగించటం శ్రేయస్కరంగా భావిస్తున్నాను. జాతీయతనుగాని మతాన్నిగాని తేలికగా చూడటానికి మనం అలవడిలేం." అని కాస్సేపాగి తిరిగి యిల్లా అన్నాడు: "పోలిట్‌బ్యూరో వైఖరి సందేహానికి అతీతంగా వుంది. రాగల నాలుగు సంవత్సరాలలో కొత్త ప్రయోగాలు అనేకం జరుగుతాయి. ఈ దేశం క్లిష్టమయినది, ఇంతవరకూ మనం చేసింది యేమీ లేదు!"

సెక్రటరీ జనరల్ అఫ్రేను కదిపాడు. బారుగా మాటలు ఎప్పుడూ అలాగె వుంటాయి.

"నేనొక సూచనచేస్తున్నాను. దాన్ని ఆమోదించవలసే వుంటుంది. నా సూచనను మనమిత్రులందరిముందు వుంచుతాను. వాతావరణాన్ని ప్రశాంతపరచటానికి ఒక ప్రత్యేక పత్రిక నడపటం సుసాధ్యమే అవుతుంది. మనం బహిః శక్తులనుంచి కాపాడుకోవటానికి తగిన ఆత్మశక్తి కలిగివున్నా

మని ఋజువుచేసుకోవాలి. ఈ విషయంమీద మీ ఆలోచనలు అభిప్రాయాలు వినాలనివుంది. నా సూచన బాగున్నదంటే, మీ సహకారం నేను స్వీకరిస్తాను."

"ఇంతకూ నీ మనసులోని దేమిటి ?"

"మీకు చెప్పానో లేదో తెలియదు. సోవియట్ భద్రతాసమితి ఒక ప్రాతిపదికతో మనదగ్గరకు వచ్చింది. వాళ్లు పట్టుకొన్న పక్షి మనకు ఉపయోగిస్తుందంటున్నారు. వాళ్ళ సూచనను మనం యథాతథంగా స్వీకరించనక్కర్లేదనుకో. అయినా ఆవ్యక్తి పేరు చెబుతాను: "మైకేల్ కామినిస్కీ".

సెక్రటరీజనరల్ కూర్చున్నచోటినించి పైకి ఎగిరాడు. జేబుల్లో చేతులు ఇరికించుకుని గదిలో అటు యిటు పచార్లు చేశాడు.

"దేశంలోకల్లా విప్లవవాది. తీవ్రవాది! అయితే మనం కేంద్రసైన్యంలో కుర్రవాళ్ళను అరెస్టుచేసి, అతన్నొక్కడినీ వొదిలిపెడతామా ? ఇంతకూ మనం చేస్తున్న దేమిటి?"

బారుణా ప్రశాంతంగా ఇలా అన్నాడు:

"అతనికి గొప్పపేరుంది. అరే ఎంతపనైనా చేస్తుంది. పాతనగరం దండయాత్రలో అతను పోరాడాడు. బాగా పోరాడాడుకూడా! మన మిత్రులు అతనివిలువ తెలుసుకోగలిగారు. లేకపోతే అతనిమీద ప్రయోగానికి కాలం వృథాచేసే వాళ్లు కారు. మనం అతన్ని రప్పిద్దాం. అలాంటివ్యక్తుల్నే ఇంకా ఎందర్నయినాసరే తీసుకువద్దాం–దొరికితే చాలు!"

సెక్రటరీ కూర్చుని దౌర్జన్యంగా యిలా అడిగాడు : "మరింత సుగమ పరిస్థితులు వస్తాయనిఆశిస్తూ తిరిగి ఆ మైకేల్ వంటి దుష్టులను చేరదీయటమా?"

బారుగా నవ్వి యిలా అన్నాడు : "అది సరికాదు. ఉపమానం చెబుతున్నాను క్షమించి వినండి—ఆకు ముల్లుమీాద పడినా, ముల్లు ఆకుమీాద పడినా— ఫలితంమటుకు ఒకటే! ముందు వాళ్లు మనను మోసగిస్తారు, తరువాత ఆత్మవంచన చేసుకుంటారు. ఈ ఆత్మకథనంలో యేమీాలేకుండా మిగిలిపోతారు. మానసికపరిణామాలు విధిగావస్తాయి. దానికి తాళంచెవి మనదగ్గరే వుంది!"

సెక్రటరీ ఒక విషపునవ్వు నవ్వాడు.

"ఎలాంటిజాతి! ఎక్కడచూచినా ఫాసిస్టులు, జాతీయులు, పిచ్చివాళ్లు, మతోన్మాదులు, జూదగాళ్లు! నేను యుగస్లేవియా ప్రజలనుచూచి అసూయపడుతున్నాను. అందరూ నిజాయితీపరులు, నమ్మకస్థులూను."

అతనికి అధికారం కైవసంచేసుకోవటం చేత కాదని ప్రజలు చెప్పుకుంటూవున్న మాట నిజమే ననుకున్నాడు. బారుగా ఈ విప్లవవైఖరికి యేదో కారణం వుండివుండాలి. బహుళ తన నినాదాలతోనే మునిగితేలటం, సరిపోని విజ్ఞానం అయివుంటాయి.

సెక్రటరీ విచారపురస్సరంగా యిలా అన్నాడు : "ఈ విధమైన విభిన్నచర్యలు మంచివేనని నేనూ ఒప్పుకుంటాను. ముఠాలను వేరుచేసి ఆ తర్వాత ఒక్కొక్కవ్యక్తిని ప్రత్యేకంగా పరీక్షించుకుంటూ రావాలి. కాని ఇది రెండువక్కలా

పదునైన కత్తివంటి ఆయుధం అనుకుంటాను. ఇతర కామ్రేడ్స్ ఏమనుకుంటారో చూదాం!"

బారుగా సంతోషించాడు. సెక్రటరీ తన ఆలోచనలతో అంగీకరించాడు. అంతా సుస్పష్టంగా వుంది. ఇవ్వాళో లేక కాస్సేపటికో ఇదే పని చేయవలసి వుంది. స్వాతంత్ర్యం పొందిన అన్ని దేశాలలోను ఇదే చరిత్ర పునశ్చరణ కావలసివుంది. అంతేకాక, టుఖనావ్ తో సంభాషించకపోయినట్లయితే తాను ఇదేమీ చేసివుండేవాడు కాదు.

సెక్రటరీ బల్లమీద పడివున్న డైరీపుటలు తిప్పుతూ: "నీకింకో విషయం చెప్పాలిస్వుంది. పశ్చిమతీరంలో వున్న ఒక పేపరు కర్మాగారాన్ని గురించి కొన్నికాయితాలు. మనం దాన్ని రక్షించాలి. ఎక్కువకాలం లేదు. నీదగ్గర నమ్మకస్తుడైన మనిషి ఎవరైనా వున్నారా?" అనడిగాడు.

రష్యన్ల నోటిదగ్గరి ఆహారం తీసివేయటం! విప్లవాత్మకమైన మరొక అంతఃకలహం. ఇదంతా చివరకు ఎక్కడ తేలుతుంది?

"ఆఁ ఉన్నాడు. త్వరలోనే ఒకవ్యక్తిని ఎన్నికచేసి మీదగ్గరకు పంపుతాను!" అన్నాడు.

"అతను తప్పకుండా మనపార్టీసభ్యుడే అయివుండాలి సుమా!"

భారంగా మెట్లుదిగుతూ బారుగా తను యింకా ఆ రోజు చేయవలసిన కార్యకలాపాలనుగురించి ఆలోచించుకున్నాడు. ఈమధ్య యుగాలలో మానవజీవితంయొక్క సారం ఎంత? బహుశ నలభై లేక యాభై సంవత్సరాలు. చుస్వరం.

మని పన్నవాడు మూడువందలో నాలుగువందలో సంవత్స రాలు బ్రతకాలి. విజ్ఞానం పురోగమిస్తున్న యీ విప్లవాత్మక సమయ్యంలో యీ విషయమై మానవుడికి అధికారం లేదుకద! ముసలితనం తీసుకువచ్చే యిబ్బందులు తలుచుకుంటే – యింకా ఘోరం!

బారుగా కుర్రవాడు వచ్చేంతవరకూ ఆగి యిలా చెప్పాడు: "ఈ విషయం గుర్తుంచుకో. ఆకారంలో చెట్టు విత్త నం ఎంతో చిన్నది. కాని ఆ విత్తనంనుంచి రాగలచెట్టు ఆకారాన్ని ఎవరూ ముందుగా ఊహించలేరు. 1945 సంవత్స రాన్ని గురించి నీవు నీ మనుమలతో విచిత్రంగా చెబుతావు!"

## 3

రక్షించుకోవలసిన అవసరంలేనప్పుడు ప్రాణానికి చాల హాయిగా వుంటుంది. పీటర్ చేతులు వెనక్కు విరుచుకుని అరమూతలుపడిన కళ్ళలోంచి తల్లివైపు చూస్తూ కూర్చు న్నాడు. చిన్నతనంలో ఫ్లుజ్వరం వచ్చినప్పుడు తన పరిస్థితి ఎలావుందో ఇప్పుడూ అంతే నడుస్తున్న చరిత్రలో జబ్బు ఒక విఘాతం వంటిది. అతని తల్లి పక్కనే కూర్చుని టీ కలుపుతూ బల్లమీద వుంచింది. పునరాగమనం, ఒకరినొకరు తిరిగి చూచుకోగలగటం – ఎంతో సంతోషదాయకంగా వున్నాయి. ఆమె కన్నీళ్లు, ఆమె ఉద్రేకం చూస్తూంటే అతనికి తన పసి తనం, అప్పటి విషాద పరిస్థితులు గుర్తుకు వస్తున్నాయి.

కీళ్ళవాతంలో ఆమెచేతులు కొంకర్లుపోయినాయి. ఆమెపాదాలు యిదివరకటికంటే బాగానే వున్నాయి. ఆమె

బాగా చితికిపోయింది. పూర్వం ఆమె ముఖం, నిజమైనవయస్సు కంటే ఆమెను చాల చిన్నగా కనిపించేస్తూవుండేది. కాని యిప్పుడు ఆ పరిస్థితి తారుమారయింది. శరీరంబిగువు సడలి పోయి ముఖకాంతులు సన్నగిల్లుతున్నాయి. ఆమె దుస్తులు చాలచోట్ల మాసికలు వేసివున్నాయి. ఇప్పుడామెకు అదొక్కటే జత. కొద్దిరోజులపాటు పల్లెపట్టు చూసివద్దామని వార్సానుంచి బయలుదేరినప్పుడు ధరించిన జత అది! ఇంతలో దండయాత్ర ఆరంభమయింది. లోనలో తనే మాటలు అనుకుంటున్నట్లు ఆమె బోసినోరు ఊరికే వణుకుతోంది. ఆమె ఏకైక పుత్రుడు బ్రతికేవున్నాడు. ఆమెకు గ్రహం చేసుకున్నాడు. గతించిన యీ సంవత్సరాలలో ఎవరు ఎలా వున్నదీ, ఎలా మనినదీ పరస్పరం చెప్పుకున్నారు. అసలు వాళ్ళిద్దరూ అలా కలుసుకోగలగటమే ఒక విచిత్రం!

"ఇదిగో తాగునాయనా! వంటికి మంచిది" అంటూ ఆమె అతనికి టీకప్పు అందించింది. "ప్రజలు దయాహీనులు, డాక్టను సతి అప్పుడే నీ యూనిఫారంనుగురించి చెడ్డగా చెబుతోంది. కాని నీవు అక్రమమార్గంలో నడవవని నాకు తెలుసు. ఏమైనా పరిస్థితులు ఇప్పుడు చాల భయంకరంగా వున్నాయి."

పీటర్ టీ త్రాగి, తన జీవితానికల్లా ధ్యేయైకవాంఛ అయినదాన్ని గురించి ఆలోచించసాగాడు. అతనికి తండ్రి అట్టే జ్ఞాపకంలేదు. ఆయన పీటర్ను అశక్తుడుగావున్నప్పుడు మిలటరీ చర్యలలో చంపబడ్డాడు. యూరప్‌దేశం తన మిత్రశక్తులతో విజృంభిస్తున్న సోవియట్ విప్లవాత్మకచర్యలను అరికట్టాలని ప్రయత్నించింది. కొంతవరకు విజయం సాధించిందికూడా. కాని

బోల్షివిక్కులను పూర్తిగా పదవీచ్యుతులను చేయలేకపోయింది. కాని వార్సాయుద్ధంవల్ల వాళ్ళ పురోగమనం చాలమటుకు కుంటుపడింది. ఇలా సంభవించకపోయినట్లయితే–పీటర్ యొక్క పెంపకం మరోరకంగా వుండేది–అతను జీవితంలో ఇన్ని దుర్ఘటనలను చూడగలిగేవాడు కాదు. కాని ఎవరికి తెలుసు? అతను ఎన్నో మంచిచెడ్డలు తెలుసుకోగలిగేవాడు కాదు; అతన్ని అనాధగాచేసి అతనితండ్రి పరలోకగతుడైనాడు. తండ్రి మరణకారణంగా పీటర్, పాశ్చాత్య నాగరికతనుగురించి విపరీతంగా చెప్పే ఒకానొక పాఠశాలలో విద్య నభ్యసించాడు. ఆ పాఠశాలల్లో లాటిన్ ప్రముఖభాషగా పరిగణింపబడేది. 'రష్యన్' కనీసం విదేశభాషల్లోనయినా వుండేదికాదు. సోవియట్ దళాలు పీటర్ తండ్రిని చంపి ఇరవైనాలుగు సంవత్సరాలైంది. చనిపోయినప్పుడు పీటర్ తండ్రికి, ఇప్పుడు పీటర్‌కు వున్నవయస్సే వుండేది. ఈరోజున అతనిపతనం పూర్తయింది.

"నాయనా, పీటర్! ఏమిజరుగనున్నదో నాకు చెప్పు. మనవాళ్ళు వాళ్ళను విపరీతంగా అసహ్యించుకుంటున్నారు. మనం స్వాతంత్ర్యంకోసం ప్రార్థించాం. మన ప్రార్థన అనుగ్రహింపబడింది. కొత్తవాళ్ళు మనదేశం ఆక్రమించుకున్నారు. వాళ్ళు పోలండును మరో రిపబ్లిక్‌గా తయారుచేస్తారటగా!"

పీటర్ టోకప్పు కిందపెట్టాడు. గడ్డం కిందివరకూ దుప్పటి లాక్కొని వుండటం, దీపకాంతి వలయం–ఇవన్నీచూచి బయట ఏం జరుగుతోందో ఆలోచించుకున్నాడు. అతను మధ్యాహ్నం ఒక్కక్షణంపాటు బయటకు వెళ్లాడు. బజారులో ఎక్కడా జనసంచారం కనిపించలేదు వీధులు ఖాళీగా వున్నాయి. నల్లని

ఆకాశంలో మేఘాలు స్వేచ్ఛగా తిరుగుతున్నాయి. ఒక కుర్ర వాడు కొయ్యమోటారుకారుతో ఆడుకుంటూ తనలోతనే మాట్లాడుకుంటున్నాడు. కుర్రవాడు బక్కపలచగా పీలగా వున్నాడు. పీటర్ వాడిపక్కకుచేరి ఎక్కడ వుంటున్నావని అడిగాడు. కుర్రవాడు ఎర్రని పెంకుటిల్లుచూపి "అదుగో! అక్కడ మాఅమ్మతో వుంటున్నాను" అన్నాడు.

"మీ నాన్న లేడా?"

"మానాన్న అజ్ఞాతంలోవున్నాడు. అప్పుడప్పుడూ రాత్రిపూటలు వస్తూవుంటాడు."

పీటర్ కుర్రవాడిజుత్తు నిమిరాడు. తలవంచుకుని యింటికి దారితీశాడు. ఎక్కడచూచినా యిదే చరిత్ర. ఈ తరంలో కుర్రవాళ్ళకు తలిదండ్రులు అజ్ఞాతంలో వుండటంకూడా ఒక సహజమైన పరిణామంగానే తయారవుతున్నట్లుంది! పిల్లలకు కొత్తవాళ్ళతో మాట్లాడటం ప్రమాదకరం అని తెలియదు.

పీటర్ తల్లి యిలా చెపుతోంది — "నాకు తెలుసు! నాకు చాల సంగతులు యిలాగే తోస్తున్నాయి. ఇదంతా సజావుగా ముగియదు. ఇప్పుడు వాళ్లు జాతీయజండాలు కూడా ఎగురవేస్తున్నారు. అదిమోసం! ఇదంతా సుడిగుండంలా వుంది. నాకిదంతా కలల్లో తెలుస్తోంది."

తనతల్లి కలలు, విశ్వాసాలు పీటర్‌కు ఎప్పుడూ ఆలో చనలకు దారితీస్తూవుంటాయి. ఇదివరకు ఆమె పీటర్ భోజన సమయంలో, రాత్రి తనకువచ్చిన కలలు వాటిప్రభావం ఎలా వుండబోయేది - వివరించి చెబుతూవుండేది. బహుశ ఇవి అంధవిశ్వాసాలే కావచ్చును. కాని పీటర్ అనుభవాన్ని పురస్క

రించుకుని ఇటువంటి విషయాలలో ఆలోచనలే ఎక్కువ అవుతున్నాయి.

"పీటర్, నీవీ గొడవంతా వదిలించుకుని తిరిగి యింటికి చేరుకున్నావు. ఇప్పుడు నీకు ఒకేఒక సలహా ఇవ్వగలను అదేమిటంటే – వెంటనే పారిపో. నన్ను గురించి ఆలోచన పెట్టుకోకు. నీవిక్కడ స్వాతంత్ర్యజీవితం ఆరంభించటానికి ప్రయత్నించకూడదు. నాకిప్పుడు యేమీ అక్కర్లేదు. ఇంకా విరామం వుండగానే పసిగట్టటం మంచిది. పారిపోవటం శ్రేయస్కరం;"

పారిపోవటం. గొడ్ల బండిలో యురల్ పర్వత ప్రాంతాలకు పారిపోవటం తన కోటీక్షైదిలందుకే వృస్తుకోరికే. అక్కడవున్న వాళ్లూ అవకాశంకోసం ఎంతోగానో అర్రులుచాచుకు కూర్చున్నారు. కాని ప్రయోజనంమాత్రం లేకపోయింది. రష్యాతో ఎలాంటి సంబంధమూ లేకుండా వుండేచోటుకు వెళ్ళిపోవాలి. లండన్ సైన్యంలో చేరినట్లయితే బాగానే వుండేదేమో. ఈసరికి మధ్యప్రాచ్యంలోనో ఇటలీలోనో వుండి వుండేవాడు. కాని తనను విడుదలచేయటం చాల ఆలస్యంగా చేశారు. పోలిష్‌సైన్యం పర్షియా చేరినతర్వాత చేశారు. తన యీ ప్రయాసఅంతా కొత్త ఎర్రసైన్యం పశ్చిమంగా ప్రయాణం చేస్తుందేమోనని! ఇక్కడ, స్వక్షేత్రంలో, తనమీద తనకే అసహ్యము – కోపము వస్తున్నాయి. అక్కడ జరిగినదంతా ఇక్కడకూడా జరిగితే అందులో ఆశ్చర్యపడవలసిన దేమి వుంటుంది? ఎక్కడికో ఒకచోటికి – సాధ్యమైనంతదూరం – ఆస్ట్రేలియాఖండానికి – పారిపోవాలి. అక్కడేదో పనిచూచుకోవాలి. ఇవన్నీ మర్చిపోవాలి. అయినా ఇది తన మాతృదేశం.

ఇక్కడ కొత్తపరిణామా లేమయినా యేర్పడుతాయని ఆశ - కనీసం ఒక్క ఆశాకిరణం వుంటే! శక్తివంచన లేకుండా తన వంటివాళ్లు లక్షలమంది పనిచేస్తారు. అరాచకం, వినాశం,విప్లవం- వీటివల్ల యేర్పడే ఉద్రేకాలకు తాను లొంగిపోవలసిందేనా? ఎప్పుడో. అయిదు, పదిసంవత్సరాల అనంతరం జరగబోయే దాన్నిబట్టి జీవితం అంచనా వేసుకోవలసిందేనా? తల్లి తన రహస్యపు టాలోచనను చెబుతోంది. ఈవిధంగా చెప్పి, తన పిరికితనాన్ని తనకే ఎత్తిచూపింది!

"ఏమో, అమ్మా, ఇవన్నీ కేవలం తాత్కాలికమైన పరిస్థితులు. ఇవన్నీ మారాల్సిందే ననుకుంటాను. జనం కోరు తున్న రీతిగానే కాకపోయినా యేదో ఒకరకంగా మారితీరు తాయి. పశ్చిమాన్ని దృష్టిలోపెట్టుకుని పనిచేయకూడదు. అంతా మనమీదే ఆధారపడివుంటుంది. ఒకరకమైన సోషలిస్టు సమాఖ్య యేర్పడుతుందేమో! · ఇప్పుడున్నట్లుగానే పరిస్థి తులు వుంటే - మనను అంత తేలికగా జీర్ణంచేసుకోలేరు!"

ఆమె జాలిగా నవ్వింది.

"నీవు చెప్పేది నాకు అర్థంకావటంలేదు. అనుకుంటు న్నావా నాయనా? నేను తెలివితక్కువదాన్నే కావచ్చు, నీ సిద్ధాంతాలూ అవీ నాకు తెలియకపోవచ్చు. కాని యీ స్థలం దుర్మార్గమయినది. ఇదే ఇన్ని విఘాతాలకు విద్రోహా లకు మూలం!"

అతను మాటలు వెదుక్కుంటూ ఇంటి కప్పువంక చూచాడు.

"కాని యేం చేయాలి అమ్మా! దారిద్ర్యం, అణగ

త్రొక్కబడటం, అమానుషం - యివన్నీ భూషణాలుగా గల యీ ప్రజలు ప్రపంచాన్ని మార్చగలరా? యుద్ధానికి ముందు మనచుట్టూ వున్నదంతా, ఇప్పుడు నిస్సారము, నిరాకారమూ అయింది కద! అయితే గతించిన రోజులు మంచివో లేక ప్రస్తుతపు కమ్యూనిష్టు పాలన మంచిదో నాకు తెలియదు. ఇదే తెలుసుకుందామని ప్రయత్నిస్తున్నాను కాని అర్థం కావటంలేదు. ఇప్పుడు యూరపు దేశం యీవత్తూ వాళ్ళకు తేలిగ్గా లభ్యమయ్యేట్టువుంది. ఒకానొకరోజు యేదో సరికొత్త పరిణామం వచ్చిపడుతుంది."

"అబద్ధంతో మొదలయ్యేది అబద్ధంగానే వుండిపోతుంది. విప్లవం అరంభమయినప్పుడు మీ నాన్న ఎంతగానో ఆనందించారు. ఆ విప్లవ ఫలితంగానే రష్యాలో జారుల పాలన అంతమయింది. దాని స్వభావం నీకుకూడా తెలుసు కదా! నీ వే రకంగా మాట్లాడాలి గనుక ఇలా మాట్లాడుతున్నావు. మరో రకంగా మాట్లాడినట్లయితే యీ విధంగా బయటపడగలిగి వుండేవాడివికాదు. ఎవరుగానీ ఏ రకంగా మాట్లాడాలో ఆ రకంగా మాట్లాడేవాళ్ళు, తాము యేమి ఆలోచించాలో ఆలోచించటం ఆరంభిస్తారు!"

లేదు, తను ఇంకా ఆ స్థితికి రాలేదుకాబోలు! తన ఆలోచనలన్నీ కుదిగుచ్చుకుని తల్లికి చెప్పగలిగేముందుగానే ఆమె ఇలా అంది:

"నీ పద్ధతి యేమీ మార్చుకోవోకు. నీవు ఎప్పుడూ ఇలాగేవుండి! తల్లి ప్రార్థన వృథాగాపోదు." అంటూ ఆమె తనకోసం పక్క పరుచుకుంది.

అతనింకా జవాబు కోసం ఆలోచించుకుంటూనే వున్నాడు.

"దీపం ఆర్పివేయమంటావా?" అనడిగింది తల్లి.

"ఆ!" అన్నాడతడు సుషుప్తిలో వుండే.

## 4

ఇక్కడయేమీ మిగిలిలేదు. ప్రభాతకాంతిలో అవశేషాలు కనుచూపుమేరంతా కనిపిస్తున్నాయి. మేఘాలనీడలు వాటిమీద అల్లలాడుతున్నాయి. మధ్యమధ్య ఎర్రని యిటుక దుమ్ము గాలిలో రేగుతోంది. గాలికి బ్రూనో నల్లని జుట్టు గిలగిల లాడుతోంది. అతనొకసారి చేతిరుమాలుతో ముఖం రుద్దుకుని కళ్ళజోడు తుడుచుకున్నాడు.

"చూచావా? నేలమట్టం చేయటమంటే యేమిటో యిప్పుడు అర్థమయిందా? ఒక్కగుర్తయినా లేదు. ఇదుగో, మాయిల్లు యిక్కడవుండేది. అయితే నేను యిక్కడలేను. వాళ్లు వచ్చినప్పుడుగాని, దండయాత్ర ఆరంభమయినప్పుడుగాని యిక్కడలేను. బ్రతికివున్నవాళ్ళంతా యేం చేశారో నేనూ అదే చేశాను." అన్నాడు బ్రూనో.

పీటర్ యేమీ మాట్లాడలేదు. శిథిలాలు యింత భీభత్సంగా వుంటాయనీ, యీ దృశ్యం యింత భయంకరంగా వుంటుందనీ అతను ఊహించలేదు.

"అదుగో, అక్కడ-ఆవలివైపు, నేను ప్రతిరోజూ మృత్యుభయంతో చచ్చిపోయేవాడిని? నన్ను పట్టుకొని వున్న

ట్లయితే నేనే చచ్చిపోయివుండేవాడిని. ఈ ఘాతుకాలను, అబ్బ, ప్రతీకారం లేనేలేదు! అవకాశంవచ్చినా—ఎలా తీర్చుకోగలమో అర్థంకాదు!"

పీటర్ అతనిచేతిని అందుకున్నాడు.

"బ్రూనో నీవిలా మాట్లాడకూడదు. ప్రతీకారం తీర్చుకోవటానికి ఒకేమార్గం వుంది. అదేమిటంటే, నీవిధిని నీవు గుర్తించి నిర్వహించటమే!"

బ్రూనో కళ్ళద్దాల వెనుకనుంచి అతడ్ని చూచాడు.

"అసలేం జరిగిందో నీవు అర్థంచేసుకోవాలి. ఈపని చాల కొద్దిమందిమటుకే చేయగలరు. దగ్గరగావున్న వాళ్ళకు గొప్పగొప్ప అపదలు అంతత్వరగా అర్థంకావు. కాలంకావాలి. ఇంతకు జరిగిందేమిటంటే, నావాళ్ళు, నాజనము...అందరూ ఊడ్చిపెట్టుకుపోయారు - తుడిచివేయ బడ్డారు!"

పూర్వం, బ్రూనో యిటువంటి మాటలు చెప్పేవాడు కాదు. తన వ్రాతలలోకాని, మాటలలోగాని తన యూదు వంశాన్ని పేర్కొనేవాడుకాడు.

"నావాళ్ళంటూ యింకా ఎవరూ లేరు. పోలిష్ యూదులు! మూడుకోట్ల జనం! వాళ్ళంతా ఇలా నేలపాలయిపోయారు. గొప్పగొప్ప పండితులు, కళాకారులు, రచయితలు—అందరూ ప్రాణాలు కోల్పోయారు. గొప్పదైన ప్రతిదీ నిర్జీవం అయింది. మరైతే—ఇక రక్షింపబడిందిఎవరూ? డబ్బున్న కొద్దిమందిమటుకే! నాబోటివాళ్లు—ఎక్కడో ఒకడూ, ఇద్దరూ—మిగిలివున్నారు!"

పీటర్ అతనిచేయి కదిపాడు.

"అలాఅనకు బ్రూనో! ఇప్పుడు బ్రతికివున్న వాళ్ళంతా- నీమాదిరే - యేదో పిరికిపనికి ఫలితంగా బ్రతికివున్నవాళ్లే. నేనూ అంతే! అందరూ అంతే!"

బ్రూనో అడ్డంగా తలఊపాడు.

"లేదు. నేను పాపాత్ముడిని! గొప్ప నీచకార్యం చేశాను. యుద్ధంముందు నా వ్రాతలన్నీ వ్యర్థం; ఇప్పుడు ప్రతి రాత్రీ వీధుల్లో సైన్యం విచ్చలవిడిగా తిరిగి నినాదాలుచేస్తూ వుండటం చూస్తూంటే అంతా వ్యర్థమనే తోస్తోంది. ఇక ఈ వ్రాతలను పూర్తిచేసే అవకాశం రాదేమోనని నేను భయపడి పోయాను. ఏదైనా కొంత విలువవున్నది, ప్రయోజనకరమైనది నాలుగుకాలాలపాటు నిలిచివుండేది అయిన సాహిత్యం తయారు చేయాలని తహతహలాడాను. అందుకు విరామం వుండదేమో నని భయపడ్డాను. ఇలా భయపడుతూకూడా-నా విలువలను చెడగొట్టుకున్నాను. నా పుస్తకాలు చెడ్డగావున్నాయంటే- దానికి కారణాలు వాటిలో నేను, ఎవరో నేనూ ఎరుగని వ్యక్తిలా నటించటమే."

"మించిపోయిందేమీలేదు. ఇప్పటికయినా, నీ రచనా వ్యాసంగం కొనసాగించి - నీపేరు నిలిచేట్టు చేసుకోవచ్చు!"

వాళ్ళట్లా నడుస్తూ వెడుతూవుండగా, కొద్దిదూరంలో హడావడిగా తవ్వకంసాగిస్తున్న యిద్దరువ్యక్తులు అగుపించారు.

"బహుశ వాళ్లు బంగారంకోసం త్రవ్వుతున్నారేమో లేక - చనిపోయిన తమ బంధువుల శవాలకోసం తవ్వు తున్నారో నీవీ మాటలు ప్రపంచానికిచెప్పు! అదుగో, అక్కడ వలె విస్కీపీపావుంది. నేను దాన్నిగురించే వ్రాసివుండాల్సింది.

దాని నిత్యజీవితాన్ని గురించి, అక్కడవుండే జనం తమ పిల్లలకు మంచి చదువు చెప్పించటానికి పడే తాపత్రయాన్ని గురించి వ్రాయవలసింది. నా ప్రజల విషాద జీవిత చరమాంకాన్ని గురించి వ్రాయవలసింది!”

“నీవొక సాక్షివి!”

బ్రూనో ఆగాడు.

“జెరూసెలమ్ నాశనమయ్యాక జోసెఫస్ ఫ్లావియస్ మాదిరిగానా? ఆ పాత్ర ధరించటానికి ఎవరు సాహసిస్తారు? మాకు వెళ్ళిపోదామనివుంది! నాకిక్కడ ఆలోచనలు సాగటం లేదు. అయితే వాళ్ళు నన్ను వెళ్ళనివ్వరు. నాకు అజ్ఞాతంగా ఎక్కడో ఒకచోట తలదాచుకోవటం ఇష్టంలేదు. పోలిష్ భాష నా మాతృభాష. నేను మరో భాషలో వ్రాయలేను.

అపాయానికి గురికాకుండా మిగిలిన ఒక పెద్దభవనం కనిపించింది. బ్రూనో దానివంక చూపుతూ ఇలా అన్నాడు: “చూచావా? జైలు మాత్రం సురక్షితంగావుంది! అది వాళ్ళకూ కావాలి! నీకు ధద్యూస్ గుర్తున్నాడా? జర్మనులు అరెస్టుచేసినప్పుడు కూడా ధైర్యంగా పరిస్థితిని ఎదుర్కొన్నాడు. తన గుహాలో ఉపన్యాసాలు ఇస్తూవుండేవాడు. దేనిమీదో తెలుసా? గ్రీకు మతప్రాశస్త్యాన్ని గురించి! ఆండ్రమెడా గురించో మైనాస్ గురించో కథ మధ్యలోవుండగా అతన్ని దుర్మరణం పాలుచేశారు——”

ధద్యూస్ పొట్టిగావుండేవాడు. జుట్టు మొఖంమీదికి పడుతూ వుండేది, వ్యంగ్యకవిత్వం వ్రాసేవాడు అతని జాతకాన్ని గురించి జ్యోతిష్యుడు సరిగ్గా చెప్పలేకపోయాడు.

ప్రేమవిజయం పొందుతాడని చెప్పిన మే పదమూడవ తేదీని అతను మృత్యుదేవతకు ఆహారం అయ్యాడు.

"ఇప్పుడు చేయగలదల్లా కొన్నాళ్ళపాటు ఎటయినా దాక్కోవటమే అనిపిస్తోంది. విడిచిపెట్టబడ్డవాళ్ళు కొత్త కొత్త పేర్లు పెట్టుకున్నారు; వాళ్ళు బ్రతికేవుండటానికి ఇదే షరతు! గతమంతా చెరిపేసుకోవాలి! కాని ఎంత సిగ్గుచేటువని, అది! బ్రతుకుమీద ఆశకొద్దీ ఎన్నెన్నో కొత్త కొత్త పేర్లు పెట్టుకున్నారు. యూదులు కాకుండా పోతేనే బతకగలరు. యూదులయిన వాళ్ళందరికీ ఉరిశిక్ష!" అన్నాడు బ్రూనో.

బ్రూనోవంక చూస్తూవుండగా పీటర్‌కు ఒక ఆలోచన వచ్చింది. మానవుడు సాంఘికశక్తులపాలిటి ఆటబొమ్మ. తను కూడా అంతేకద! యుద్ధానికిపూర్వం జరిగినదంతా తను మర్చిపోవటమే శ్రేయస్కరం! ఎన్నో దండయాత్రలు, పోట్లాటలు, కొట్లాటలు, అంతర్యుద్ధాలు, కాల్పులు! కాని తను యేమయినా చేయగలిగాడా? దేన్నయినా బహిరంగంగా ఎదిరించగలిగాడా? లేదు, అయినా తను దుష్టబుద్ధివున్న మానవుడు కాదు. కనీసం ఇది తన ఆలోచన.

"బ్రతికివున్నవాళ్ళంతా జులియస్ హాల్‌పెర్న్‌లాగ వుండటం మంచిదేమో!" అన్నాడు.

బ్రూనో చేతులు వెనక్కుకట్టుకుని నడుస్తూ రొప్పుతున్నాడు.

"మంచిదా? కావచ్చు. యూదుల ప్రశ్నల్లా ఫాసిజాన్ని ఎదిరించడమే! ఫాసిజానికి బలి అయినవాళ్ళుగా యూదులను గురించి తరతరాలుగా చెప్పుకుంటారు. కాని అది పూర్తిగా

నిజంకాదు. వెనుకటిసంగతులు జ్ఞాపకం చేసుకోవటానికి ప్రయ త్నించేవాళ్ళకు కోపం వస్తుంది. ఇదంతా యూదుల జాతీయ తగా పరిణమిస్తుంది. అది మరో మార్గం. ఏమయినప్పటికీ, నేను మాత్రం ప్రయత్నిస్తున్నాను - ఆదారినే!"

పీటర్ సిగరెట్ వెలిగించాడు.

"ఇదంతా నేను భరించగలదానికంటే చాల ఎక్కువ!"

బ్రూనో నవ్వి ఇలా అన్నాడు: "నీవు చాలా మారి పోయావు. మనమంతా మారిపోయాం. కాని ముందుముందు మనకు పరిస్థితులు చాల దారుణంగా వున్నాయి. ఈ దేశంలో ప్రతి వొక్కడికీ తనపట్ల తనకే హేయభావం యేర్పడుతోంది! కొంతకాలంపాటు నీవుకూడా ఎటో అటు వెళ్ళిపోవాలి!"

"బయటిప్రపంచమంతా మనకు నిజంగా కనిపించటం మానేసింది చూశావా?"

"ఎక్కడో ఆల్ప్స పర్వతాలున్నాయి. నేను నాలుగు గోడలమధ్య నాగదిలో కూర్చుని నా ఆలోచనలలో మునిగి పోతుండేవాడిని. బయటి ప్రపంచంతో నాకు ఎప్పుడూ అంత సంబంధంలేదు..."

మరిచిపోవటాన్ని గురించి పీటర్ చాలసేపు మథన పడ్డాడు. జైలునుగురించి, తూర్పున తనుచూచిన దృశ్యాలు, వార్సా, శ్మశానవాటికలు- అన్నీ మర్చిపోవాలి! రష్యాలోని యూరల్ పర్వతాలు నీలంగా మహోన్నతంగా అగుపిస్తున్నాయి.

బ్రూనో అన్నాడు: "బహుశ అది సాధ్యం కావచ్చు. విదేశాల్లో పనిచేయటానికి మనుషులు కావాలని వెతుకు

తున్నారు. ఎవరూ దొరకటంలేదు. వెనుకటి తెలివితేటలు యేమీ పనికిరావటంలేదు ఫీల్డుగావుంటే ఒకసారి బాగుగాలో మాట్లాడిరా !"

ఆకాశంలో పశ్చిమంగా ఒక విమానం వెడుతోంది. బ్రూనో శిథిలాలవంక చూస్తూ నీరసంగా నిలుచున్నాడు.

ఆకాశంచూచి చదువుతున్న ధోరణిలో బ్రూనో ఇలా అన్నాడు: "బెర్లిన్‌పతనం కాబోతున్నది. చరిత్ర తయారవుతోంది. ఎప్పుడూ భూమిమీదవుండని కొందరు పుట్టటానికి అవకాశం గనుక యేర్పరిస్తే, భవిష్యత్తు ఎంతగా మారిపోగలదో ఎవరు ఊహించగలరు?"

## 5

రోడ్డుకు యిరుప్రక్కలవున్న అడవులు, పొదలనుంచి అంబా అని ఆవుల అరుపులు విన్పవస్తున్నాయి. వాటి పొదుగులు పాలతో బరువుగా వున్నాయి. అవి తమ యజమానుల కోసరం అడవిఅంతా గాలిస్తున్నాయి. కాని ఎక్కడా ఆ జనం అలికిడి లేదు. జర్మన్‌రైతుల ఇళ్ళన్నీ ఖాళీగావున్నాయి; దొడ్లన్నీ నిరామయంగా వున్నాయి.

సైన్యం పశ్చిమంగా నడుస్తోంది. సోవియట్ సైనికులు బరబరముందుకు వెడుతున్నారు. తలిమ్మాన్నవాళ్ళు, దుప్పట్లు ముసుగుపెట్టుకుని తుపాకులు భుజాలకు తగిలించుకుని నడుస్తు న్నారు. చిన్నచిన్న బళ్ళు బారులుతీరివున్నాయి. వాటిగుర్రాలు రష్యన్‌పద్ధతిలో అలంకరించి వున్నాయి. బండ్లమీద పక్క చుట్టలు, రేడియోలు, పళ్ళాలు, కుట్టుమిషన్లు, శాలువలు

కవ్వుతున్న ఆడవాళ్లు బలవంతపు కష్టానికి జర్మనికి పంపబడి, యిప్పుడు యీ జనం తూర్పుగా తిరిగి వస్తున్నారు. చేతికి దొరికి నంతా చిక్కించుకుని డాన్, నోల్గానదులతీరానికి వేలకొద్దీ మైళ్ళదూరం వస్తున్నారట కొన్నివారాలుగా, నెలలుగా యీ ప్రయాణం చేస్తూనేవున్నారు.

గొడ్లమందలు బరువుకు కుంగిపోయి అలసటగా నడుస్తు న్నాయి. వాటిని నడుపుతున్నవాళ్ళు రష్యన్ రైతులు. మట్ట లాగులు, పొట్టిచొక్కాలు ధరించివున్నారు. తలకు టోపీ లున్నాయి. దుప్పట్లో - మిలటరీగుడ్డలో కప్పుకున్నారు. దారిలో అగుపించిన ఆవులను తమతమ మందల్లో చేర్చు కుంటున్నారు. పశ్చిమంగా వెడుతున్న సిపాయిలు, తమకు ఎదురుగా వస్తున్న వీళ్ళను గేలిచేస్తున్నధోరణిలో అరుస్తున్నారు.

కాలినడకన వచ్చేవాళ్ళు నింపాదిగా ముందుకు పోతు న్నారు. జైల్లో యిచ్చే చారలచొక్కాలు, సైనికుల మాసి పోయిన యూనిఫారమ్‌లు, తమకు బిగుతో, వొదులో అయిన దుస్తులు ధరించారు. సూట్ కేసులు, గుడ్డలమూటలు పడేసి వున్న లాగుడుబళ్ళచుట్టూ నడుస్తున్నారు. ఈ బండ్లమీద అక్కడక్కడ ఫ్రెంచి, హంగేరియన్, ఇటాలియన్ జండాలు తడిసి చివికిపోయి అగుపిస్తున్నాయి. జర్మను గుడారాలు అనుకోకుండా పడిపోవటం చేతను, వాళ్ళ బలం వీగిపోవటం చేతను, వీళ్ళకు యిలా పారిపోవటానికి అవకాశం దొరికింది. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకుని సాధ్యమైనంత దూరం పోవాలని వీళ్ళ సంకల్పం. కాని ఆడవాళ్లు ఎవరూలేరు. రోడ్ల వెంట కాలినడకను రావటం వాళ్లు సాహసించలేకపోయారు.

మాజీ పోలిష్ ఖైదీలు గుంపుగా నడుస్తున్నారు. క్రమ పద్ధతిని నిలుపుతున్నారు. ఇలా వెళ్ళటంలో వాళ్ళకు ఎంతో భద్రత తోచివుండాలి. వాళ్ళలో చాలామంది యుద్ధకాలానికి పూర్వపుమనుష్యులు–మాసిపోయినవి. మాసికలు వేసినవి–ధరించి వున్నారు. వీళ్లు 1939నుంచి బందీలుగా వున్నవాళ్ళు. కేంద్ర సైన్యంలోనివాళ్లు, వార్సా దండయాత్ర విఫలమైన కారణంగా పట్టుబడినవాళ్ళను అందరిలోంచి వేరుగా గుర్తించవచ్చు. ఈ గుర్తు వాళ్ళుధరించే సివిలియన్ ఓవర్‌కోట్లే! మొత్తంమీద అందరూ హుషారుగా ప్రయాణం చేస్తున్నారు. అదుగో, ముందు వాళ్ళదేశం వుంది! అక్కడికివెళ్ళి తమతమ బంధువులను, ప్రాణప్రియులను కలుసుకుంటారు. తిరిగి కాపురాలు చక్కదిద్దుకొంటారు. కాని...ఇదేసమయంలో, సోవియట్ సైన్యం ఎదురుగా వస్తూవుండటంతో–మిలటరీ రాజ్యం పోలి మేరలకు వెడుతున్నట్లు తోస్తోంది. ముందేమి జరుగనున్నదో నని భయం కలుగుతోంది. ఇంటిదగ్గర అరెస్టులనుగురించి వార్తలు విన్నారు. చుట్టూ పోరాటం జరుగుతున్నా ఇంకా పారిపోవటానికి అవకాశంవుంది. కాని పనులన్నీ త్వర త్వరగా జరిగిపోతున్నాయి. జర్మను దండయాత్ర చివరిరోజు లలో పశ్చిమంగా ప్రయాణమై వెళ్ళిన తమ స్నేహితులు సురక్షితంగా అమెరికన్ ప్రాంతాలు చేరుకున్నారో లేదో తెలియదు.

స్టెఫెన్‌సినోస్కీ – 'సీల్' అనేది అందరికీ తెలిసిన పేరు – సీల్ కాలిమీద బొబ్బలు యేర్పడ్డాయి. ఈ బొబ్బలు సాధారణంగా మేజోళ్ళు చిల్లుపడినప్పుడో, పెద్దసైజు చెప్పులు

తొడుక్కున్నప్పుడో యేర్పడి, క్రమక్రమంగా బాధ ఎక్కువై మనిషి యొక్క ఆత్మనిగ్రహానికి పరీక్షగా తయారవు తుంది. సీల్‌కు ఇప్పుడు అన్నిటికంటే ఇదో పెద్దసమస్యగా తయారయింది. కాని ముందుకు వెళ్ళవలసిన అవసరంతో దీన్ని లక్ష్యంచేయలేదు. అందరూ ఎన్నో కబుర్లు చెప్పుకుంటు న్నారు. ఎన్నో భయాలు వ్యక్తపరుస్తున్నారు, ఎన్నో ఆవేద నలు పడుతున్నారు. భార్యలను, తల్లులను గురించి సంభాష ణలు వినవస్తున్నాయి. సీల్ యేమీ ఆశించటంలేదు. చిన్న తనంలో అతను రొట్టెలదుకాణం ముందు నిలబడి రకరకా లుగా పేర్చబడ్డ రొట్టెలను చూచి గుటకలుమింగుతూ వుండే వాడు. వాటిని కొనటానికి తండ్రిని డబ్బు అడుగుదామంటే భయంగా వుండేది. పొరపాటున అడిగినట్లయితే, తండ్రి - తనలాంటి కారుడ్రైవర్ కొడుకు ఎలా ప్రవర్తించాలో చెబుతూ ఉపన్యసించేవాడు. తన తమ్ముడికీ, చెల్లెలికీ డబ్బు నిలువచేయాలనేవాడు. తరువాత సీల్‌స్వయం పోషకత్వం ఆరంభించాక - యుద్ధంరోజుల్లో-భూగృహ విశ్వ విద్యాలయంలో చదువుకుంటూవుండగా, తనకు కావలసిన రొట్టెలన్నీ కొనుక్కోవటానికి డబ్బు దండిగా వుండేది. కాని అన్నీ ఆలస్యంగా సమకూరుతాయి. వాటివిలువ నశించాక ప్రాప్తిస్తాయి. ఇప్పుడు యుద్ధం ముఞుస్తోంది. తనవద్ద యేమీ లేదు. తన తమ్ముడు, చెల్లెలు సజీవులేన్నా? యుద్ధారంభంలో రష్యన్‌ప్రాంతానికి తీసుకుపోబడినట్లయితే ఇప్పుడు ఎక్కడో రష్యాలోనో, ఇంగ్లండులోనో, మధ్యప్రాచ్యంలోనోవుంటారు-

వార్సాఅంటూ ఏమీ మిగలలేదు. కాథరైన్ ఇంక

లేదు. ఇదంతా పెద్దతప్పనీ, ప్రాపంచిక సూత్రాలకు వ్యతిరేక మనీ, అతనికి గొప్పవిశ్వాసంవుంది. ఎలాగైనా కాథరైన్‌ను కలుసుకోవాలని విఫలప్రయత్నాలుచేశాడు. అయినా అతనిలో నమ్మకంవుంది–విధి తననూ వేధిస్తూ బాధిస్తూ వుంటుంది. గాని కాథరైన్‌జోలికిపోదు. ఆమె కులాసాగానే ఉండి ఎదురుచూస్తూ వుంటుంది. ఇలా అనుకుని ఆమెపట్ల తన బెంగయావత్తు మర్చి పోవటానికి ప్రయత్నించాడు. నగరాన్ని దూరంగా చూడటంతో తన విశ్వాసంయింకా దృఢతరం కాజొచ్చింది. పచ్చనిచెట్లు; కేంద్రసైనికోద్యోగులతో చేతులు చేతులుకలిపి షికార్లు చేస్తున్న యువతులు; రేడియో పాటలు, వార్తలు వీధి వీధినా వినిపిస్తున్నాయి. అతని స్మృతిపథంలో జోన్నా, బెర్ట్రిన్లు, గూలా అస్పష్టంగా కనిపిస్తున్నారు. కాథరైన్ తల్లితో వుంటున్న ఇంటిదగ్గరకు చేరుకోగానే అతన్ని ఒకవిధమైన భయం ఆవహించింది. నింపాదిగా ఒక అరుగుమీద కూర్చుని గుండె వేగంగా కొట్టుకోవటాన్ని అదుపులోకి తెద్దామని ప్రయత్నించాడు. గంట మోగించాడు, కాథరైన్ తల్లిముఖం చూడగానే అతనికంతా అర్థమయింది.

పాతనగరానికి పట్టుకున్న దరిద్రమే కొన్నివారాలలో వార్సా కేంద్రానికికూడా చుట్టుకుంది. మానవనిర్మితాలయిన నగరాలు ఎంతోకాలం వుండవు. ఈ భూమికి సంబంధించినది యేదీ శాశ్వతంకాదు. అతను యుద్ధంచేశాడు, తీవ్రంగా పోరాడాడు. విధివైపరీత్యానికి తగినట్టు అతనికి చావు మూడలేదు. తనను యమయాతన పెట్టుకోవటానికి లోగడ బోలెడంత విరామంవుంది. తన పాపానికి పూర్తిరూపంయిచ్చేందుకు –

తనభార్య చనిపోయినరోజు, తను జోనాతో గడిపిన రోజు ఒకటే – అనుకున్నాడు! ఈ ఆలోచన తనకు యిదివరకే వచ్చి వుండాల్సింది. తన వ్యభిచారానికి విధి మంచిశిక్షయిచ్చింది. అతను తారీఖులు సరిచూచుకున్నాడు. కాదు. కాథరైన్ చని పోయినది, తను గాయపడి తిరుగాడుతున్న రోజున, అంటే – జోనాతో కలాపానికి ముందురోజు. కాని...కాని తనకావృద్ధే శ్యం కలగడమే ప్రధానమేమో, విధి తనను శిక్షించేందుకు. కాని – అప్పుడు . ఆపని చేస్తున్నప్పుడు యేమీ తప్పుచేస్తు న్నట్లే అనిపించలేదు. తాను కాథరైన్‌ను మోసగించాడు. ఇంట్లోంచి బయటకు వెళ్ళనిచ్చి జోనాను కూడా మోసగిం చాడు. కాని తను ఆమెను ఆపగలిగేవాడా ? అంత్యదశలో అలా వదిలేసివచ్చి గూలాకు కూడా తను అపచారం చేశాడు. గుడారంలో అందరూ తనకు దూరంగా తిరిగేవాళ్ళు. తను ముభావంగా వుండేవాడు. ఎప్పుడైనా నోరుజారి మాట్లాడినా కర్కశత్వం, బాధ, భయం కనిపించేవి. ఒకసారి పోలండ్‌ను గురించి, అక్కడి దండయాత్రను గురించి మాట్లాడుతూండగా పక్కనున్నవ్యక్తి, తనను చెంపదెబ్బ వేశాడు. అప్పుడు వివా దాంశం మారిపోయి ప్రతిష్టలప్రశక్తి వచ్చింది. ఈ పోట్లాట ముగియటానికి చాలకాలం పట్టింది.

ఆరోడ్డుకొండలు, సరస్సులమధ్యగా నెడుతుంది. సాయంత్రం పూటలు, వాళ్లు – రోడ్డుదాటి, పాడుపడిన యిళ్ళ దాకావెళ్ళి – రాత్రిళ్లుగూడా అక్కడే గడుపుతూవుండేవారు. ఒకోక్కసారి భయపడ్డకుటుంబీకులు కనిపించేవారు. తమ దగ్గర యేమీ మిగల్లేదనీ అంతా వాళ్ళే కొట్టుకుపోయారనీ మొర

పెట్టుకునేవాళ్లు. ఆడపిల్లలు అతి నిర్లక్ష్యంగా వుండేవాళ్ళు. ఎవరేనా కన్నుగీటితే చాలు, వాళ్ళతో పడుకోవటానికి సంసిద్ధమయేవాళ్ళు. ఏమిటో మరి వాళ్ళ కా భూతదయ!

ప్రతిచిన్న పల్లెకూ చివర స్మశానం కంపుకొడుతూ వుండేది.

పాతపోలిష్ సరిహద్దు చేరుకున్నారు. అక్కడి వాళ్ళు రెండు రకాలయిన మనుషులు. వాళ్ళ వాళ్ళ గమ్యస్థానాన్ని బట్టి ముఠాలుగా తయారయ్యారు. మళ్ళీ రైలుబండ్లు నడుస్తున్నట్లున్నాయి. సీల్ చేతికర్రమీద ఆని నిలుచున్నాడు. అతని బరువుకు ఆకర్ర వంగిపోతుంది. కాలిబాధ ఒక్కటే అతని ఆలోచన. అదొక్కటే అతని తపన.

# 6

జూలియన్ హాల్‌పెర్న్ కిటికీకెదురుగా నిలుచుని రోడ్డు వంక చూస్తున్నాడు. లాడ్జిలోని మహాభవనంలో అధికార రీత్యా ప్రవేశం సంపాదించటం ఘనకార్యమే. అందరూ అక్కడి గదులకోసం వెంపర్లాడుతున్నారు లాడ్జి వార్సాకు 150 కిలోమీటర్ల దూరంలోవున్న పట్టణం. చాల సంవత్సరాల తరువాత, జులియన్, హాయిగా తనదని చెప్పకోదగ్గ యింటిలో పందిరమంచంమీద పడుకో గలిగాడు. ఈ భవనం లోగడ జర్మనుల ఆధీనంలోవుంది. వారు హడావడిగా వదలివెళ్ళిన చొక్కాలు, పైజమాలు, యూనిఫారాలు అక్కడక్కడ అగుపిస్తున్నాయి.

కిందపేవ్‌మెంట్‌మీద వోలిన్ అగుపించాడు. అతను సరిగ్గా అనుకున్న సమయానికే వస్తున్నాడు. జులియన్ రేడియో ఆపేసి, వోలిన్‌కోసం తలుపు తెరవటానికి వెళ్ళాడు.

వోలిన్ లోనికి అడుగుపెడుతూనే యీ యింటిని పొగిడాడు. జులియన్ "కాస్త కాఫీ తయారుచేస్తా"నన్నాడు.

"ఆ ! మర్చిపోయాను. నాతోపాటు ఒక వస్తువు తెచ్చాను——" అంటూ అతను తిరిగి హాలులోనికి వెళ్ళాడు.

వోలిన్ తిరిగివచ్చి కుర్చీలో నింపాదిగాచేరి పెద్ద 'ఆల్బం' తెరిచాడు.

"అధికారం మారటం చాలవరకు ఉపయోగకరమే. వస్తువులకు కొత్తపెత్తందార్లు వస్తారు. ఇక్కడ – లాడ్జిలో – నీకు యేం కావాలంటే అది దొరుకుతుంది. ఇప్పుడు బెర్లిన్ నుంచి అన్ని సరుకులు వస్తున్నాయి. జర్మన్లు అన్నిటికీ చక్కటి ప్రతిరూపాలు కల్పించి, అందచందాలుకూర్చి వింతసోయగాలు అందించగలరు.——" అంటూ అతను జులియన్‌కు ఆల్బంలోని ఒక పుటను చూపాడు.

"ఈపాటక స్త్రీ ముఖంవంక చూడు. జీవితం – నిజమైన జీవితం ఎలా ప్రస్ఫుటమవుతోందో !"

జులియన్ కాఫీకప్పులు తెచ్చాడు.

"ఇంకా కొన్ని సంవత్సరాలలో తన ముద్రాపక యంత్రం యూరపులోకల్లా కళాత్మకమైన చిత్రాలు ముద్రిస్తుం దంటున్నాడు బారుగా. అతనప్పుడు కోర్పనాల్ చిత్రాల సంపుటి తయారుచేస్తున్నాడు!

వోలిన్ తన కప్పు పైకెత్తాడు.

"మనకు – యీ పరిస్థితుల్లో బారుగాలాంటి మనుషులే కావాలి !"

"అవును. అతను యెంతో శక్తివంతుడు."

"గెరిల్లా యుద్ధం జరుగుతున్నప్పుడే అటువండివాడి శక్తి బయటపడుతుంది! అలాంటివాడికి తన వ్యక్తిత్వంతో తగాయిద వస్తుంది. అలాంటివాడు ఎప్పుడూ దూరదృష్టితో వ్యవహరించి పార్టీ ముందుముందు ఎలాంటి పరిణామాలు పొందుతుందో ఊహిస్తాడు –"

"ఈరోజుల్లో అంతా కరువుగానేవుంది. అతనిలాంటి వాళ్ళు ఎంతమంది వున్నారు?"

"ఒక మనిషియొక్క ప్రయోజకత్వాని గుర్తించటం అంటే – భవిష్యత్తును మర్చిపోవటం కాదు. ఇప్పుడు మనం కేవలం పాతకాలపు పుంతలే తొక్కుతున్నాం. బారుగాకు అలాంటి శైలివుంది. జమిందారీ పద్ధతి – వేలంవెర్రి!"

"అతని అసలుపేరేమిటి?" అనడిగాడు జులియన్.

"'స్టీన్' కట్టెలవ్యాపారి కొడుకు."

తరువాత నోలిన్ హుషారుగా యిలా అన్నాడు : "వ్యాపారం అందులోనే లక్షలున్నాయి. డబ్బు సంపాదించాలి. హాయిగా బతకాలి. అప్పుడు రోజులన్నీ మారిపోతాయి. పాతజీవితం తారుమారు అవుతుంది. ఇప్పుడు బారుగా యేం చేయబోతున్నాడో నీకు తెలుసా ?"

జులియన్ మాట్లాడలేదు.

"జాతీయకాథాలిక్ పంథాకు చిన్న సవరణ. అతని పద్ధతి మంచిదే. ఆపని ఉపయోగకరమైనదే కూడా! అతనిప్పుడు మైకేల్ కామిన్స్కీని కూడా హాంగుదారుగా సంపాదించాడు. రష్యన్లు అతన్ని జైల్లో వుంచారు !"

జులియన్ యీాలవేశాడు. నోలిన్ యేమిటన్నట్లు చూాచాడు.

"నీ వతన్ని ఎరుగుదువా?"

"పోలిష్ ఫాసిస్టులు వున్నారే - వాళ్లు ప్రత్యేకతరగతి జనం. నేను తత్త్వశాస్త్రాన్ని గురించి మైకేల్‌తో మాట్లాడాను. ఆ రోజుల్లో అతను నన్ను తన విధిప్రకారం దాచిపెడతా నన్నాడు కూడా."

"మనిషిగా అతను ఎటువంటివాడు?"

"ఎంతో మనోధైర్యం వున్నవాడు. యుక్తిపరుడు. బాగా చదువుకున్నాడు. నేషనల్ డెమాాక్రాట్ పార్టీకి చెందిన వాడు. చాల నియమబద్ధంగా ఆలోచిస్తాడు. చరిత్ర పురోగతిని లక్ష్యపెట్టడు. తన ఉద్యమంకోసం పెద్దపెద్ద పారిశ్రామికుల నుంచి డబ్బు తీసుకున్నాడు -"

"ఈ ముఠాగనుక యేర్పడితే - వాళ్లు ఎలాంటి మార్గాలు అవలంబిస్తారో ఆలోచించవచ్చు. యుద్ధానికి ముందు తామే బలవంతులు గనుక ఫ్రెంచి కాథలిక్కులు చీలిపోతా రన్నాడు."

"అభ్యుదయ కాథలిక్కులమని చెప్పుకుతిరుగుతున్న వాళ్ళను, వీళ్లు అంతగా ఆకర్షించలేరనుకుంటాను. కొందరు అప్పుడే "మార్క్సు" సిద్ధాంతాలవైపు మొగ్గుతున్నారు. మరి కొందరు యే దారికీ రావటంలేదు."

"మనమేం చేయగలం? చర్చి బలవంతమైనది. కాని యిది లెక్కలోని విషయంకాదు. ఈ తెలివితేటలన్నిటినీ మనం మేల్కొల్పాల్సివస్తోంది. ఇంతకూ మనకుకొంత వ్యవధికావాలి.

మొత్తంమీద, ఈ మైకేల్ వంటి మనుష్యులతో జూదమాడటం శ్రేయస్కరం."

జులియన్ చేతులు తలకుఆనించుకుని కాళ్ళు జాపుకుని వొళ్ళు విరుచుకుంటూ యిలాఅన్నాడు: "ఇదంతా చాలా కాలం వ్యయంచేస్తుంది. ఇంతకూ యువకులు – వారిమాటే మనకు చర్చనీయాంశం. వాళ్ళలో మంచివాళ్ళు వడివడిగా వచ్చి మన నీడలో నిలుచుంటారు విజ్ఞానపరంగా వాళ్ళంతా నిరాయుధులు. వాళ్ళదగ్గర యేమీలేదు."

"విశ్వవిద్యాలయ పరిస్థితులు ఎలా వున్నాయి?"

"అరాజకం. రానున్న పరిస్థితులకు కొద్దికొద్దిగా ఛాయలు కనిపిస్తున్నాయి. ఏమయినప్పటికి చాల సంవత్సరాల దాక అంతా సద్దుకుపోతున్న మనుషుల ముఖాలు చూస్తూ వుండాలి. దేశంలోని ప్రొఫెసర్లు అందరిలోను ముగ్గురయినా మార్క్సిస్టులు దొరుకుతారా అని నా సందేహం! ఒకవేళ దొరికినా వాళ్ళూ నామాదిరి అతి తాజాసరుకయి వుంటారు!"

"నీవు, ఆ చర్చనీయాంశాల పుస్తకం కొనసాగించాలి!"

"అవును. ఇప్పుడు పనిచేసుకోవటానికి మంచిచోటు కూడా దొరికిందిగా!"

"ఆ సోషలిస్టు వాళ్ళతో యిబ్బంది వస్తుంది. వాళ్ళతో రాజీ అవసరమయ్యేట్లుంది. కాని ఎప్పటికయినా అది అంటు వ్యాధివంటిదే...ఇంతకూ నేను నిన్ను అడిగినదేమిటో గుర్తు వుందా?"

"ఆ! డిటెక్టివ్ కథలు మర్చిపోలేదు కాని – ఎక్కడా కనిపించడం లేదు."

నోలిన్ డిటెక్టివ్ కథలంటే చెవికోసుకుంటాడు. ఈ రోజుల్లో మనశ్శాంతికి దగ్గరదారి వీటికంటే మరేంలేదంటాడు. ఏ భాషలోనయినాసరే కొత్తపుస్తకాలు వస్తాయేమోనని చూస్తూవుంటారు.

"లాబిక్ వ్రాసిన పుస్తకాలు యేమన్నా వస్తాయేమో నని చూస్తున్నాను. అతను బ్రహ్మాండంగా వ్రాస్తాడు. అతని నవలలు సినిమాలుకూడా తీయబోతున్నారు."

జులియన్ తిరిగి అతని కప్పును నింపబోయాడు, కాని నోలిన్ చేతితో అడ్డుపెట్టాడు.

"వొద్దు అంతా తగుపాలాదులో వుండాలి. నీవు పీటర్ క్వింటుకు స్నేహితుడవే ననుకుంటాను! క్వింటో – అదేం పేరు? అతని అసలుపేరుకూడా అదేనా?"

నోలిన్కు యీ సమాచారం ఎందుకా అని ఆశ్చర్య పడుతూ జులియన్ "అవును అదే అతని ఇటాలియన్ నామ ధేయం. పూర్వకాలం ఎప్పుడో వాళ్ళ తాత ముత్తాతలు యిక్కడ స్థిరపడిపోయారు. క్వింటో మంచివాడు. ఎప్పుడూ డబ్బుకు అంతగా బాదరబందీపడడు. బూర్జువా వారసత్వం కంటే, జమీందారీ వ్యవహారమే నయం!"

నోలిన్ కళ్ళుమూసుకున్నాడు. జమిందారీ వ్యవహారం! జనం సాధారణంగా తనను కిందితరగతి ప్రజలోంచి వచ్చా డనుకుంటూ వుంటారు. నిజానికి తన చిన్నతనమంతా, సరస్సు ఒడ్డున వున్న తెల్లని రాజసౌధంలో గడిచింది. తన్ను పెంచి గవర్నెస్ సాయంత్రంపూటలు షికారుకు తీసుకువెళ్ళినప్పుడు కూడా నీళ్ళలో ఆడుకోనిచ్చేదికాదు. తరువాత తరువాత తను

పారిపోవటం ఎలాగో నేర్చుకున్నాడు. బోటు సంపాయించి రోజుల తరబడి కనబడకుండా పోయేవాడు. తన జీవితంలో సత్యదూరమైన భాగం తల్చుకుంటే అతనికి బాధ కలుగుతుంది. నిజమైన జీవితం బయటపల్లెల్లో కుర్రవాళ్ళదగ్గరవుంది. తన అవాస్తవికత, ప్రతిరోజూ ఉదయం గుఱ్ఱపుబగ్గీలో ఆరు కిలో మీటర్ల దూరంలోవున్న బళ్ళోకి వెళుతున్నప్పుడు మరింత ఎక్కువగా కనిపించేది. పదిహేను సంవత్సరాల వయసులో యింటినుంచి పారిపోయాడు. అప్పటినుంచి విసిరేసిన బంతిలా అక్కడక్కడా తిరుగుతున్నాడు. అమితదారిద్ర్యం, శరీరకష్టం, తరగతిభేదాలు, మొదటిఖైదు; నిజానికి అతను ఖైదుకు చాలా రుణపడివున్నాడు. తరువాత ఫ్రాన్స్, స్పెయిన్, తిరిగి ఫ్రాన్స్, రష్యాలు పర్యటించాడు.

"మనతోపాటు సైన్యంలో చేరినవాళ్ళు చాలా అదృష్ట వంతులు. అవలిప్రక్క ఎంతసేపూ నిరాశా నిస్పృహలే కనిపిస్తున్నాయి. వాళ్ళకు పరాజయంతో, ఎక్కడ ఏమిజరుగుతున్నది తెలిసిరావడం లేదు. ఇదంతా కేవలం భౌతికప్రక్రియగా వుంది. పరాజయంపొందిన వాడి ప్రతీకారం గనుక వ్రాయగలిగితే అది చదువుకోవటానికి ఎంతో బాగుంటుంది. యుద్ధానికి ముందు యాక్వింటో యేం వ్రాస్తూవుండేవాడు ?"

జులియన్ ఆలోచించాడు. వోలిన్‌కు బహుశ పీటర్ చరిత్ర తెలుసునేమో !

"పాల్‌వాలేరీ సాహిత్యం పఠించాడు. అది ఎక్కడికి దారితీస్తుందో తెలుసుగా ! మన సారస్వత వలయాలలో అతనొక విచిత్రవ్యక్తి. శూన్యంలో వేలాడుతున్నట్లుంటాడు!"

"అతను వ్రాసే వ్యాసాలు బాగానేవుంటాయి. మార్క్సు దృక్పథంనుంచి పాల్ వాలేరీని విశదీకరించి చెప్పాలంటే చాలకాలం పడుతుంది. వినాశమౌతున్న తరగతికి చెందిన కళాకారుడు, వాస్తవాన్నించి పరుగెత్తుకుపోయి, భాషా ప్రాశస్త్యాన్ని సంపాదించాడంటే గొప్పవిషయమే. ఇదంతా ఎందుకు జరుగుతోంది? వీళ్ళలో చాలమంది యిలా పారిపోయినారు. క్వీంటోకు కూడా కొన్ని అంతర్గత లోపాలున్నాయనుకుంటాను!"

"కావచ్చు. సరిపుచ్చుకోవటమనేది యీ రోజుల్లో అందరికీ తొందరగా చేతకావటంలేదు."

"అవును" అంటూ వోలిన్, జులియన్ ప్రకృతిలో తను పరిశీలించిన అంశాన్ని గురించి ఆలోచించసాగాడు. తన వాంఛితాన్ని నెరవేర్చుకోవటానికి సాధ్యమైనంత సూక్ష్మోపాయం కనిపెట్టాలి. ఆదర్శవాదం రీత్యా అందరి కోరికలూ తీరవలసిందే. అందుకోసమే విప్లవాలు. జులియన్ అభిప్రాయం తనకు ఎప్పుడూ విశ్వవిద్యాలయ పీఠమే అర్థమయినదని.

"అవును. అది స్పష్టంగా తెలుస్తూనేవుంది. ఇక్కడ యీ లాడ్జ్‌లో వున్న ఆడవాళ్ళ విషయమే నాకు విచిత్రంగా వుంది. ఆ అమ్మాయిలు అప్పుడే కొత్తభాషలో కబుర్లు చెప్పేస్తున్నారు. నీ వెప్పుడైనా రెడ్ మేరీని చూచావా?"

వోలిన్ విపరీతంగా నవ్వనారంభించాడు. జులియన్ అతనికి జవాబు చెప్పటానికి మారుగా రాజకీయసభలో ప్రవేశిస్తున్న మేరీని అనుకరిస్తున్నాడు.

# 7

మార్టినిక్ ఒక పాతకారుసీటుమీద కూర్చున్నాడు. జనం నిర్మానుష్యంగావుంది. అప్పుడప్పుడు సోవియట్ లారీలు జోరుగా వెడుతున్నాయి. పరిస్థితులన్నీ దారుణంగా ఆరంభమయినాయి. ఇంజను వార్సానుంచి రావటంలో యాభై కిలోమీటర్లు కోల్పోతే ఇక తరువాత యేం జరుగనున్నదో ఎవరు చెప్పగలరు? మార్టినిక్‌కు కోపం వచ్చింది. తెల్లవారుజామునే బయలుదేరవచ్చుకదా అని రాత్రంతా ప్రగాలో గడిపాడు. నల్లులు వొళ్ళంతా చిల్లులు చేశాయి. ఇంకా కరిచిన గుర్తులు కనిపిస్తూనే వున్నాయి.

సాధారణంగా అతను ముఖ్యమయిన విషయం యేదీ మరిచిపోడు. కాని ఇప్పుడొక అవివేకపు పని జరిగింది. తన పార్టీ కార్డు పెట్టుకున్న కవరు మర్చిపోయాడు. ఈ సంగతి పైకి చెప్పుకోవాలన్నా సిగ్గుగానేవుంది. తనతోటి ప్రయాణీకులు యేమనుకుంటారు? తతిమ్మా కాయితాలన్నీ కూడానే వున్నాయి – పోలిష్ రష్యన్ భాషలలో వ్రాసిన అధికార పత్రాలు దగ్గరే వున్నాయి. అతను దూరంగా కనిపిస్తున్న పచ్చని పొలాలవంక చూస్తున్నాడు. ప్రభాత కాలపు పొగ మంచు రేగుతోంది. వాతావరణం అతి శీతలంగావుంది.

పరిస్థితులు ఎంత త్వరగా మారిపోతున్నాయి! బొరోవ్‌స్కీ జైలులో వున్నాడు. ఈ విషయం తన అరెస్టుకు కొద్ది రోజుల ముందే తెలుసుకున్నాడు. తను, కర్మాగారానికి డెప్యూటీడైరెక్టర్ అయిన మార్టినిక్ పేరుగల తను – యూ

మాటలు స్పష్టంగా విన్నాడు: పేపరుమిల్లును కాపాడగలిగితే, మిమన్ను ఎక్కడికీ తీసుకుపోబడకుండా కాపాడగలిగితే, దాన్ని నడుపుకోగలిగితే – చాల బాగుంటుంది. లేదంటావ్వా! సరే, మనం చేయగలిగిందేమీ లేదు.”

కాని అవకాశంలేకపోలేదు. నిజానికి యీ కమ్యూనిస్టులు అంత చెడ్డవాళ్ళుకారు. కనీసం వాళ్ళతో మనం ఎక్కడున్నామన్న విషయమయినా తెలుస్తుంది! ఏపని చేయాలో ఎలా చేయాలో అంతా స్పష్టంగా చెబుతారు. పార్టీలో చేరమని సలహాయిచ్చినందుకు తను ధియొఫైల్‌కు ఎంతో కృతజ్ఞుడై వుండాలి! ఈ రోజుల్లో దాని ప్రసక్తిలేకుండా మనం యేమీ చేయలేం. నీవు తెలివిగలవాడవయితే తక్షణం పార్టీలో చేరిపోతావు. మొద్దువెధవలు కొందరు సోషలిస్టుపార్టీలో చేరుతున్నారు. ఏమయినా దేశం కమ్యూనిస్టు గొడుగుకిందికి పోతోంది. శ్రామికవర్గానికి యింతకంటే చెడేదేమీ లేదు గద, పోతే – పరిస్థితులు చక్కబరుచుకోవటానికి ఎవరు మాత్రం ప్రయత్నించరు?” అంటూ చెప్పాడు ధియొఫైల్.

మార్టినిక్ సెక్రటరీ వ్రాసిన ఉపన్యాసాలు చదివాడు. యుద్ధానికి ముందునుంచి అతన్ని కలవరపెడుతున్న మూడు ప్రశ్నలకు సమాధానాలు వచ్చాయి. అయితే అప్పుడు అతనికి కమ్యూనిస్టుపార్టీ పట్ల ఆసక్తి ఆకర్షణలేవు. వాళ్లు ఎంతసేపూ నినాదాలు చేస్తారు. కాని యిప్పుడు అంతా వేరుగా కనిపిస్తోంది. మొత్తంమీద ధియొఫైల్ తనకు ఎంతో సహాయం చేశాడు. తను యే విషయమూ దాచకూడదని చెప్పాడు. అతను యింకా యిలా అన్నాడు: “నీవు ముందుగా చెప్పకపోయిన,

తరువాత వాళ్ళే కనుక్కుంటారు. అందుకని నువ్వే చెప్పు: నేనేమీ అంత ముఖ్యమయినవాడినికాదు. కేవలం పత్రిక వాడిని. ఎలా వ్రాయమంటే అలా వ్రాసేవాడిని. ఆ పత్రిక జర్మనులకు వ్యతిరేకధోరణిలో వుండేది. అంచేత అందులో పనిచేశాను. చూడండి, ఎవరూకూడా పవిత్రుడుకాదు. ఏదో ఒక మురాకు పార్టీకి చెందవలసిందేగా! – యిలా చెప్పితే యింక నీ తప్పిదమేమీ వుండదు." మార్టినిక్ యీసలహా మేరకుపని చేశాడు. అందువల్ల అతనికేమీ హాని జరగలేదు. కాని తన గతాన్నివారు తెలుసుకోవటం ఖేదకారణం అయింది. బహుశ ఒకరోజు వాళ్ళు దాన్ని తవ్వి పైకితీయవచ్చు. ఏ సంగతీ ముందుగా తెలియదుగద! భయపడుతూ జీవించటంలో అర్థంలేదు. ఆనందంలేదు.

రెపోక్ కారుతలుపుమీదుగా తొంగిచూచాడు.

"ఏమిటి వార్తలు?"

కార్వోస్కి పైకి చూచాడు. టోపీపైకి లాక్కుని రుమాలుతో నదురు తుడుచుకున్నాడు.

"ఇది పాతడొక్కు. ఇటువంటికారుతో ఇంతకంటే వేరే మార్గంలేదు. అయినా శక్తివంచనలేకుండా పనిచేస్తున్నాను."

రెపోక్ కిందికిదిగి వొళ్లువిరుచుకున్నాడు అతని ముఖం నిద్రలేకపోవటంవల్ల ఉబ్బినట్లుగా ఉంది. రెపోక్ కమ్యూనిస్టు పార్టీసభ్యుడు. అతను, మార్టినిక్ తరుచు కలుసుకుని పార్టీవిషయాలు చర్చిస్తూవుండేవాళ్లు. అతనికి రేజర్ బ్లేడ్ కర్మాగారంలో ఉద్యోగం.

"ఇంజనీర్ ఎక్కడ?" అనడిగాడు రెపోక్.

"ఏదో కొన్నుక్కు రావటానికి ఊళ్ళోకి వెళ్ళాడు. అత ననటం, మనం ఇక్కడే భోజనసదుపాయం చూచుకోవాలని. మనం వెళ్ళేచోట ఏమీ దొరకవట!"

"దొరకనీ దొరక్కపోనీ – దాన్ని గురించి విచారించ టానికి చాల విరామం వుందిలే. ముందు నాకు ఆకలిగా వుంది!" అంటూ అతను వార్తాపత్రికలో పొట్లంకట్టిన రొట్టెను మూడు ముక్కలుగా కోసి చెరొకటి ఇచ్చాడు ముగ్గురూ తిన్నారు.

కరోవ్ స్కి పెదిమలు చప్పరించుకున్నాడు.

"భలే బాగుంది!"

"నా భార్యే స్వయంగా తయారుచేసింది!" అన్నాడు రెపోక్.

కరోవ్ స్కి ఇంకా రొట్టె నములుతూనే "సోవియట్ సైనికులు అంటారూ – ఎప్పుడైతే తెల్లరొట్టె తినటం ఆరంభిం చామో అప్పుడే పోలెండ్ చేరుకున్నాము అని!"

ఒక మిలటరీ లారీ అమిత వేగంగా పోయింది. రెపోక్ ఉమ్మేశాడు.

"ఈ తొత్తులకు యేమీలేదు. తిండి లేకపోయినాసరే యంత్రాలుమటుకు కావాలి. మనవే కావాలట!"

మార్టినిక్ ఆలోచనలో మునిగిపోయాడు.

"మనం ఇక్కడే కూర్చోటం సాగిస్తే ఇక ఎప్పటికీ అక్కడికి చేరలేం! ఫాక్టరీ పూర్తవుతుంది సరే, అది మాస్కో లోనే వుంటుంది!"

కరోవ్ స్కి నవ్వాడు.

"లేదు, లేదు! ఎట్లాగో తయారుచేశాం: ఈరోజుల్లో కారంటే జంక్. ఈ ఫోర్డ్ చూడు ఎలావుందో!"

"ఇంతకూ యీ రిపేరు మనవల్ల అవుతుందా?"

– మార్టినిక్ అందరికీ సిగరెట్లు అందించాడు.

తరువాత వాళ్లు ప్రస్తుత పరిస్థితిని గురించి కొంచెం తీవ్రంగా చర్చించుకున్నారు.

"నేనొకటే చెబుతున్నాను, రెపోక్. మనం జర్మన్లను చంపిపుట్టాం. ముందుకు పోవటానికి శక్తి వంచన లేకుండా ప్రయత్నించాలి. ఆలోచిస్తూ కూర్చుంటే లాభంలేదు. కావల్సింది పని. అందరూ ఎలాగో యాత్ర సాగిస్తూనే వున్నారుగా."

సూర్యుడు పేలవంగా ప్రకాశిస్తున్నాడు.

"నిజం, నిజం. ప్రతివాడూ డబ్బు సంపాదించుకోవటానికి తాపత్రయ పడుతున్నాడు. నామటుకు నేను కుక్కలాంటి జీవనం గడిపాను. యుద్ధం సాగుతున్నంతకాలం వ్యాపారం చేశాను. ఇప్పుడు నా భార్య వ్యాపారమే నిలువ. మనిషన్నవాడు మనిషిలాగే బ్రతకాలి. ఇంతవరకూ నేను బడుద్దాయిలా బతికాను. ఈవిషయం ఇప్పుడిప్పుడే గ్రహిస్తున్నాను"

ఇప్పుడు బయలుదేరేవాళ్లు త్వరగా ముందుకు వెళ్ళిపోతారు. ఇప్పుడు అందరికీ బోలెడన్ని అవకాశాలు" అన్నాడు మార్టినిక్.

"అవును. నేను ఆలోచిస్తున్నదికూడా అదే. అక్కడ మనమేదో భవనం ఆక్రమించుకోవచ్చు. ఏమంటావు? అక్కడ జర్మనులు విడిచివెళ్ళిన భోగభాగ్యాలు ఎన్నోవుంటాయి. కాని

కొన్నాళ్ళవరకు పరిస్థితులు ప్రశాంతంగా వుండవు. భార్యను కుటుంబాన్నీ నాశనంచేసుకోవలసి వస్తుంది!”

మార్టినిక్ తనుకూడా వివాహం చేసుకుందా మనుకున్నాడు. యుద్ధానికిముందే తను భార్యను కోల్పోయినట్లైతే, అలా భూగృహ కందకాలలో తలదాచుకునేవాడేనా? ఇప్పటికైనా తనో ఇంటివాడు కావాలి.

ఇంజను కదిలింది. కరోప్సిక్ సగర్వంగా అరిచాడు: “నీ స్వాంతయంత్రాన్ని బాగుచేసుకోవటం చూడు ఎంత మజాగా వుంటుందో! అది వెంటనే మనస్సుమార్చుకుంటుంది! ఇప్పుడు ఇంజనీరుకోసం కాచుకోవలసివస్తే ఆ తప్పుమటుకు నాదికాదు!”

“అదుగో అతనూవస్తున్నాడు!” అన్నాడు మార్టినిక్. వందగజాలదూరంలో నోల్స్కీ వస్తూ కనిపిస్తున్నాడు. అతని వీపున ఒకపెద్ద మూటవుంది.

“యుద్ధానికిముందు, అతను డైరెక్టర్ అయివుండేవాడు కాదు. బొత్తిగా చిన్నవాడు!” అన్నాడు రెపోక్.

“అతను కుశాగ్రబుద్ధి అంటారు. అలాంటివాళ్లుఎందరో లేరు. అలాంటివాళ్ళు పార్టీలో చేరనవసరంలేదు!”

“తెలివితేటలేకాకుండా, వాళ్ళకు చదువుకొందుకు తన ధనసంపత్తి వుంది. నేను నా కుర్రవాళ్ళను బడికి పంపదలుచుకున్నాను, యేమయినాసరే! వ్యాపారంలేకపోతే మనమేలేము!”

“అయితేనేం మనకు అడ్డురాడు, తన బాయిలర్ గదిలోకి వెళ్ళిపోతాడు. తతిమ్మాదంతా మనబాధ్యత. మనం ఒకమాటమీద నిలబడితే విజయం మనదే!”

రెపోస్కి టోపీ కిందికిలాగి నిలబడ్డాడు.

"నాకు వేపవర్ను గురించి యేమీ తెలియదు. సరే చూదాం" అన్నాడు. కరోప్విస్కి చక్రందగ్గర కూర్చున్నాడు. ఒక్కసారి హారన్ మోగించి వోల్స్కి వంకచూస్తూ అరిచాడు: "మనకారు బాగుపడింది! ఇక పోదాం పద!"

# 8

ఫ్రాన్స్‌లో పోలిష్ వర్కర్ల సమస్యలను గురించిన సంభాషణలు వింటూ పీటర్ "త్వరలో నాకు కూడా అవకాశం వస్తుంది" అనుకున్నాడు. బారుగా చొక్కాగుండీలు విప్పుకుని ఎడంచేత్తో రాసుకుంటున్నాడు. ఎందుచేతనోగాని పీటర్‌కు తాను చదువుకున్న బళ్లో బల్లలు, వాటి మీద తను గీసిన పిచ్చిబొమ్మలు గుర్తుకువచ్చాయి. చాల సంవత్సరాల వరకు తను బడిలో మొద్దబ్బాయిలా వుండేవాడు, ప్రవర్తనకు తనకు చాల తక్కువ మార్కులు వస్తుండేవి. అతను పరీక్ష తప్పటానికి కూడా కారణం ఒకటే. తన ఆలోచనలన్నీ బయటకు చెప్పివేయాలనుకునేవాడు. తనకు యేమీ అనుభవంలేని విషయాలను గురించి తనకింకా పూర్తి రూపంలో కలుగని ఆలోచనను గురించి ఊరికే వ్యాసాలు వ్రాసుకు పోతూవుండేవాడు. ఈ విషయమై ఎన్నో ఇబ్బందులు వచ్చేవి. తనకంటే బడుద్ధాయి లయిన సూళ్లు కుర్రాళ్ళు తనకంటే ముందుగానే యుక్తిని నేర్చుకునేవాళ్ళు. ఫలితంగా తను పరిసరాలకు ఎదురుతిరిగాడు. కేవలం అరాచకవాదిలా ప్రవర్తిం

చూడు. టీచర్లయినా అసాధ్యంగాని స్నేహశీలతకోసం పాకు లాడలేదు. వాళ్ళ ప్రయత్నమల్లా సాంఘిక వ్యవస్థకు అనుకూలంగా యువకులను సరిదిద్దటమే!

తన ఉపాధ్యాయుడిని సంతృప్తి పరచటంకోసం పీటర్ రెండుపుటల సారస్వతవ్యాసం వ్రాసేసరికి పరిస్థితులు మారి పోయినాయి. అప్పుడు తనకు కలిగిన ఆశ్చర్యాన్ని అతను ఎప్పటికీ మరచిపోలేడు. అతని కలం కాగితంమీద మృదువుగా వెళ్ళిపోయింది. సత్యదూరం కాని న్యాయమార్గాన్ని అన్వేషిస్తున్నాడు తను. అన్నిటికంటే ముఖ్యం ఏమిటంటే అతను ఆత్మనిగ్రహంకోసం ప్రయత్నించాడు. అంతకంటే తెలివిగల పని అతనికి తోచలేదు. అభిప్రాయాలు దొరక్క యమయాతన పడ్డాడు. "విషయం పరిపూర్ణ మయినదికాదు; శైలి మరీ సంకుచితం;" యిటువంటి వ్యాఖ్యానాలు కూడా సంపాదించాడు. కాని తరువాత తరువాత అభిప్రాయాలు వాటంతట అవే అతనిబుర్రలో ప్రవేశించాయి. వాటిని అతను అతి చులాగ్గా పట్టేసుకున్నాడు. వాటిని ప్రయోగించి స్కూల్లో ఎన్నదగిన విద్యార్థిగా తయారయ్యాడు. ఈ రహస్యమంతా సాంఘిక పరిస్థితులకు అదుముకుపోవటంలో వుంది. ఇంతకూ తను బందీనించి విడిపించుకున్నప్పటి నుంచి యేమి చేస్తున్నట్లు? పూర్వపు బడి అలవాట్లలో పడిపోతున్నాడు. ఈ విషయం అతను యిప్పుడిప్పుడే గుర్తిస్తున్నాడు. బారుగాతో మాట్లాడుతూ వుండగానే యిది స్ఫురించింది. ఈ కొత్తపద్ధతి పాఠశాల మాదిరే వుంది. లక్షలకొద్దీ జనం దాని యంత్రమర్మాన్ని తెలుసుకున్నారు.

బొరుగాతో మాట్లాడుతున్నంతసేపూ అతను ఎంతో జాగ్రత్తపడ్డాడు. తన ఆత్మనిగ్రహాన్ని కోల్పోకుండా ఎంతో ప్రయత్నించాడు. తన పథానికి యేవిధమైన అంతరాయం కలగకుండా చూచుకున్నాడు.

"నాకు ఫ్రాన్సు అంటే అభిరుచి. యుద్ధానంతరం అది ఎలావుందో ఊహించలేకుండా వున్నాను. నేనుకూడా అదే మనిషిని కాదుగా! ఇదివరకు ఎన్నడూ ఎరుగని వింతలు అక్కడ కనిపిస్తాయేమో! అక్కడ మనం క్రమపద్ధతి యేర్పరిచాక, బహుశ మీరు నన్ను గుర్తించుకుంటారని ఆశిస్తాను— అక్కడ నేను దేనికైనా పనికిరావచ్చు. ఆరునెలలపాటు ఫ్రాన్స్‌లో గడపాలనివుంది. అదే నా కోరిక" అన్నాడు.

బొరుగా ఆలోచించాడు. మరొకటి. నిజం యేమిటంటే తనదగ్గరకు చాలమంది వచ్చిపోతున్నారు. తను చదరంగంబల్ల మీది పావుల్లా మనుషులను మార్చివేయగలడు. ఒక్క యూరపులోనే కాదు, ఆసియా, ఆఫ్రికా, అమెరికాలోకూడా తనకు ఆబలం చేకూరుతోంది. సరే, కుర్రవాళ్ళు అందరికీమల్లేనే ఇతనుకూడా ఎక్కువ మోతాదులో పశ్చిమనాగరికత నేర్చుకున్నాడు. అతను పారిపోదా మనుకుంటున్నాడా లేదా అనేది వేరేవిషయం.

"మీరు ఫ్రెంచిభాష ధారాళంగానే మాట్లాడుతారే!"

"ఒకరకంగా ఇటువంటి ఉద్యోగంచూసుకోవటం కేవలం ఉపశమనంకోసమే. కాని యీవేషం మార్చివేయాలని యీ జీవితవిధానాన్ని మార్చాలని నాకు తాపత్రయంగా వుంది.

కాని సరయిన అవకాశం వచ్చేవరకు మనం దీన్ని అలాఆలోచన లోనే వుంచాలి!"

బారుగా ఎటువంటి మనిషి మనస్సునయినా అర్థంచేసు కుని అందుకు తగినట్లుగా ప్రవర్తిస్తాడు. క్వింటో విషయం యేమిటి? నిస్సందేహంగా అతడు ఉద్యోగం వాంఛిస్తున్నాడు. అతనిలో వైభవం అని చెప్పుకోదగిన లక్షణాలున్నాయి వ్యవ హారజ్ఞత, ఉదారత వున్నాయి. తన గొలుసులు తప్పించుకుని, ఎవరైనా యీవాంఛ నెరవేరే అవకాశం చూచుకుంటే? మంచి గొలుసులు లేనేలేవు. కేవలం ఎడారిలోకి పారిపోవటం, యీ గందరగోళంమధ్య సూక్ష్మంగానే వుంటుంది. కాని, క్వింటో ఆపనిచేయడు.

అతను ఇలా అన్నాడు:

"క్వింటో, నీవు నీ ఊపిరితిత్తులకు కొత్తగాలిని అంద చేయాలనుకుంటాను. నీవు ప్రపంచాన్ని సందర్శించాల్సి. నీకు పత్రికారచయితకు వుండవలసిన లక్షణాలు తెలివితేటలు వున్నాయి. వాటిని వృధా చేయగూడదు. నిన్ను మా విదేశ విలేఖరిగా నియమిస్తే బాగుంటుం దనుకుంటున్నాను. దాన్ని గురించి ఇంకా ఆలోచించి చెబుతాను."

అన్నింటితో సంబంధం తెంచుకోవటం, అనిర్వచనీయ మైన స్వాతంత్ర్యాన్ని పొందటం, పీటర్ హృదయాన్ని కదిలిం చాయి. పాఠశాల జీవితాన్ని గురించి కలలు. దాన్ని అతను వెంటనే అణుచుకో గలిగాడు. ఈ దృశ్యం కొనసాగించటం అంటే-బారుగాతో అబద్ధంచెప్పి తన ముసుగు తొలగించు కోవటమన్నమాట. బారుగా ముందు తను రెండుముఖాలు కల

వాడయితే, తనపట్ల గూడ తను ద్వంద్వవ్యక్తేకదా! అప్పు డప్పుడు పారిపోవాలని సంకల్పం కలిగినా దానితో ఊరికే ఆడుకునేవాడు; అది నిజమని నమ్మేవాడు కాదు. ఈ విశాల ప్రపంచంలో తనకు ఇంకేముంది? గతానికి మరలిపోవటమా? అసాధ్యం, అసంగతం. కాని మరోవిధంగా పరిణమించింది. అడుగులేని సుడిగుండంలో చిక్కుకున్నట్లుంది. ప్రతి ఆలోచన, ప్రతి నిశ్చయం, ప్రతి సన్నివేశం–పరాజయం పొందుతున్నాయి. ఆ భయంకర పోరాటంమూదిరే కుంగిపోతున్నాయి. తన మోసమంతా నమ్మకంకోసమే. తను బారుగాతో నటన ఏమీ చేయటంలేదు.

తన మనసులో మోసంచేసే తెలివితేటలు ఏమయినా వుంటే అవి ఆలోచనలకంటే లోతైన ఆధారాలుగా వచ్చినవే! గొప్ప కార్యనిర్వహణ చూస్తూ నేర్చుకొన్నవే. నిదానంగా పనిచేస్తూ వుండటం, సావకాశంగా పరిశీలిస్తూవుండటం! అతను చాల నీరసంగా వున్నాడు. దూకలేడు.

బారుగా అతనికి ఎదురుగా కూర్చున్నాడు. అతను మాట్లాడే ప్రతిమాటా యుక్తియుక్తంగా వుంది. ఒంటరిగా వున్నప్పుడుకూడా అతను తన యుక్తులనుగురించే ఆలోచించు కుంటాడేమో!

"శైలి యొక్క అంతరార్థాలు యేమిటంటే–చరిత్రను అర్థంచేసుకోవటం!" అన్నాడు బారుగా.

"అది నీ మీదే ఆధారపడి వుంటుంది."

బారుగాకు ఇటువంటి ఒంటరితనాలు ఇష్టంవుండవు: అతని ఆలోచనలు సుడులు తిరుగుతున్నాయి. ఏవ్యక్తి అయినా

తనచర్యల ద్వారానే గొప్పవాడు కాగలడు. తన మనుషులకు నేర్పగా ఉపయోగించుకోగలగటం ఒక కళ. కాని యిదికూడ ఎంతోకాలం వుండదు. ఒకరోజు, ఎప్పుడు వందసంవత్సరాల అనంతరం, అంతా తవ్వి చూచుకున్నాక ? అప్పుడేమవుతుంది? – అతను లేచి నిల్చున్నాడు.

"అవునవును. నీవు పని కొనసాగించాలి. వార్సా పునర్నిర్మాణపుటాలోచనలను గురించి వ్రాయి. ఈ విషయమై అందరూ ఉత్సాహం చూపుతున్నారు. వార్సాను పునర్నిర్మిస్తే ముక్కలయిన దేశం తిరిగి ఒకటవుతుంది!"

## 9

పల్లెటూళ్ళు అతివృష్టితో కొట్టుమిట్టు అవుతున్నాయి. క్షణక్షణం యేనో గాలివార్తలు, భయంకలిగించే విషయాలు, పుకార్లు, పరస్పర విరుద్ధమయిన వార్తలు వినవస్తున్నాయి. రోజు రోజుకు బ్యాంకు నోట్ల చెలామణీ ఎక్కువ అవుతూంటేసరికి ప్రజలకు కాయితాలమీద విశ్వాసం తగ్గిపోతోంది. వాళ్లు ఇంకా బంగారు నాణేలకు, డాలర్లకు అంటిపెట్టుకుని వుండి, మార్పుకోసరం ఎదురుచూస్తున్నారు. అంతా అనిశ్చయంగావుంది. త్వరలోనే మరో యుద్ధం ముంచుకువస్తోంది కనుక, తొందరపడవలసిందేమీ లేదంటున్నారు కొందరు. కొందరు మరో ప్రభుత్వం పాలనకు వస్తుందంటున్నారు. ఈ అనటానికీ అనుకోవటానికీ ఎవరూ ఆధారాలు మటుకు చూపలేకపోతున్నారు. మొత్తంమీద పరిస్థితులు ఇదేమాదిరిగా కొనసాగవని మటుకు అంతా తలపోస్తున్నారు. ఈ ప్రపం

చంలో బలీయులు ఎవరో భయపడేవాళ్లు ఎవరో అంచనాకు అందటంలేదు. పశ్చిమంగా వెళుతున్న సైనికాధికారులు ఫ్రాన్సు వెళుతున్నామని విజయం తమదేనని "యూరప్ మాదే" అని నినాదాలుచేస్తూ చెబుతున్నారు. రష్యన్లు దేశంలో ప్రవేశించి నప్పుడు యీ మనుషులంతా వార్సా దగ్గర దాక్కున్నారు. ఒక రష్యన్ అధికారిభద్రత చెప్పాడు. తనుచెప్పిన ఫలానా చోటుకు వచ్చితననుకలుసుకుంటే వారికేం ప్రమాదంవుండదని చెప్పాడు. తీరా వాళ్లు ఆచోటుకు వచ్చేసరికి అరెస్టుచేసి రష్యాకు దిగుమతి చేశాడు. జమిందారులు ఆస్తిపాస్తులన్నీ హడావిడిగా రైతులకు పంచివేయబడుతున్నాయి. ఈ పంపకానికి ఒకధర్మం కాని సూత్రం కాని లేదు. దీనికి కారణం, కొత్త ప్రభుత్వం భయపడుతూ వుండటమే నన్నారు కొందరు. మరికొందరు మటుకు యీ భూమిపంపకం యేదో తమాషా వ్యవహారంగా వున్నదనీ, యీ భూములన్నీ తిరిగి లాక్కొని సమిష్టివ్యవసాయ క్షేత్రాలు నెలకొల్పుతారనీ అంటున్నారు.

గుఱ్ఱాలు, ఆవులు – పందులు, జంతుజాలం అంతా తక్కువగానే వుంది. దారినిపోయే సైనికులు ఎదురువచ్చిన గొడ్డునల్లా నరికివేయటమే యిందుకు కారణం. వింతరోగాలు— ఎన్నడూ ఎరుగనివి – వ్యాపిస్తున్నాయి. యువకులు ఆడవాళ్ళ చెంతకు వెళ్ళటానికే భయపడుతున్నారు. ఆసియా దేశపు సిఫిలిస్ యిక్కడ కూడా అంకురిస్తోన్నదని డాక్టరు ఉండర్లీ భయపెడుతున్నాడు. జర్మనీకి పంపబడిన కొంతమంది తిరిగి వస్తున్నారు. వాళ్ళు పశ్చిమాన బంజర్లుగా పడివున్న భూములను గురించి చెబుతున్నారు. ఇక్కడి బీదరైతులు అక్కడికిపోయి

సుఖపడదామని ఆశపడుతున్నారు. అన్నిటికంటే ముఖ్యమయిన విషయం యేమంటే, ఎవరూ తమ ఆలోచనలను ,అంచనాలను తేలికగా బయలుపరచరు. జర్మనుల దండయాత్ర కాలంలో నేర్చుకున్న గుణపాఠం ప్రకారం బ్రతకదల్చుకున్నవాడు నోరు మూసుకుని వుండాలి. అందరికీ గోప్యంగా వుండటం అలవాటయింది. కాని ప్రస్తుతజీవితం ప్రమాదకరంగా వుంది. యువకులందరూ తమ ఆయుధాలు దాచివేసి యేమీ ఎరుగని వాళ్ళలాగ మిన్నకుండినప్పటికీ, పరాయివాళ్ళకు విషయాలు జేరవేస్తున్నారనే మిషమీద అరెస్టుచేయబడ్డారు. అక్కడక్కడ పోలీస్ రహస్యసైనికులు ప్రత్యక్షమవుతున్నారు, సోదా చేస్తున్నారు. కొందర్ని కాల్చివేస్తున్నారు. ముసలిస్త్రీలు ఆశ్చర్యంతో సాగిలబడుతున్నారు.

కోర్డ దళం నగరంనుంచి దూరంగావెడుతోంది. అందులో ముప్పైమంది వున్నారు. దాని దళనాయకుడు 1939 దండయాత్రలో గాయపడ్డాడు. పట్టుబడి తప్పించుకున్నాడు, కొన్ని సంవత్సరాలు అడవులలో తిరిగాడు. జర్మనులతో విపరీతంగా పోరాడాడు. రష్యనులు ప్రవేశించినప్పుడు పైవాళ్ళ ఆజ్ఞానుసారం వాళ్ళకతను మొక్కి దాసోహం చేయలేదు. ఇదే తెలివిగల పనిగా పరిణమించింది. రష్యనులకు లొంగినవాళ్లు ముందు మర్యాదగానే స్వీకరించబడినా యుద్ధసమయంలో బందీలు చేయబడి తూర్పుకు పంపబడ్డారు. కోర్డుదళం యీప్రమాదం నుంచి తప్పించుకుందికాని వాళ్ళస్థితి మరింత దుస్సహంగా తయారయింది. లండనునుంచి యేమయిన వర్తమానం వస్తుందని యెదురుతెన్నులు చూస్తున్నారుకాని యేమీ రావటం

లేదు. యువసైనికులలో చాలమంది అప్పుడే కొత్తజీవితం ఆరంభించారు. కాని రహస్యపోలీసులు వెతుకుతున్న నూతన పురుషులుమటుకు యింకా 'యూనిట్' లోనే జేరుతున్నారు.

కోర్డ్ ఒకపర్యాయం నగరంలోనికి వెళ్ళాడు. రహస్యమయిన వ్యవహారాలలో వ్యాపకంవున్న ఒకానొక సంస్థతో పరిచయం చేసుకున్నాడు.

ఇప్పటివరకు, కొత్త అధికారులు తమ శక్తి శ్రద్ధలన్నిటినీ నగరాలమీాదనే కేంద్రీకరించారు. పల్లెప్రాంతాలవైపు అప్పుడప్పుడూ దండయాత్రలు జరిపినా అవి సఫలీకృతం కాక పోగా సరికొత్తసమస్యలు తెస్తున్నాయి. కోర్డ్ రైతులనుంచి ఎలాంటి సహాయాన్నయినా తెచ్చుకోగలడు. వాళ్ళు అతనికి ముందే హెచ్చరికలు యిస్తారు, ఎక్కడ ప్రమాదం వుందో చెబుతారు, చాలమంది అతని కార్యకలాపాలలో జేరుతారు కూడ. తరువాత ఆయుధాలు చెట్టుకొమ్మల్లో దాచి తమతమ పైనందిన కార్యాలలో నిమగ్నులవుతారు.

అయితే ఇందులో యేం భవిష్యత్తువుంది? కోర్డ్ కాని మరెవరుకాని యీప్రశ్నకు సమాధానం సంపాదించలేక పోతు న్నారు. జైలులో వుండేకన్నా యిలా జీవించటమే నయం. కొత్తయుద్ధం గురించి వచ్చేవార్తల్లో కొద్దిగానైనా నిజం వుంటుందేమోనని ఆశించారు. లౌకికప్రసక్తులు సంభాషణలు కొనసాగుతున్నాయి. కొత్త సంయుక్త ప్రభుత్వంలో కొందరు లండన్ రాజకీయవేత్తలుకూడా వున్నారు. బోల్షివిక్కులతో మాట్లాడే ప్రతి రాజకీయవేత్తకూడా రాక్షసుడే అనుకున్నాడు కోర్డ్. వార్సా తిరుగుబాటును అణచటానికి రష్యా విఫల

యత్నం, కేంద్రసైన్యంలో కొందరు అరెస్టుఅవడం, రహస్య ప్రభుత్వంలోని పదహారువ్యక్తులకోసం పన్నిన వల, ఇవన్నీ కూడా ఒకేవిషయాన్ని తెలుపుతాయి. విదేశీశక్తులు పాలనచేస్తూ వుండటం నిజం! భూమిమీద ఎవడుకానీ వాళ్ళ ఆజ్ఞ ప్రకారం వర్తించాల్సిందే. దేశద్రోహులకు శిక్ష విధించాలి. పూర్వం జర్మనులతో కలిసి తిరిగినట్లు - ఇప్పుడు కొత్తపరిపాలన వ్యక్తులతో కలిసితిరగటంవల్ల ఫలితం మరణమేనని ప్రజలు గుర్తించేటట్లు చేయాలి. ఇదొక్కటే మార్గం మిగిలివుంది.

కోర్డ్ముతాలో అత్యంత నమ్మకస్తుడైన సిపాయి "గూలా" అతను వార్సాలో మృత్యువును ఎలా తప్పించుకున్నాడో అతనికే తెలియదు. కిటికీలోంచి చిన్నబాంబు దూసుకువస్తున్న భయంకరక్షణం మటుకే అతనికి గుర్తువుంది. కళ్ళుతెరిచి చూచేసరికి తనకు పరిచర్యచేస్తున్న నర్సులుమటుకే కనిపించారు. వాళ్లు చెప్పిన విషయాలను బట్టి జరిగినదాన్ని గుర్తుతెచ్చుకోసాగాడు. అతన్నొక జర్మన్ డాక్టర్ ఆస్పత్రికి తీసుకువచ్చాడు. "ఈ దండయాత్రలో సజీవంగా మిగిలిన తిరుగుబోతు యితనొక్కడే" అన్నాడట.

ఇతనికి తెలివితాగానే పై అధికారులకు తెలియపర్చమన్నాడట. నర్సులు ఇలా అన్నారు: "అతనొక విచిత్రమైన జర్మన్! అతను ఫ్రెంచిభాషలో మాట్లాడుతాడు. అతని మాటలు వింటే జర్మన్ అనే అనుకోం-అతను మాకు ఏయే మందులు కావాలో కనుక్కొని మరునాడే తెచ్చిపడేశాడు." నెలరోజులతర్వాత గూలా తనగ్రామానికి వెళ్ళగలిగాడు. అక్కడ తనతండ్రి ప్రభుత్వోద్యోగి. అది అద్భుతమైన యుగం

అనిపించింది. అతనికక్కడ ఉన్నన్నాళ్ళూ ఎంతో హాయిగా ప్రశాంతంగా వుంది. స్థానికవీరుడుగా చెప్పుకుంటున్నారు. ఈ కీర్తికూడా అదృష్టాన్ని తెచ్చేదికాదు. రష్యనులు వచ్చిన రెండువారాలకు – ఫిబ్రవరి మొదట్లో–తనయిల్లు ముట్టడించబడింది. గూలా తను సైబీరియాకు వెళ్ళి దారిలో వున్నాననే అనుకున్నాడు. అయితే, తోటలగుండా పరుగెత్తి తప్పించుకోగలిగాడు. అక్కడినించీ అంతా అడవే. కోర్డు అతన్ని ఆప్యాయంగా స్వీకరించాడు. కొత్తజీవితానికి అలవడటం ముందు కష్టంగానేవుంది. వాళ్లు వడివడిగాపరుగెడుతున్నారు. గ్రామాలు భద్రంగాదనుకున్నప్పుడు రాత్రిపూటలు పొలిమేరలకు ఆవలే తుమ్మముళ్ళమీదే గడుపుతున్నారు. త్వరలోనే పరిస్థితులు మెరుగు కాసాగాయి. అతని కలుపుగోలుతనంవల్ల, హాస్యంవల్ల తతిమ్మావాళ్ళతో కులాసాగా వుండగలుగుతున్నాడు. కోర్డు యితనంటే ఎంతో యిష్టపడేవాడు. గూలాకుకూడా నాయకుడంటే యిష్టమే.

అడవులు కంచెలతోను నక్కబొరియలతోను నిండి వున్నాయి. 1944లో కొత్తకోటలు కట్టారు. 1939 దండయాత్ర తరువాతమాదిరే, ఎంతో సరంజామా మిగిలిపడివుంది. పొదలలో అప్పుడప్పుడూ జర్మనుసిపాయిల శవాలు కనిపిస్తున్నాయి. రాత్రిపూటలు అక్కడక్కడ పెదిమలు చప్పరించిన చప్పుడు వినిపిస్తుంది. కోర్డు తన మనుష్యులను ఆ ప్రాంతాలకు వెళ్ళవద్దన్నాడు. గూలాను మరి కొందరినీ తీసుకువెళ్ళి తెల్లవారుజామువరకు అక్కడే కాపలావుండి చివరకొకమనిషిని పట్టుకోగలిగారు. ఆ మనిషి అతి పల్చగావున్నాడు. జర్మను

వాడు. భయంతో నిలువెల్లా కంపించిపోతున్నాడు. అతన్నేం చేయాలి? కోర్డు అతన్ని ఎన్నో ప్రశ్నలు వేశాడు. తీరా అతను అనుకున్న మనిషి కాకుండా వెర్మాహ్ ట్ సైనికుడు అయ్యాడు. అతను పొలాలలో తప్పుకుని సంపాయించిన బంగాళదుంపలు తిని జీవిస్తున్నాడట. వాళ్ళు ఎవరో తెలుసుకున్నాక, తనను కూడా వాళ్ళలో చేర్చుకోమని బ్రతిమలాడ్డాడు. కాని కోర్డు వల్ల కాదన్నాడు.

# 10

కొరుసడపటానికి బాగా అననుకూలమయిన రోజు అది కారోవ్స్కి హెడ్ లైట్స్ వెలిగించాడు కాని వాటి కిరణాలు ఎక్కువ కాంతిని ప్రసరించ లేకపోతున్నాయి.

వార్సా వదిలింతర్వాత ఇంతవరకూ రెండువందల కిలోమీటర్లు మటుకు ప్రయాణం చేయగలిగారు. వాళ్ళకు టైర్లు ఎక్కువశ్రమ కలిగిస్తున్నాయి. ఒక టైరుకు పైభాగంలో రంధ్రం పడింది. రెండవది ఎప్పుడు బద్దలవుతుందోనని అందరికీ భయంగావుంది. టైర్లు ఇస్తున్న శ్రమలో ఇంజను పెడుతున్న ఇబ్బంది మరుగున పడుతోంది. ఈ రాత్రికి పక్క గ్రామంలో ఆగుదామని నిశ్చయించుకున్నారు. రోడ్డు నిర్మానుష్యంగా వుంది. మ్యార్టినిక్ ముందు కూర్చున్నాడు. దీపాలు ఆర్పివేస్తే ప్రయాణం సుగమం అవుతుందేమోనని కారోవ్స్కికి సలహా ఇచ్చాడు. డ్రైవర్ యీపద్ధతి కూడా ప్రయత్నించిచూచాడు. ఆకాశాన్ని కప్పివేస్తున్న చెట్లగుబురుల మధ్యనుంచి ఆకాశంలో అస్తమిస్తున్న సూర్యుని ఛాయలు అగుపడుతున్నాయి.

కార్పోవ్స్కీ తిరిగి లైట్లు వెలిగిస్తూ "ముందు యేమున్నదీ కనిపించటంలేదు!" అన్నాడు.

మార్టినిక్‌కు చికాగ్గా వుంది. అందుకనే దీపాలు ఆర్పి వేయమని సలహాయిచ్చాడు. ఈ నిరామయ ప్రాంతంలో, కొందరి రాకను ముందుగానే హెచ్చరికచేస్తూ చెప్పటం కేవలం అనవసరం. ముందేమి జరుగుతుందో యెవరికీ తెలియదు. రెప్కో వెనుక సీటులో జారగిలపడివున్నాడు. "కుదుపు ఎక్కువగా వుంది. కాళ్ళు సాచుకుందామన్నా సందులేదు" అంటున్నాడు. వోల్‌స్కీ అగ్గిపుల్ల వెలిగించి తన గడియారంవంక చూచుకున్నాడు.

"మధ్యలో యేమీ అంతరాయం కలగకుండావుంటే, మరో అరగంటలో అక్కడికి చేరుకుంటాం" అన్నాడు.

కార్పోవ్స్కీ బ్రేకులు వేశాడు. మార్టినిక్ నుదుటిమీద కొట్టుకుని "యేమయింది?" అన్నాడు. రోడ్డుమధ్య ఎవరో ఎత్తుబూట్లు ధరించినవ్యక్తి నిలబడివున్నాడు. ఏదయినా భయపడుతున్నప్పుడు అందుకు తగిన పరిణామం జరగటం సాధారణంగా అసాధారణం! కాని యిప్పుడు అలాగే జరిగింది. ఇప్పుడు అన్నీ విచిత్రాలు జరుగుతున్నాయి. మిస్టరీ సినిమాలల్లో జరిగే పద్ధతిని జరుగుతున్నాయి.

"ఆగండి! చేతులు పైకెత్తండి!"

హెడ్‌లైట్లు ఆర్పివేశారు.

"చికాగోసరుకు!" అన్నాడు రెప్కో వోల్‌స్కీ విపరీతంగా నవ్వసాగాడు.

"నీకు నవ్వటంఎలాగో నేర్పుతాను!" అంటూ ఒక గంభీరమైన కంఠం వినిపించింది.

"వాళ్ళను సోదాచేయండి. జేబుల్లో యేం దొరికితే అవే వశంచేసుకోండి."

మార్టినిక్ బుజానికి ఒక పిస్టలు కొన ఆనివుంది. కొత్త చేతులు అతని శరీరాన్ని తడుముతున్నాయి.

"చేతులు తలవెనక పెట్టుకోండి. ముందుకు నడవండి!" అని ఆజ్ఞ. వాళ్ళు ఇసుకలోనే ముందుకు వెళ్ళారు. మార్టినిక్ చెట్టుమొదళ్ళు తగిలి తడబడుతున్నాడు. ఇంజను మళ్ళీ నడక సాగించారు, ఆ వెలుగులో చెట్లకాండాలు అగుపిస్తున్నాయి. మార్టినిక్‌కు ముందుగా కార్వోస్కి నడుస్తున్నాడు. రోడ్డు మలుపు తిరుగుతోంది. వెనకగా వస్తున్న కారుకాంతి ముందుకు సరిగ్గా పడకపోవటంతో చీకట్లో నడవటం కష్టంగా వుంది. బయటకు దూకితే? ప్రయోజనంలేదు. ఒకమనిషి నిజంగా యేదయినా కావాలని వాంఛిస్తే, అంతా అపసవ్యంగానే తయారవుతుంది. అతను యేం నిర్ణయించుకున్నాగానీ, మళ్ళీ స్వక్రమ మార్గంలో పడటం కష్టం. ఇప్పుడు తన పరిస్థితి అంతే అయింది. అనుకున్నది ఒకటి, అవుతున్నది మరొకటి. కొత్త జీవితం అంటూ యేమీ లేనప్పుడు ఇక్కడినించి పారిపోతే మటుకేం అనిపించింది. అవును. సరైన సమయంకోసం ఎదురు చూస్తున్నాడు. ఒక్కసారిగా కిందికి వంగితే. ఒక్కఅడుగు. అంతే......కాని ఇప్పుడు హెడ్‌లైట్లు నేలబారుగా ప్రశరిస్తున్నాయి.

నేలమీద మంటచుట్టూ మనుష్యులు గుమిగూడారు,

పైన చెట్లుముళ్లు కాలుతూ పేలుతున్నాయి. చెట్ల కొమ్మలు కూడా మంటలో విసిరివేస్తున్నారు. నలుగురు మనుష్యులు ఒక వరుసగా నిలుచున్నారు. చేతులుకిందికి చాచుకున్నారు. ఫర్ చెట్ల అవతలనించి ఒక పొట్టిమనిషి వీళ్ళను పరిశీలిస్తూ నిలుచున్నాడు. మంట బాగానుండినప్పుడు మటుకే ఒకళ్ళ కొకళ్లు కనిపిస్తున్నారు. లేనప్పుడు అంధకారం.

వోల్‌స్కీ మాట్లాడనారంభించాడు: "మిత్రులారా!–"
ఆ మనిషి అరిచాడు: "నిశ్శబ్దం! నిన్నెవరూ ఉపన్యాసం యివ్వమని కోరటంలేదు." కార్వొవ్‌స్కీ తలవంచుకునే పైకి లేచాడు. రెపోక్ ఒక కాలిమీందినించి మరో కాలిమీదికి అని నిలుచున్నాడు. "అతని బొల్షివిక్ చొక్కా విప్పేయండి!" అన్నాడామనిషి. రెపోక్ గుండీలు విప్పుతున్నాడు. ఇంతలో వాళ్లు దాన్ని పూర్తిగా చింపేసి పొడుగాటి కోటు యిచ్చారు.

ఆ చీకట్లోంచి ఒక కుర్రవాడు వచ్చాడు. నమస్కారం చేసి వాళ్ళ చేతిసంచులు దళనాయకుడికి అందించాడు. అతను వాటిలో కాగితాలన్నిటినీ పరిశించాడు.

"ఇంజనీర్ వోల్‌స్కీ! ఎవరది? డైరెక్టరా?...కమ్యూనిష్టులకోసం కర్మాగారాలు నడుపుతూ అవి పోలండ్ కోసరమే నని చెప్పినవాడేనా – లుచ్ఛా..." అన్నాడు. ఇలా అంటూ ఆ సంచిని విసిరిపుచ్చుకుని మంటలోపడేశాడు.

"జాన్‌మార్టినిక్. పీపిల్స్ కల్చరల్‌క్లబ్బు తాలూకు వ్యక్తేగదూ! ఒక పేపరుమిల్లుకు డెప్యూటీడైరెక్టరుకూడా. పార్టీ మెంబరేనా?"

—మార్టినిక్‌కు ఆశాకిరణం కనిపించింది. అతనికి

హఠాత్తుగా, తనపార్టీ కార్డుదగ్గరలేదన్న విషయం గుర్తు వచ్చింది. అంచేత వణుకుతూ. "పార్టీ మెంబర్ని కాను" అని బదులుచెప్పాడు.

నాయకుడు కాగితాలు తిరిగి పరిశీలిస్తూ అతని— ముఖంవంక కాదు - చేతులవంక గుచ్చిచూచాడు. ఏదోతీర్పు వస్తుందనుకున్నాడు మార్టినిక్. తనలోతాను ప్రార్థనలు చేసు కున్నాడు. నాయకుడు డబ్బు మటుకు తన జేబులో భద్రపరచి కాగితాలు, సంచి మంటలో విసిరాడు. ఫ్యాక్టరీని వశపరుచు కోవటానికి మార్టినిక్‌కు యిచ్చిన అధికారపత్రం మంట కలిసి పోయింది.

"కార్వోస్కీ. డ్రైవరా? యుద్ధానికిముందు యేం చేస్తూండేవాడివి ?"

"వార్సాలో టాక్సీతోలుతూ వుండేవాడిని!"

అతను చేయికదిలించాడు. తూ నెగుడ్డతో కార్వోస్కీ ఎదుర్రొమ్ముమీద బాదాడు. నేలమీదపడిన కాగితాలను జాగ్రత్తగా యేరాడు.

"రెపోస్కీ ఈబెన్‌బర్గ్ పేపర్‌మిల్లుతాలూకు పర్సనల్ డైరెక్టర్. కమ్యూనిస్టుపార్టీ సభ్యుడు. కుర్రాళ్లూ, పోల్ దేశ స్థుడై బోల్షివిక్ పార్టీలోచేరి తన మాతృదేశాన్ని బానిసత్వం పాలుచేసే వాడిని మనం యేమని పిలుస్తాం?" అనడిగాడు.

ఆ చీకట్లోంచే ఎన్నో కంఠస్వరాలు "దేశద్రోహి!" అని బదులుచెప్పాయి. ఈమాట ప్రతిధ్వనించింది. తరువాత నిశ్శబ్దం. రెపోస్కీ ఇటునుంచి అటుకదిలి "నేను—" అంటూ ఏదో చెప్పబోయాడు.

"నోరుముయ్యి. నీవు మాతృదేశానికి ద్రోహం తల పెట్టినవాడివి. పార్టీలోచేరి క్షేమంగా వుందామనుకున్నావా? కాని ఇంకా కొంతన్యాయం అంటూ వుంది. ఇంకా న్యాయం నిలబడుతూనేవుంది."

అతనిచేయి పిస్తోలుమీదనే ఆనివుంది. రెప్కా పెదిమలు కదులుతున్నాయి. నోరుమూసుకుందామని ప్రయత్నంచేసికూడా, చేతకావటంలేదు.

నాయకుడు సౌంజ్ఞచేశాడు మార్టినిక్ గమనిస్తూ వుండగానే అతనివెనక నిలుచున్నవాళ్లు తుపాకి బారుపెట్టి పేల్చారు. అతనికాళ్లు వణకుతున్నాయి న్వృత్యావు!

రెండు గుండ్లుపేలిన శబ్దం అడవి ప్రతిధ్వనించింది. అతను సజీవంగానే వున్నాడు. గాలిపీలుస్తున్నాడు. "నేనుకాదు, నేలకూలినవాడు రెప్కా!" అనుకున్నాడు. కొనవూపిరితో రెప్కా అల్లలాడుతున్నాడు. అతని టోపీ మంటలోపడింది.

నాయకుడు అదృశ్యమయ్యాడు. మార్టినిక్‌కు వెనుక నుంచి వినవచ్చింది: "తలల వెనుక చేతులు పెట్టుకోండి. ముందుకు నడవండి!" పిస్తోలు తనవీపుకు బారుపెట్టివుంది. చుట్టూ కానరానిచీకటి. గుడ్డిగా నడుస్తున్నాడు. "ఇప్పుడు నన్నూ ఒకమూల తుదముట్టిస్తారు" అనుకున్నాడు. నాయకుడి చిరునవ్వు అర్థంచేసుకుందామనుకున్నాడు. ఇంతకూ తమను ఎక్కడకు తీసుకుపోతున్నారు? అతికష్టంమీద నడుస్తున్నాడు. అడుగువేయటం ఆలస్యం అయితే వెనకనుంచి నెడుతున్నారు. ఎట్లాగో చావు తప్పదు. ఎవరిచేతుల్లో నయితేనేం? కాళ్లకు ముళ్లు గుచ్చుకొంటున్నాయి. బురదలో కాళ్ళు దూరుకు

పోతున్నాయి. ఇలా ఎంతసేపు గడుస్తుంది, ఒకగంట – రెండు గంటలు – ఏమో ఎవరు చెప్పగలరు? ఇసుకనేలలో యీడ్చుకుంటూ నడుస్తున్నాడు. ఒక్కసారిగా ఆగాడు. ఏదో బరువు తగ్గినట్లయింది. అది! వెనుకనుంచి పిస్తోలు తగలటంలేదు. అతను అలాగే కదలకుండా నిల్చున్నాడు. ఏమీ సవ్వడిలేదు. కూర్చున్నాడు మళ్ళీలేచి నాలుగు అడుగులు వెనక్కువేశాడు. ఇంకా నమ్మకం చిక్కటంలేదు. శ్రద్ధగా విన్నాడు, ఆలకించాడు. నింపాదిగా "కార్వోస్కి, కార్వోస్కి–" అని పిలిపించాడు. "ఆ! ఆ! ఇక్కడ!" అని జవాబు వచ్చింది. ఒకళ్ళనొకళ్ళు పిల్చుకోసాగారు. కార్వోస్కి చెట్లుకొమ్మలు అడ్డు తొలగించుకుని అతనికి దగ్గరగా రావాలని ప్రయత్నిస్తున్నాడు.

# 11

మామూలు జీవితాన్ని గురించిన ఆలోచనే ఎంతోకంగారు కలిగిస్తోంది. ఒక వేళ తను ఈ యూనిఫారమ్‌ను పారవేయాల్సి వస్తే?– ఆతరువాత? ఏదయినా చేయవలసిన పనంటూ వుంటే కాలంగడుస్తుంది. కాని ప్రయాణమంతా పూర్తయినాక గమ్యస్థానంలో యేమీలేకుండా పోతే ఎలా వుంటుంది? వింటర్ తన చుట్టాలలో ఒక్కవ్యక్తితప్ప మరెవరూ బ్రతికిలేదని తెల్సుకున్నాడు. ఆ వ్యక్తి అతని మేనమామ ఇసాక్ ఫ్రీడ్‌మన్. ఫ్రీడ్‌మన్ యుద్ధానికిపూర్వం పల్లెటూరి యూదుడు. చిన్న వ్యాపారంచేసుకుంటూ వుండేవాడు. లోడ్జిలో ఒకనాడు పెద్ద బజారులోని దుకాణంలోకి అడుగుపెట్టి, వింటర్, కౌంటర్ వెనుకకూర్చున్న తన మేనమామను గుర్తుపట్టాడు. ఇసాక్

కూడా యితన్నిచూచి ఆశ్చర్యంతో "ఓరి! జో! సిపాయివా? రష్యావెళ్ళివచ్చావా యేం?" అన్నాడు. మొదటిసారిగా వింటర్ చలించిపోయాడు. ఇద్దరూ ఒకరినొకరు గాఢంగా కౌగలించు కున్నారు. "సరే బాగానేవుంది. ఇద్దరంకూడా అక్కడినించి వచ్చేశాం. ఈ సోషలిస్టు రాజ్యంలో అడుగుపెట్టాం.

నెలరోజుల క్రితం పోలిష్ యూదులను రష్యానుంచి వెనక్కు పంపివేశారు. ఫ్రీడ్ మన్, అతనిభార్య, కుటుంబం— అందరూ యీవరుసలో ఇక్కడికి చేరుకున్నారు. జీవనోపాధి కోసం యేదోమార్గం వెదుకుతూ—లోగడ జర్మనులు ఆక్ర మించిన ప్రాంతం ఒకటిచూచి—అక్కడ దుకాణం ఆరం భించారు. వింటర్ ఇప్పుడు అందివచ్చిన ఐశ్వర్యంతో కులా సాగా వున్నాడు. మేనమామకొడుకులు కొత్తబట్టలుధరించి జల్సాగావున్నారు. ఇసాక్ అతన్ని "ముందు ఏం చేయదలచు కున్నావు?" అని అడిగాడు. "ఈసరికి నీకు అదిబదిలిపోయిందను కుంటాను!"

"ఏది!"

"అదే! నీవు బాధపడుతూ వచ్చిన కమ్యూనిజం. శ్రామిక వర్గానికి మాతృదేశమే ఆరోగ్యానికి మంచిది. ఎంతో మంచిది. వింటర్ నిర్లక్ష్యంగా - తామున్నాత్రమే బ్రతికి వుండటానికి కారణం రష్యాలో వుండివుండటమే - అన్నాడు.

మామ అతనివంక చూచాడు. "ఏమిటి నీ భయం? మనం మనలోనేవున్నాం. నన్నూ అరెస్టుచేసి పంపించారు. ఎందుకు? నా మంచికేనా? నన్ను ఎక్కడికి తీసుకువెళ్ళారు? పెద్దపెద్దఅడవులకు! అక్కడ మనమొక సూక్ష్మజీవి ప్రాయంగా

వుంటాం. అక్కడ దేన్ని నరికినా మరుక్షణంలోనే అంతకన్నా పెద్దదిగా తయారవుతుంది. మనం సాంఘికవ్యవస్థకు హానికర మైన వ్యక్తులుగా పరిగణించబడ్డాం. అక్కడ మనం వెళ్ళటానికి పదిసంవత్సరాలు ముందే అడవంతా నరికివుంది. గొయ్యంతా చెదపట్టింది. కలప ఎగుమతికి లారీలులేవు. చెట్లు కొట్టిన మను ష్యులు కూడా కుంగి కృశించిపోయారు. కాని... నేను యేం చేశాను? నేను రాజకీయాలతో ప్రమేయం పెట్టుకున్నానా? నాదగ్గరేం డబ్బు ఎక్కువగా వుందా? నావంటి చిన్న యూదులు ఒక లెక్కా పత్రమా?"

ఇలా చెబుతూ వుండగా, వింటర్ అతని భార్యవంక చూచాడు. ఆమె యిలా ప్రారంభించింది. "ఆయన తెలివి తేటలవల్ల, సమయస్ఫూర్తివల్ల కాకపోయినట్లయితే, యీ పిల్లలు నేను అప్పుడే ప్రాణాలు కోల్పోవలసినవాళ్ళం. మేం సమిష్టివ్యవసాయం ఆరంభించాం. అక్కడివాళ్ళు ఎంత బీదవా ళ్ళంటే, తినటానికి రొట్టెకూడా లేనివాళ్ళు. రొట్టెకోసం బంగాళదుంపలు మారకం చేసేవాళ్లు!" ఫ్రీడ్‌మాన్ వింటర్‌ను బుజాన తట్టి "అది ఎలాంటి దేశమో నీఅంతట నీవే చూచా వుగా! డబ్బువుంటే యేదైనా దొరుకుతుంది. వాళ్ళంతా దోపిడిదొంగలు, నికృష్టులు" అన్నాడు.

"అయితే నీవేం చేదామనుకుంటున్నావు." ఇక్కడే వుండి వాళ్ళకోసం పనిచేస్తావా? ఇక్కడకూడా అదేపని జరుగ బోతోంది. ఇక్కడ మనకు స్థానంలేదు. పోలులు మనను అసహ్యించుకుంటున్నారు. ఇంక మనకేముంది? స్మశానం!—" అంటూ భార్యవంక చూపి "ఆమె బంధువులంతా పాలస్తీనాలో

వున్నారు. అదే మనదేశం. మేం అక్కడికే పోతాం. కాని యిప్పుడే వెంటనే పోలేం. సర్వనాశనమై కట్టుగుడ్డలతో యిక్కడ వచ్చిపడ్డాం. కొంతడబ్బు సంతాదించాలి, చక్కటి దుస్తులు సంపాదించాలి. ఒకటిరెండు సంవత్సరాలలో యీ దుకాణాలన్నీ మూసివేయిస్తారు అందుచేత దీపం వుండగానే యిల్లు చక్కబెట్టుకోవాలి! అంతా అక్కడిమాదిరే జరుగుతుంది. బహుశ యూదులను వెళ్ళటానికి ఆటంకపరచ రనుకుంటాను. ఒకవేళ యేదేనా ఆటంకం వచ్చినా, చెకోస్లొవేకియా, వియన్నాలమీదుగా వెళ్ళవచ్చు."

వింటర్ తన తండ్రినిగురించి ఆలోచిస్తున్నాడు ఆయన కూడా బ్రతికివున్నట్లయితే - పాలస్తీనానుగురించి యిలాగే కలలు కనేవాడా? తనతండ్రితో వేరుపడేవాడా? అతనికి పూర్వం తన చిన్నతనంలో - తసయీాడు పిల్లవాళ్ళతో ఆడుకున్న మురికి వీధి జ్ఞాపకం వచ్చింది.

"నేను అరెస్టు అయేముందు టిటిల్‌బామ్‌ను కలుసుకున్నాను. అతను మీా నాన్న దుకాణంపక్కనే వుండేవాడు. అతన్ని కొత్తసోషలిస్టు జీవితం ఎలావుందని అడిగాను. "ఇందులో తప్పేముంది? నూటికి యిద్దరు బాగాబతుకుతారు" అన్నాడు. కాని, ఆ యిద్దరిలో జతఅవడం ఎలాగన్నాడు. అతను చెప్పింది నిజమే. అదృష్టవంతుడెవడూ యిక్కడ వుండడు. ఎలాగో అలా సర్దుకుపోదామనుకునేవాళ్ళే యిక్కడ వుంటారు. పార్టీలో చేరతారు. విచిత్రమైన వేషాలువేస్తారు, చివరకు మంత్రులుకూడా అవుతారు. అదికూడా జీవితమే

నంటావా? ఏమీ కారణం లేకుండానే జైల్లో వేస్తారని - ఆ క్షణంకోసం భయపడుతూ కాలంగడపాలి! చివరకు యేమవుతుంది? ఏదయినా మార్పువస్తే పోలులు తమ కత్తులు బయటకు లాగుతారు. అప్పుడు యూదుడనేవాడే మిగలడు. నీవంటి మనుషులు వాళ్ళకు ఎందుకు కావాలనుకుంటున్నావు? పోలులు ఎవ్వరూ లేరుకనుక! కమ్యూనిస్టులను కొందరిని తరిఫీదుచేశాక నీ స్థితియేమిటి? దేశానికొకళ్ళుగా బంధుజాలమంతా విడిపోతోంది!"

వింటర్ సతీమణి ముఖం విజయసూచకంగా వెలుగుతోంది. ఇదివరకు ఆమె ఎక్కువగా మాట్లాడుతూవుండేది. ఏమి జరుగుతుందని ఆదుర్దాగా ప్రశ్నలు వేస్తూవుండేది. ఫ్రీడ్‌మన్ ఆమె హావభావాలను ఊహించాడు. "ఇంతకంటే యేం చెప్పను? నీభార్యకూడా యిలాగే అనుకుంటున్నదని నా ఊహ. నేనేం నీకు వ్యతిరేకంగా చెప్పటంలేదు - ఈ పని చేయాలి అనుకుంటే తప్పకుండా చేసితీరాలి. వాళ్ళను నీవు ప్రేమిస్తున్నానని, ఇంకా ప్రేమిస్తూనే వుంటానని బాసచేయి. నీవిక్కడనుంచి దూరంగా వెళ్ళవచ్చు. నీ విద్య ఇందుకు దోహదం చేయవచ్చు. ఏమి చేసినా నీవు బీద యూదుడివే గాని మరేంకాదు. మరోదేశం ఎన్నుకున్నా ఇంతకంటే ఘనంగా వుంటుందనుకోను. ఇంతకంటే నీకేం సలహాయివ్వను? ప్రతివారూ యేదో మంచికోసం ప్రాకులాడతాడు. ఉరిపోసుకోవటానికి తాడు కావాల్సినా, అదికూడా మంచిదే కావాలని తాపత్రయపడతాడు."

ఫ్రీడమన్ కుటుంబాన్ని కలుసుకున్న తర్వాత, వింటర్

ఒక కోసకు వచ్చాడు. ఈ కుటుంబజీవితానికి అంటుకునివుండి అక్కడికి తరుచు వెళ్లేవాడు. మామ చెబుతున్నదానికి అతని వద్ద జవాబేమీలేదు. ఎందుకు లేదో అతనికి తెలియదు. ఆయన అసాధారణమైనదేమీ చెప్పలేదు. ఆయనకు అంతా తెలుసు. కాని ఏ విషయమైనా తెలుసుకోవటం వేరు, దాన్ని గురించి చెప్పగా వినటం వేరు. కొన్ని కొన్ని విషయాలలో నిశ్శబ్దం యొక్క ప్రభావం అటువంటిది. అదీకాక అధికార భాష కొంత వాస్తవికతను తగ్గించింది. ఒకమనిషి ఒక ఇంటి వంక చూస్తూ వుంటాడు, దాన్ని ఇల్లుకాదు — యేదో మేఘం అని చెప్పి నెగ్గగలగడం ఎలాగో వింటర్ తెలుసు కున్నాడు. మేనమామ కేవలం కొద్దివాడు. అతనితో తీవ్ర చర్చలు చేయటానికి వీలులేదు. తను ఇలా ఎవరికోసం ఇన్నాళ్లు తిరగాలి ?

ఇటువంటి ఆలోచనలు వింటర్‌ను కుంగదీశాయి. పరిస్థితులు అనుకోని పరిణామాలు పొందుతున్నాయి. "వాళ్ళు" త్వరలోనో యింకా కొన్నాళ్ళకో అన్ని ప్రాంతాలకు చేరుకుం టారు. దాక్కోవటానికి ప్రయత్నించి లాభంలేదు. పార్టీని మోసంచేస్తే తనకుమిగిలిం దేముంది? చరిత్రకు తీరుతెన్నూ లేదని రుజువయితే, ఇక వాటికోసం తను వెదకటం ఎందుకు? వింటర్ అతని మేనమామను, అటువంటివ్యక్తులనుచూచి అసూయపడు తున్నాడు. వాళ్ళకు ఘనతరమైన అనుభవంలేదు. విజ్ఞానవాచవి ఎరుగరు.

తను ఇక్కడున్నంతకాలం తన గతానికి కొంత అర్థం వుంది. తన విజయాన్ని గురించి పునరాలోచించుకుంటున్నాడు.

యుద్ధానికి ముందు రష్యన్ జోన్‌లో తన అనుభవాలు నెమరువు తెచ్చుకుంటున్నాడు. అప్పుడు తను తెలివితక్కువగా ప్రవర్తించాడు. తను చేసినదానికి సిగ్గుపడి అభిమానపడుతూ వున్న సమయంలో-క్వింటోనే కలుసుకోవటం తటస్థించింది. ఇద్దరూ స్నేహితులుగా సంభాషించుకున్నారు. వాళ్లు తనను కూడా తమలాగే లక్ష్యసిద్ధి కలవాడనీ నమ్మకస్తుడనీ భావిస్తున్నారు. అప్పుడతను ఎంత బుద్ధాయిలా ప్రవర్తించాడు! వాళ్ళతో అబద్ధం చెప్పటానికి భయపడ్డాడు. వాళ్లు పీటర్ క్వింటోను గురించి అడిగినప్పుడు అంతా చెప్పివేశాడు. పీటర్ అరెస్టును గురించి తెల్లవారేసరికల్లా తనకు వార్త వచ్చింది. తను చెప్పకపోయినా, ఇంకెవరయినా చెప్పతారనో లేక వాళ్ళంతట వాళ్ళే కనుక్కో గలుగుతారనో సర్ది చెప్పకోటానికి ప్రయత్నించాడు. అయితే, పీటర్ తప్పించుకు పారిపోయినాడని విని మరీ సంతోషించాడు; తన పనులకు యేం సమర్థన వున్నది? ఈ ఆలోచనలు వచ్చినప్పుడు-శరీరం చెమటతో తడిసిపోతుంది. అత్తమామల తోడ్పాటుకోసం అతనికీ ఉబలాటంగావున్నా, అంత తొందరగా వాళ్ళతో కలిసిపోయిన తన భార్యపట్ల మటుకు కోపంగా వుంది.

## 12

గ్రామానికి వెనకగా ఒక రాతిరోడ్డు వెడుతుంది. ఆరోడ్డు తిన్నగా అడవిచివరకు తీసుకువెడుతుంది. వోలిన్ నింపాదిగా నడుస్తున్నాడు. ఈరోజుకు చాలినంత అయింది. తన పూర్వ

కులు రైతులను అదుపులో పెట్టటానికి ఎన్నో యుక్తులు కుయుక్తులు చేయలేదా?

ఇప్పుడతను పైకిపోవాలి. నోలిన్ కారు దిగేసరికి అతను అక్కడ ఎదురుచూస్తూ కూర్చున్నాడు. గుడిసెముందు కొందరు ముసుగులు కప్పుకుని కూర్చున్నారు. తమ నాయకుడు ఆజ్ఞ యివ్వగానే శవాలమీది గుడ్డలు తొలగించారు. ఆరుగురు వున్నారు. "ఇతనే కోర్డు"అన్నాడు ఒకదాన్ని చూపి. మృతుడు మామూలు చొక్కా, పాంటు ధరించివున్నాడు. మెడలో శిలువగుర్తు ధరించాడు. కాళ్ళకు బురద అంటివుంది. నోలిన్‌కు అతన్ని చూడగానే, చిన్నతనంలో పాఠశాలలో చదువుకునే టప్పటి స్నేహితుడిని చూచినట్లయింది. నిదానించి పరిశీలనగా చూచాడు – ఈసారి ముఖం అపరిచితంగా తోచింది. ఆమనిషి ఇలా చెప్పాడు. "ఇతన్ని భలే తమాషాగా పట్టుకున్నాం. ఇతను యీ చుట్టుపక్కల గ్రామాలలో తన ఇష్టంవచ్చినట్లు విచ్చలవిడిగా తిరుగుతున్నాడు. మా యేజంటు ఒకనిద్వారా ఇతని ఆచోకీ తీశాం. కొద్దిగా పోరాటంకూడా జరిగింది. మా మనుషులు ఇద్దరు చనిపోయారు."

నోలిన్ పక్కనున్న వృద్ధరైతు శవంవంక చూపుతూ "ఇతనెవరు?" అన్నాడు.

"ఇతను యీగుడిసె స్వంతదారు. ఇతని కొడుకు కోర్డు ముఠాలో వున్నాడు. మేం అతన్ని పట్టుకోలేకపోయాం. మేం ఇక్కడినించీ వెళ్లేలోగా యీ గుడిసెను తగులబెడతాం. దాంతో వీళ్ళకు బాగా బుద్ధివస్తుంది."

నోలిన్ "అంతపని చేయకండి. ఇది చాలు. మీకు ఆచోకీ ఇచ్చిన వ్యక్తికి పారితోషికం ఇవ్వడంమటుకు గుర్తుంచుకోండి." అన్నాడు.

బందీలను సోదాచేయటం ఆరంభమయింది. ముగ్గురు మట్టుకే సజీవంగా దొరికారు. ఇద్దరు దేహశుద్ధి అయిన మీదట దారినపడి మాట్లాడ నారంభించారు. మూడోవాడు నోరు మెదపటంలేదు. ఉన్నట్టుండి అతను తన్ను పట్టుకున్న వాళ్ళ చేతుల్లోంచి విదిలించుకుని ముందుకు దూకి నోలిన్ కూర్చున్న బల్లదగ్గరకు వచ్చి అతని ముఖంమీద ఉమ్మేశాడు. వింతగా జరిగిపోయింది. నోలిన్ అతన్ని ఒక్కడినే వదిలివేయమని చెబుదామనుకున్నాడు. కాని ఇంతలోనే ఆ మనుషులు అతని తలమీద తుపాకి మడమతో కొట్టారు. ఈ యువక విద్రోహి నామధేయం యేమిటి? గూలా. బహుశ అబద్ధం కావచ్చు. అతని నిజమైన పేరు కనుక్కోవటం ఒకపని. కాని యేం తమాషా పని చేశాడు! ఎంత చలాకీగా చేశాడు! చేతిరుమాలుతో ముఖం తుడుచుకుని, మానవుల ప్రవర్తనలో విజ్ఞానవైపరీత్యం ఎంత మార్పు తీసుకువచ్చిందో ఆలోచించసాగాడు. గూలా నిస్సందేహంగా తనను దేశద్రోహి క్రింద పరిగణిస్తున్నాడన్న మాట! మనుష్యులకు కొంత నైతిక భాధ్యత వున్నదని భావించినప్పుడే ఎవరైనాసీ ఇలా చేయగలరు. ఈ ఇరవయ్యో శతాబ్దంలో ఇది తేలికయిన పనికాదు. ఏ వ్యక్తీ కూడా తనంత తాను దీనికి బాధ్యుడుకాదని జనం అర్థంచేసుకున్నాక చాల విచారిస్తారు. అప్పుడు వాళ్ళను సక్రమ మార్గంలో పెట్టటం తేలిక. సాంఘికవ్యవస్థ యేమీ మార్చ

టానికి వీలులేకుండా తయారవుతోంది. నూతన ప్రభుత్వం, యీ నమ్మకం దృఢతరం అవుతే తప్ప, అసాధ్యం. దీన్ని అర్థంచేసుకుని ముందుగా ప్రచారంలోకి తీసుకువచ్చి భూగోళం లోని దేశాలన్నిటికీ భయం కొల్పినవాడు "ఫెలిక్స్ జెర్జి న్స్కి!" తనవంటి పోలిష్ పెద్దమనిషి. గులాకు వోలిన్ అంటే ఎటువంటి అభిప్రాయం వుందో, వోలిన్ తలిదండ్రులకూ ఫెలిక్స్ అంటే అటువంటి అభిప్రాయమే వుండి వుంటుంది. కాని ఒకరోజున ఫెలిక్స్ జెర్జిన్స్కి శిలావిగ్రహం కమ్యూని నిష్టు వార్సాలో ప్రతిష్ఠించబడుతుంది. తతిమ్మావాళ్ళ విషయం, కేవలం బూడిదే మిగులుతుంది.

ఈరోడ్డు ఎండిపోయిన వాగుయొక్క గర్భం. దీన్ని చూస్తూంటే వోలిన్‌కు స్పెయిన్ గుర్తుకువచ్చింది. తల పైకెత్తి చూస్తే చెట్టుచేమలు, పచ్చనిమొగ్గలు అగుపిస్తున్నాయి. ఆకాశం ఎర్రగావుంది. అస్తమిస్తున్న భానునిప్రకాశం అది. వోలిన్ అటూయిటూ పచార్లుచేస్తుంటే, ఆ మనిషి కంగారు పడ్డాడు. ఏమంటే రోడ్డుమునాలో మనుష్యులు యింకా అక్కడక్కడా తిరుగుతూ వుండవచ్చు, వారినించి వోలిన్‌ని రక్షించాలికద! వోలిన్ తన రివాల్వర్ చేతపుచ్చుకుని యేదో యీలపాట పాడుకుంటున్నాడు. దూరంగావున్న యిళ్ళ కిటికీలలోంచి దీపాలవెలుగు కనిపిస్తోంది. ఈసారి జనం తమ భోజనం బల్లలదగ్గర కూర్చుని తృప్తిగా ఆరగిస్తూ వుంటారు భయంవల్ల గుసగుసలు చెప్పుకుంటూ వుంటారు. వోలిన్‌కు

రాత్రిపూటలు యితరుల యిళ్ళకిటికీలలోంచి చూడటం అంటే యిష్టం. అవతలవాళ్ళ అజ్ఞానాన్ని ఆసరాగా తీసుకుని తాను వినోదం పొందవచ్చు. మానవులపోరాటం, అనవసరమైన ఆర్భాటం చూస్తూవుంటే అతనికి నవ్వువస్తోంది.

అతని కాగితాలలో ఎన్నో పేర్లు, ముఖాలు వున్నాయి. అతని కండరాలు బాగానే పనిచేస్తున్నాయి. కాని యిప్పుడు, వార్నాలో అతి ప్రయత్నంమీద కొనగలిగిన లాబిక్ రెండు గ్రంథాలనుగురించి ఆలోచించాలనిపిస్తోంది. ఆ గ్రంథాలమీద తగులబెట్టబడిన గ్రంథాలయం ముద్రలు వున్నాయి. ఆ గ్రంథాలు అతనికి ఎంతో తృప్తిని యిస్తున్నాయి. ఎంతో ఆహ్లాదాన్ని కలుగజేస్తున్నాయి. అతనికొక దృఢమైన అనుమానం వుంది. అదేమిటంటే ప్రస్తుతయుగంలో, హాస్యంకానీ దుఃఖం గానీ సాధ్యమైనదికాదు. ఈ అనుమానం, యుద్ధకాలంలో వివిధదేశాలలో తను చూడగలిగిన దృశ్యాలవల్ల మరింత దృఢతరం అయింది. అక్కడ హాస్యంగాని, విషాదంగానీ రహస్యంగా మటుకే వుండగలవు. వాటికి అర్థం ప్రయోజనంలేవు! గూలావంటి తెలివితక్కువ యువకులకు విషాదం వ్రాసిపెట్టే వుంది. అణగద్రొక్కబడ్డజాతి – దేశరక్షణ, వీరప్రదర్శన – యివన్నీ ఆలోచనల మాలలు!

నోలిన్ పక్షులపాటలు వింటున్నాడు. వాటిని బెదరగొట్టకుండా ఆ సంగీతాన్ని ఆస్వాదిస్తున్నాడు. చెట్లమీద పక్షులు తమతమ కుటుంబాలతో కాపురం చేస్తూవుంటాయి.

# 13

రాళ్ళమీద ప్రవహిస్తున్న నదిలా వున్న కాలం, పీటర్ కోసం జీవశక్తిని పోగుచేసుకువస్తున్నట్లుంది. అతని ఇష్టం ఎలా వున్నా యీ అసంగత పరిస్థితులలోను, అశాశ్వతమైన సంధి యుగంలోను – తనస్థానం యేమిటో చూచుకోవాలి! అయితే తాత్కాలికం అనుకున్నదే తరుచుగా శాశ్వతమై కూర్చుం టుంది. వెచ్చగావుంది యీవేళ. చెట్ల కొమ్మలు అలరారు తున్నాయి. సాయంత్రంపూటలు వీధి దీపాలకాంతులు యీ కొమ్మలమధ్యగా కనిపిస్తూ వుంటాయి. లోడ్జు నగరంలో ఉద్యానవన విహారశాలలలోనుంచి సంగీతం వినవస్తోంది. తన్ను తాను వేసుకుంటున్న ప్రశ్నలకు మనస్సు గాభరా అయిపో తోంది. భయం, గతాన్నితల్చుకుని సిగ్గు, భవిష్యత్తునుగురించి అభిమానం, అందరి హృదయాలలోను గుప్తంగా దాచబడి వుంది. ప్రజలు తమ జీవితాలను పునరుద్ధరించుకోవటంలో మునిగి వున్నారు. పత్రికలలోవచ్చే అబద్ధాలు, అధికార ఉపన్యాసాలు– అన్నీ అముఖ్యమైన వనిపిస్తున్నాయి. అందరూ తమతమ గోడ వలలో మునిగివున్నారు. ఎవరికీ క్షణం తీరుబడిలేదు. ఆడవాళ్లు విచ్చలవిడిగా తిరుగుతున్నారు. దేహం శాశ్వతం కాదనీ యేనాటికయినా పుట్టినవాళ్లు గిట్టక తప్పదనీ బ్రతికివున్న నాలుగు రోజులూ సాధ్యమైనంతగా సరదాలు తీర్చుకోవాలని, ఇందుకు నైతికవిలువలు అడ్డంకి కాకూడదనీ వాళ్లు భావిస్తున్నట్లుంది.

పీడర్ ఈవ్‌ను కలుసుకున్నాడు. వాళ్ళ కలయిక కేవలం సాధారణప్రమాణంలో జరిగింది. ఇద్దరూ బూనియో

కంపెనీలో పానీయాలు సేవించారు. క్లబ్బులో నృత్యంచేశారు. తరువాత అతను ఆమెను తన ఇంటికి తీసుకువెళ్లాడు. మెట్ల వరుసమీద ఆమెను ముద్దుపెట్టుకుంటూ వుండగా ఆమె ముంగాళ్ళు వణుకుతూన్నట్లు స్పర్శించటం అతనికి ఆనందం కలిగించింది. ఆమె తరుచు ప్రదర్శనం అయినతర్వాత అతన్ని చూడటానికి వస్తూవుండేది. ఆమె వేషధారిణి యుద్ధంరోజుల్లో వార్సా రెస్టారెంటులో సేవికగా పనిచేసింది. ఆమెలో సునిశిత మైన హాస్యధోరణి వుంది. ఆమెధోరణి పీటర్‌ను ఎంతగానో ఆకర్షించసాగింది. ఆమె నవ్వుతూ తన భర్తనుగురించి చెప్పింది: అతను జర్మన్ల దండయాత్రలో చనిపోయాడు.

"అదంతా కేవలం తమాషా! వినోదం! నీవు నిజంగా ఇటువంటి మనిషివి కాదు. అందరూ ఇప్పుడు నాటకంలో పాత్రలలా వున్నారు. ఎవరికీ ఏ విషయంలోనూ నమ్మకం లేదు. ఏజెంట్లు తామే ప్రభుత్వం అంటారు. రష్యన్ ఆఫీసర్లు, నడుపుతున్న సైన్యాన్ని పోలిష్‌దళం అని పిలుస్తున్నారు. మనం చేయగలదల్లా చూస్తూ వినోదించటమే!"

పీటర్‌కు, థియేటర్‌తో తన పూర్వసంబంధాలు తిరిగి పొందటానికి ఈవ్ ఒక సాధనం అయింది. ఈ అవాస్తవిత వాతావరణం, తమాషా మనుష్యులు, గ్రీజ్ వాసనలు, అర్థ నగ్నంగా వుండే మనుషులు! - పోచుకోలు కబుర్లు విద్వేషాలు అసూయలు - ఇదంతా ఒక ప్రత్యేక ప్రపంచం! నిజం చెప్పాలంటే, ఇక్కడే వుండిపోవటం ప్రమాదకరం. ఇది తన గతాన్ని గుర్తుతెస్తోంది. థెరెస్సా వివాహం చేసుకుంది. ఇప్పుడు మూడుసంవత్సరాల కుర్రవాడు కూడాను! ఇప్పుడు

తాము కలుసుకుంటే పరస్పరం శ్రద్ధగా చూచుకుంటారు. ఆమె ఆకారం యేమీ మారలేదు. కాళ్ళు అలానే పొడుగ్గా పలచగా వున్నాయి. కాని వక్షోజాలు బాగా ఉబికాయి. కళ్ళచుట్టూ చారలు యేర్పడ్డాయి. జుట్టు అక్కడక్కడ తెల్లబడింది. ఆమెను ఇంటిదగ్గర గృహకృత్యాలలో మునిగి వుండగా చూస్తే ఎవరో కొత్తమనిషిలా అనిపించింది. జీవితం కొత్తతొడుగు తొడిగింది. తనుమాత్రం మారకుండావున్నాడు. కాని - మారిపోయాడు. ఆమె కూడా అంతే! యుద్ధానికి ముందు ఆమె నటించిన నాటకాలు చూస్తే అతనికి ఎంతో ఉద్రేకం పురుష సహజమైన గర్వం కలిగేవి. నాటకశాలలో ఒకవిధమైన జీవితం. ఎన్నో ఉదాత్తమైనవి, ప్రేమభూయిష్టమైనవి, చారిత్రాత్మకమైనవి - వేషాల వేసేది. అయితే నిత్యజీవితంలో పద్ధతి వేరు. దానికీ దీనికీ ఎక్కడా సామ్యంలేదు. దాని పద్ధతి వేరు, దీనిపద్ధతి వేరు.

థెరిసాతో స్నేహం ప్రత్యేకమైనది. ఆమెతో అతను అన్ని విషయాలలో జంకులేకుండా మాట్లాడగలడు. ఈవ్‌తో అయితే నిశ్శబ్దంగా వుంటే సరిపెట్టుకుంటుంది.

కొన్ని సంవత్సరాలుగా పీటరును ఒక దుస్స్వప్నం విడవకుండా బాధిస్తోంది. ఆ స్వప్నభారాన్ని అతను భరించలేక పోతున్నాడు. అటువంటి కలలు, నిజానికీ, సాధ్యమైనంత తొందరగా మరచిపోవాలి.. ఎంత ప్రయత్నించినా యిది సాధ్యం కావటంలేదు. తరుచుగా దీని వివరాలు అతనికి గుర్తువచ్చి బాధకలిగిస్తున్నాయి. దీన్ని గురించి తన తల్లితో చెబుదామని నిశ్చయించుకున్నాడు. కాని ఎలా చెప్పాలో తెలియటంలేదు.

పోతే యికదీన్ని ఒక్క థెరెసాతోమటుకే చెప్పగలడు. దీన్ని తనలోనే యిముడ్చుకోవటం రోజురోజుకూ దుర్భరం అవు తోంది. మరోవ్యక్తికి నివేదించి వారుతీర్పు వినాలి. థెరెసాతో స్పష్టంగా చెప్పాడు, గతంకాదు యిప్పుడుతనను ఎక్కువగా బాధపెడుతున్నది, స్వప్నాన్నిగురించిన స్మృతులు! ఎప్పుడో యీ బాధతనహృదయాన్ని పూర్తిగా కుంగదీస్తుంది! పీటర్ ఆమెసహాయం అర్థించాడు.

ఈ కథ చెప్పాలంటే ఇప్పుడు అతనిలో సరికొత్త సిగ్గు అవతరించింది. ఎలా మొదలుపెట్టాలో ఒకటికి నాలుగుసార్లు తన మనసులో వల్లెవేసుకుని ఆలోచించాడు. తీరా చెప్పవలసి వచ్చేటప్పటికి ఎంతో బాధకలుగుతోంది. నోటమాటరావటం లేదు. థెరెసాతో ఎన్నెన్నోవిషయాలు చెప్పాడు.

ఈ స్వప్నం ఆకలినుంచి అమానుషత్వంనుంచి ఒక పక్కదారి. ఒక మహానగరంలో రాజవీధిలో నడుస్తున్నాడు. దారినపోయేవాళ్లు తనకు గౌరవపురస్సరంగా నమస్కారాలు చేసి అడ్డుతొలుగుతున్నారు. అతను ఆగి, తనకు మోకరిస్తున్న మనిషి ముఖంలోకి చూచాడు. అతను చిన్నతనంలో తన పాఠశాల మతాచార్యుడు. తను మతాన్నిగురించి యేమన్నా విపరీతప్రశ్నలు అడిగినప్పుడు కోప్పడి చివాట్లేసి తరగతిగదిలో నుంచి బయటకు పంపుతూ వుండేవాడు. ఈ మతాచార్యుని ఇంటిదగ్గరే పాలరాతి దివ్యభవనం వుండేది. నారింజల సువాసన గుభాళిస్తోంది. విశాలమైన ముందరి వరండాలో స్త్రీగోలు బిలి యర్డ్సు ఆడుతున్నారు. సంగీతం పాడుతున్నారు. పీటర్ భోజన పదార్థాలు వుంచిన బల్లముందు నిలుచుని ఆత్రంగా చూచాడు.

తరువాత వరుసగా అన్నీ ఆరగించసాగాడు. జన్మలో ఇంకెప్పుడూ ఆకలి కానంతగా తినసాగాడు. ఎవరూ కాదనటం లేదు, అడ్డగించటం లేదు.

ఈ స్వప్నం, అన్నింటినీమించి, అతనికి పూర్తి భద్రత నిస్తూవుంది. పీటర్‌కు దైవంపట్ల ప్రేమ, గౌరవం యితోధికం అయినాయి. భగవంతుడు అతన్ని దగ్గరకు తీసుకుని తల నిమిరాడు. స్టాలిన్ పెరుగుతున్నాడు. చిన్న పీటర్‌ను పైకి, పైపైకి ఎత్తుతున్నాడు. వాళ్లు గాలిలో తేలియాడుతున్నారు. పీటర్ అతడే భగవంతుడు, సర్వమయుడు అనుకున్నాడు. ఆధ్యాత్మిక శాంతికి సుఖానికి అంతులేదనుకున్నాడు.

పీటర్ తన స్వప్నాన్ని కలగాపులగంగా చెప్పాడు. కాని అతను థెరెసాను వేసిన ప్రశ్నలుమటుకు యిందుకు వ్యతిరేకంగా వున్నాయి. "ఎందుకు? మనమంతా యిలా ఎందుకున్నాం? దీనికంతా మనమే బాధ్యులమా?"

కిటికీలోంచి బయటి చెట్లు కనిపిస్తున్నాయి. థెరెసా గడ్డం చేతిమీద ఆనించి కూర్చుంది.

కాని యింకా విరామంవుంది. భయం, కోరిక, అస్వస్థత యింకా విరాజిల్లుతూనే వున్నాయి. పీటర్‌కు తన ఆలోచనల్లోనూ ఆ వేదనల్లోనూ ఎప్పుడూ మనశ్శాంతి లేదు. మానసికతలో యేదో నిజాయితీ కొరవడి వున్నదని అతని అనుమానం. థెరెసాతో తన పరిచయాన్ని గురించి యేమనుకోవటానికీ అతనికి మనస్సు అడ్డువస్తూనే వుంది. తనలో మాదిరే ఆమెలో కూడా కొన్నికొన్ని హద్దులువున్నాయి. ఇదే తనను తృప్తి

పరుస్తున్న లక్షణం. "ఇక్కడినించీ యిక్కడికి నీ రాజ్యం. నీ రాజ్యంలో నీ యిష్టం. ఇది నీ సొత్తు" అని ఆమె చెబుతున్నట్లుంది.

# 14

త్రౌను స్వప్నాన్ని నివేదించినప్పుడు థెరెసా కనుక తనను దగ్గరకుతీసుకుని హాయిగా నవ్వినట్లయితే, తనుకూడా ఉల్లాసంగా నవ్వివుండేవాడు. అక్కడికి ఆ స్వప్న ఉదంతం సమాప్తమైపోయేది. కాని అలా జరుగలేదు. ఆమె దాన్ని గంభీరంగా విన్నది.

"వాళ్ళు మనను బలవంతాన ఊబిలోదింపుతారు. దాని ఫలితం మనం అనుభవించాల్సివస్తుంది. పాపం, నిన్ను చూస్తే నాకు జాలిగావుంది!"

కాస్సేపాగి, కుర్రవాడికోసం కుడుతున్న చొక్కామీద నుంచి ధ్యాసమరల్చి, సూదీదారం అవతలపెట్టేసి ఇలాఅంది : "నేనేం చేయగలను? దీనిలోంచి నీవే యేదోమార్గాన ఇవతల పడాలి! ఇంతకూ యీ స్వప్నం అర్థంయేమిటో-యేంజరుగుతుందని నీ వనుకుంటున్నావో చెప్పు. అప్పుడు నీ కేదయినా సలహా యివ్వగలుగుతానేమో!"

తన ఆలోచనలన్ని విడమరిచి చెప్పటానికి తగిన అదును వచ్చిందని పీటర్ సంతోషించాడు. కుర్చీవెనుక గోడమీద తల ఆనించి నిదానంగా యిలా చెప్పాడు : "నాకూ స్పష్టంగా తెలియడం లేదు. మొదటిసంగతి, ఒకమనిషి అణగద్రొక్కబడినట్లయితే అతను ఇంతవరకు హేయంగా చూస్తున్నదాన్ని

ప్రాణంచేస్థితికి దిగజారుతాడు. అయితే ఈవిషయాన్ని అతను ఒప్పుకోకపోవచ్చు. నేను అనేక గందరగోళాలలో, లావా దేశాలలో యిరుక్కున్న మనిషిని. స్కూల్లో ఆ మతాచార్యుడు నన్ను బాధిస్తూ వుండేవాడు. అయినా నేను అతనిలో మంచి లక్షణాలకు నమస్కారం చేస్తూవుండేవాడిని. ఇటువంటివైఖరి సర్వసామాన్యమే కావచ్చు. తరువాత, నేను వేరేవ్యక్తిననీ, స్వంతగా నిశ్చయాలకు రావాలనీ-ఈ నిజాన్ని ఒప్పుకునే తేలిగ్గా ఒప్పుకోలేను. ఇతరులతో కలిసిపోవాలనీ సమిష్టిగా వ్యవహారించాలనీ అనుకోవటంలోనే నేను ఎన్నోసార్లు చిక్కులలో ఇరుక్కున్నాను. నాచుట్టూ వున్నవాళ్ళలో యేదో లోపించిం దనుకుంటూవుండేవాడిని. ఇంతకూ నే నెవరిని? నాకు సత్యంకావాలి. కాని నేను కనుగొన్న ప్రతిసత్యంకూడా సమాజంలో నిలువగలిగేదికాదు. స్వప్నంలో దేవుడుకూడా నానుంచి దూరం అయ్యాడు."

థెరెసా వింటూకూర్చుంది.

"నీవిప్పుడు ఏంచేస్తున్నావో తెలుసా? నీ కర్మ సిద్ధాంతాన్ని సమర్థిస్తున్నావు!"

అతనేమీ జవాబు చెప్పలేదు. ఆమే తిరిగి ఇలాఅంది: "స్వప్నం అంటే హెచ్చరిక!"

"హెచ్చరికా?"

"అన్నింటికంటే ముఖ్యమయిం దేమిటంటే-నీ తండ్రికి యేంజరిగింది అన్నవిషయం. నీవు అనాథబాలుడవు అన్న విషయం. వాళ్ళు నీ తండ్రిని చంపారు. అందుకనే వాళ్ళు నీ కంటికి సర్వశక్తియుతులుగా కనిపిస్తున్నారు."

ఇంకేమున్నా అనట్లుం చిలిపిగా వుంటుంది. "దాన్ని గురించి చెప్పటం ఆపివెయ్యి. సరే, స్వప్నం హెచ్చరికే అను కుందాం. నీ శక్తులే నిన్ను మేల్కొల్పుతున్నాయన్నమాట! నీస్వప్నం నాకు చెప్పటం మంచిదే అయింది. ఇంక ఎవరికీ దీన్ని చెప్పనవసరంలేదు!"

పీటర్ కూడా తను మంచిపనే చేశాననుకున్నాడు. థెరెసా మాటలు అతన్ని ఆశ్చర్యంలో ముంచాయి. ఏదో తనకు తెలిసినవిషయమే తిరిగి కనువిప్పు అయినట్లుంది. అయితే ఇంతకుముందు దీన్ని మాటల్లో పెట్టలేదు. ఇంతవరకూ తన స్వప్నానికి తండ్రితో సంబంధం వున్నదనుకోలేదు. ఇప్పుడు యీసమస్య సరికొత్తరూపంలో కానవస్తోంది. తను తండ్రిని కోల్పోవటమే తన నైరాశ్యానికి నిస్పృహకు కారణం! థెరెసా చెప్పిందేకనుక నిజం అయితే యీ కల కేవలం హెచ్చరికే. అయితే ఇందులో సిగ్గుపడవలసిందీ, దాచుకోవలసిందీ యేమీ లేదు.

ఇప్పుడు ఆర్టిమ్ అంటే తనకు ఇంత ఆకర్షణ యెందుకో మరింత స్పష్టంగా తెలుస్తోంది. సందేహాలలో మునిగివున్న తనకు తోడుగావచ్చే వ్యక్తి ఒకడు కావాలి. తన బాల్యంలో మాదిరే తను బాగా పెద్దచెట్టుకోసం వాంఛిస్తున్నాడు. ఆర్టిమ్ వృద్ధుడు. యుద్ధప్రమాదంలో బ్రతికి బయటపడ్డాడు – అంతేకాదు. వార్సా పరిసరప్రాంతంలోవున్న అతని యిల్లు కూడా సురక్షితంగానే వుంది. అయితే పీటర్ ఇంతవరకూ అతన్ని సందర్శించలేదు. అతనికి చాలా భయంగావుంది. ఆర్టిమ్ సోషలిస్టు సమాఖ్యకు చెందినవాడు. అతనలా ఒంటరిగా మిగిలి

పోవటానికి కారణం బహుశ అతని పేరు ప్రఖ్యాతులే కారణం అయివుంటాయి. పీటర్ బారుగాడగ్గర చేరబోతున్నాడు. వాళ్ళతో విదేశపర్యటనలకు పోబోతున్నాడు. ఈ పరిస్థితులలో తనకు ఆర్టిమ్‌తో పరిచయంవున్నట్లు బయటపడటం మంచిది కాదు. అందుకనే యిన్నాళ్ళూ ఆగాడు. కాని యివాళ థెరెసాతో మాట్లాడినమీదట, ఆర్టిమ్‌ను ఒకసారి చూచిరావా లనుకున్నాడు.

# 15

విస్టులా వేసవికాలపు ఎండలకు మండిపోతోంది. దాని జలం మురికిగావుంది. నదిపైన నగరంవుంది. సీల్ విశ్రాంతిగా అటుయిటు తిరుగుతున్నాడు. ప్రతిరోజూ అతనికిదొక ప్రత్యేక కార్యక్రమం అయింది. నగరవీధుల్లో తిరుగాడుతూ ఇదివరలో తను నివసించిన ప్రాంతాలు, తను స్నేహితులతో ఆడిపాడిన ప్రదేశాలు గుర్తుకుతెచ్చుకుంటున్నాడు. నగ్నశరీరుడై హాయిగా ఇసుకతిన్నెలమీద పవ్వళిస్తున్నాడు. అతనికి అమందానందం కలిగించే చర్యలలో ఇదొకటి. ఇటువంటి స్థితిలోనే అతని ఆలోచనలు నిలకడగా వుంటాయి.

అతను నింపాదిగా నదీగర్భంలో దిగాడు. ఈతకొట్టాడు, నీళ్ళలో తేలియాడుతున్నాడు, నదీప్రవాహం ఎటువుంటే అటే వెడుతున్నాడు. ఇలా ఆనందించటంలోనే అతని కేదో విధమైన విచారంకూడా వున్నట్లుంది. కాని దాన్ని పూర్తిగా తనలోనే అణుచుకుంటున్నాడు.

వార్సా తిరిగి వచ్చింతర్వాత, లోగడ ప్రాగాలో తనకు పరిచితుడైన ఒక రైల్వేఉద్యోగి యింటిలో మకాం పెట్టాడు. ఎలాగో ఒకలా జీవయాత్ర సాగించాలి కాని యిప్పటికే యిదే నమస్తోంది. డారెవిక్ అనే సోషలిస్టునాయకుడు రెండువందల డాలర్లు యిచ్చాడు. సీల్ తీసుకుందామనుకోలేదు. కాని డారెవిక్ యిది తన ధనంకాదనీ దీనితో యేంచేయాలో తనకు తెలియటంలేదనీ అందుకని సీల్‌ను తీసుకోమనీ బలవంతం చేశాడు. డారెవిక్ ముఠా సోషలిస్టులు, ప్రభుత్వంలో తమకు యివ్వబోయేపాత్ర కేవలం నాటకప్రాయమైనదనే అభిప్రాయం కలవాళ్లు.

సీల్‌కు కొత్తరకం జీవితం ఎటువంటిదో సుతరామూ తెలిసిరావటంలేదు. ఇంతకుముందు అతను తూర్పు ఆచార వ్యవహారాలు ఎరుగడు. సైన్యంనుంచి యింటికివస్తూ, యేదో కొత్త ప్రాంతానికి వస్తున్నట్లుభావించాడు. నాజీభయంతో గడిచిన అయిదు సంవత్సరాలలోను అతను యిలాంటి జీవితానికి అలవాటుపడ్డాడు. అతనంత లక్ష్యపెట్టలేదు. కాని పూర్వం తాను ఎగిరిన దానికంటే యిది భిన్నమయినది. కేంద్రసైన్యంలో పనిచేసిన నేరానికి తనను అరెస్టు చేయవచ్చును. అలా చాల మందిని చేస్తూనేవున్నారు. అయితే అతన్ని కళవళపరుస్తున్నది యీ విషయంకాదు. అందరికళ్ళల్లోను భయం విచ్చలవిడిగా అగుపిస్తోంది. ఈ భయం కొత్తది – ఏదో అనిర్వాచనీయమైనది. ఇప్పుడు జనమంతా పార్టీలో చేరుతున్నారు. ఉద్యోగాలు చేస్తున్నారు. ఏదో దివ్యమైన క్షణంకోసం ఎదురుతెన్నులు

చూస్తున్నారు. ఇప్పుడు సోషలిస్టులు నిర్వహించవలసిన పాత్ర ఎంతో గొప్పదనీ కమ్యూనిస్టులకు గుణపాఠం నేర్పాలని, నిజమైన జనసహాకారం తమకే ఎక్కువవుందని చూపాలనీ - ఒక సోషలిస్టుమిత్రుడు సీల్‌తో చెప్పాడు. అతన్నికూడా ఏగల్ పార్టీలో చేరమన్నాడు. కొంతసేపు ఆలోచించి సీల్ చేరనని బదులుచెప్పాడు. తన రైల్వేమిత్రుడు కమ్యూనిస్టుపార్టీలో చేరాడని తెలుసుకుని హాయిగా నవ్వుకున్నాడు; సంతృప్తి పడ్డాడు.

సీల్‌కు యిప్పుడెంతో తీరికవుంది. ఏంచేయాలో తోచటంలేదు. పాతనగరశిథిలాలను చూచిరావాలని చాలకాలంగా అనుకుంటున్నాడు. అయితే అక్కడికి ఒంటరిగా వెళ్ళటమంటే భయంవేస్తోంది. ఈమధ్య ఒకస్నేహితుడితో మాట్లాడుతూ వుండగా, గిల్‌ప్రసక్తివచ్చింది. అతను వార్సాలో వున్నాడని తెలిసింది. సీల్ స్నేహితుడిని అడిగి గిల్‌చిరునామా తీసుకున్నాడు.

ప్రొఫెసర్ గిల్ యిప్పుడు దూరంగా దక్షిణప్రాంతంలో వుంటున్నాడు. అతని యింటికి వెళ్ళాలంటే వార్సానగరమంతా దాటివెళ్ళాలి.

ఒకరోజు గుంపుగా చేరివున్న యువతీయువకులను చూచాడు. వాళ్ళంతా పూర్తిగా నగ్నంగా వున్నారు. వాళ్ళు చీట్లపేక ఆడుతున్నారు. వాళ్లు సాంఘిక ఆచారాలను కట్టుబాట్లను నైతిక విలువలను పూర్తిగా విసర్జించారు. సీల్ వాళ్ళనందరినీచూచి ముందుకు వెళ్ళటానికి జంకాడు.

# 16

ఆర్టిమ్‌ను రెండవసారి చూడటానికి వెళ్ళినప్పుడు, పీటర్ ఒక నూతనవ్యక్తిని కలుసుకున్నాడు. ఇద్దరూ పరస్పరంగాఢంగా చూచుకున్నారు. పీటర్ చికాకుపడ్డాడు. ఆర్టిమ్‌ను కలుసుకోవాలంటే, ఒంటరిగా కలుసుకోవటమే మంచిది!

ఆర్టిమ్ ఇతని అవస్థను అర్థంచేసుకున్నాడు.

"మీరు పరిచయం చేసుకోవటం అవసరం. ఇద్దరూ ఒకళ్ళనొకళ్లు నిస్సందేహంగా నమ్మివుండవచ్చు. ఇద్దర్నీ ఇక్కడ కలుసుకుంటున్నానంటే - నాకు మీ ఇద్దరిలోనూ పూర్తి విశ్వాసం వున్నదన్నమాట. ఇతను సీల్ సివోస్కి—విప్లవంలో పాల్గొన్నవ్యక్తి. ఇతను క్వింటో—రష్యానుంచి తిరిగివచ్చాడు?

ఆర్టిమ్‌కు తెల్లని గడ్డంవుంది. అది ఎముర్రొమ్ముమీద ఆనివుంటుంది. దుర్బలులుపోట్లాడినట్లు అతను అమిత నిదానంగా నింపాదిగా మాట్లాడుతాడు. రాజకీయజీవితంనుంచి విరమించుకుని ప్రశాంతంగా కాలంగడుపుతున్నాడు. జారుపాలనపట్ల శ్రామికుల తిరుగుబాటుకు అతడొక ప్రత్యక్షసాక్ష్యం. ఆర్టిమ్ ఇంట్లో గోడలకు ఆనుకునివున్న బీరువాలలో దాదాపు ఇంటి కప్పువరకు పుస్తకాల వరుసలు పేర్చివుంటాయి. వాటిమధ్య కూర్చుంటే పీటర్‌కు సత్యము, నిష్కల్మషము తప్పనిసరి అయిన సీమలో కూర్చున్నట్లువుంది. చెల్లాచెదురుగావున్న ఈ ద్వీపాలు-తన తల్లి, థెరెసా, ఆర్టిమ్-తన ఉనికికి తప్పనిసరి. అయినప్పటికి తన వ్యక్తిగత వాదనలలో ఆర్టిమ్‌నుంచి సహాయమేమీ పొందలేకపోతున్నాడు. వృద్ధుడు చెప్పేదానిలో ఏమీ

కరుకుదనం లేదు, లేక అతని నిరాశావాదపు టభిప్రాయాలు అందరిమీదా రుద్దటానికి ప్రయత్నిస్తున్నట్లూ లేదు. ఆయన మృదుమధురశైలి, భాష – వినేవాళ్ళను మరో ప్రపంచానికి తీసుకుపోతాయి.

"పదహారో శతాబ్దంలో ఇంతకంటే మూర్ఖమయిన పోరాటాలు జరిగాయి క్రైస్తవుడన్నవాడు ఉద్యోగానికి అర్హుడా అనర్హుడా అన్నవిషయం పెద్ద మీమాంసగా వుండేది. ఎందుచేతనంటే ప్రతి వుద్యోగం శక్తితో సంబంధంవున్నదే! తరువాత, మనం జాతులూకు వ్యక్తులపట్ల దాక్షిణ్యంగా ప్రవర్తించాం. కాని మన ఆదర్శంమటుకు దాక్షిణ్య రాహిత్యమే. ప్రజాసేవ ఎవరు బాగా చేస్తున్నారో ప్రజలే నిర్ణయించుకుంటారని మనం విశ్వసిస్తున్నాం. ఈరోజున మన ప్రజలు – జాతీయతా కారణంగా – ఈవాన్ అనుయాయులను వ్యతిరేకిస్తున్నారు. కాని మన చర్యల ఛాయ, తన స్వప్నాల ఫలితం, అంతా అణగద్రొక్కబడలేదా? మార్క్స్ ఎప్పుడూకూడా– నిజాన్ని గ్రహించటం, సత్యాన్ని తెలుసుకోవటం అనేవాటిని బలవంతంగా శక్తియుతంగా ఆపుచేయమని చెప్పలేదు. మఖాస్కి అనే ఒకవ్యక్తి వుండేవాడు; బహుశ మీరు అతన్ని యెరగరనుకుంటాను. మా సోషలిస్టు కూటమిలోవాడే. చాలా కాలంక్రితం, నా చిన్నతనంలోమాట. జారు ప్రభుత్వం అతన్ని సైబీరియాకు వలస పంపించింది. అతను ఒకేఒక చిన్నపుస్తకం వ్రాశాడు. అందులోనే తన సిద్ధాంతాన్ని వ్యక్తీకరించాడు. అది రష్యనుభాషలో వుంది. అతని ఉద్దేశ్యప్రకారం, శ్రామికుడు విప్లవం లేవదీస్తున్నాడంటే – ఈ విప్లవం నిజంగా విజ్ఞాన

వంతులయిన వారిచేత, సాంఘికవ్యవస్థలో తమస్థానాన్ని నిలుపుకోవటంకోసం – జరుపబడుతోం దన్నమాట. ఇందులో సత్యం వుంది; రష్యా మేధావుల పరిస్థితి చూడండి! లైంగిక అనుబంధంలాగ ఒకళ్ళవెంట ఒకళ్లు పరుగెత్తుతున్నారు. వెనుకబడిన దేశాలు, ఇండియా – చైనాల వంక చూడండి. అక్కడి ప్రజలకు యేమీ అభిరుచిలేదు. మనిషి కాస్త చదువు నేర్చుకుని, జ్ఞానం రుచిచూచి, విశ్వవిద్యాలయస్థాయికి వెళ్ళాడంటే – ఒక స్టాలిన్‌లా రూపొందుతాడు; స్టాలిన్‌పథంలో నడుస్తాడు. ఇదే మంచిదిగాను శ్రేయస్కరంగాను కనిపిస్తుంది. ఇది ఇరవయ్యో శతాబ్దం మహాత్మ్యం. అంచనాలలో ఇది సజావుగానే వుంది తర్కానికి నిలబడితే, దీన్ని ఎందుకు ఆచరణలో పెట్టగూడదు?”

ఆర్టిమ్ సోషలిస్టులనుకూడా తేలికగా వదలలేదు. “మీకు ఇదంతా చిన్న మతచరిత్రలా వుంటుంది. నాతరంలో వాళ్ళకు వివాదానికి ప్రాతిపదిక – సోషలిజము, స్వాతంత్ర్యము కావాలనేవాళ్లు ఒకపక్షం! సంయుక్త జారు రాజ్యంనుంచి రష్యాను వేరుచేయటానికి సమ్మతించని రోజా లక్సెంబర్గ్ వంటివాళ్ళు మరోపక్షం! అయినా యీ దేశాలు అలాగేవున్నాయి. యుక్రెయిన్, జార్జియా ఇందులో చేరిపోయాయి. ఇక పోలండులో పరాజయం. ఇక్కడ అంతర్జాతీయత బలిపెట్టబడింది. బోల్షివిక్కుల కొత్త జారిజమ్ మనకు సజావుగా తోచింది. జాతీయ సమైక్యతను అంగీకరించటంలో మనకు మనమే కూల దోసుకున్నాము. పందొమ్మిదో శతాబ్దంలో పుట్టిన సోషలిస్టు పార్టీ రాజకీయాల తుదిని చూడటానికి నిలిచివుంది. యుద్ధానికి పూర్వం సోషలిస్టులు యేమి చేస్తుండేవాళ్లు? నియంతృ

త్వపు రోజుల్లో, జాతీయం ఉన్మాదపురోజుల్లో, తిరుగుబాటు రోజుల్లో – వీళ్ళంతా యేంచేస్తూ వుండేవాళ్లు? వెనకటి నాయకుల విజయాన్ని పరాజయాన్నికూడా ఇప్పుడు మనం చూడగలుగుతున్నాం. ఇప్పుడు కొత్తరకం కళ్ళజోడు వచ్చింది– కొత్త “లీగల్ పార్టీ!”. ఇదీ సోషలిస్టు సమాఖ్యలోనిదే. ఇది కేవలం తిరోగమనానికే సోపానం. నామటుకు నేను, దీనితో చేతులు కలపను!”

ఆర్టిమ్‌ను సలహా అడిగి యేమీ ప్రయోజనంలేదు. “వ్యక్తిగతవిలువల నిర్ణయించటానికి యేమయినా కొలబద్ద వున్నదా? ఆయుధాలు ధరించి కమ్యూనిస్టులను చంపుతూ వుండటం క్రైస్తవుల విద్యుక్తధర్మమా? తన దేశాన్ని ప్రేమిస్తున్నట్టు, రష్యన్‌జమిందారుల అడుగుజాడలలో అందరూ కూడా పారిస్ చేరుకుని టాక్సీలు నడుపుకుంటూ కూర్చోవాలా? జరగని దానికోసంఆశపెట్టుకుని యెదురుచూస్తూ కూర్చోవాలా?”

—పీటర్ అతని అభిప్రాయాలతో యేకీభవించలేకపోయాడు. కాలప్రమాణమే ముఖ్యమైన దన్నాడు. కాలం – మార్పు ఆలస్యంగా పరిణమించేట్లయితే యిలా అనుకోని ధర్మసూత్రాలన్నీ ఆవిర్భవిస్తాయి. కొత్తపద్ధతులు కొత్త వ్యాపకాలు అని పంథా వేసుకున్న కమ్యూనిస్టుపార్టీయే ఎన్నో మార్పులకు గురికావలసివచ్చింది.

ఆర్టిమ్ తల అడ్డంగాఊపాడు. అతని పొడుగైనచేతులు మోకాళ్ళమీద ఆనివున్నాయి.

“నాకు ప్రవక్త నవుదామని అభిలాష లేదు. కొన్ని సంవత్సరాలపాటు కొంతమంది జనం యీ ఆటలో గెలుపొంద

వచ్చు. నాకు యుక్రెయిన్ చరిత్ర తెలుసు. నామాట వినండి, పరిస్థితులన్నీ మొదట్లో యిలాగేవుంటాయి.

"నేను సోషలిస్టులపక్షంచేరి వాళ్ళతో రాజీని కాదంటున్నానంటే, అంతకంటే నరకమార్గం లేదుకనుక! నా జీవితానుభవం చెబుతున్నది యిదే! కావాలంటే నన్ను ఖైదు చేయమను. ఏమయినా నాకింకా ఎక్కువ ఆయుర్దాయంలేదు. అయినా అదికాదు విషయం. ఎలా ప్రవర్తించాలి ఎలా వ్యవహరించాలి అనే విషయమై ఎవడికివాడే తన అంతరాత్మతో చర్చించి తేల్చుకోవాలి. ప్రతీకారవాదులంతా తాము చేసిన దాన్ని మర్చిపోతారు. వాళ్ళ లెక్కలో, కేవలం తన డబ్బు కోసం ప్రాకులాడేవాడు అమాయకుడు. ఈరోజు ప్రతివాళ్ళూ బాగా ఆలోచించుకుని వ్యవహరించాలి!"

ఆర్టిమ్‌ను వదలి ఇద్దరూ ఒంటరిగా బయటకు వచ్చాక, ఇంతవరకూ ఏమీ మాట్లాడని సీల్ "మనం ఎవరినీ నమ్మటానికి వీల్లేదు, మనం ఒంటరివాళ్ళం" అన్నాడు. పీటర్ అర్థంచేసుకొన్నాడు. తనుకూడా ఆర్టిమ్‌మాటలు వింటూ ఇటువంటి నిరాశా నిస్పృహాలనే పొందాడు. జులియన్ హాల్‌సెర్న్ చెప్పినట్లు యీవాదం, ఆకాశయానం చేస్తున్నరోజుల్లో ఎద్దుబండి మీద ప్రయాణంచేసినటువంటిది!

పీటర్ తనసుతాను మెరిగించుకోవటానికి ఆమర్దా పడలేదు. ఎంత ఆంతరంగికమిత్రులతో చెప్పిన సంగతులయినా తెలియకూడని వాళ్ళ చెవులలో పడతాయని అతనుఎరుగును. ఆర్టిమ్ తనను దగ్గరకుచేర్చి సంభాషణలో పాల్గొననిచ్చాడంటే

తనను ఆత్మీయుడుగా భావించా డన్నమాట! అప్పటినించీ అతను సీల్‌తో స్నేహంచేయ నారంభించాడు. ఏమయినా తన కంటే చిన్నవాళ్ళతో స్నేహంచేయటం కష్టమే. ఆదీగాక తనే ఇప్పటికి చీకట్లో తడుములాడుకుంటున్నాడు. సీల్ కూడా ఇంకా అసహాయస్థితిలో వున్నాడు. అతను వేస్తున్నప్రశ్నలు చిన్న పిల్లలు వేస్తున్నవిగా వున్నాయి. పీటర్ తన రహస్యానుభవా లనుగురించి చెప్పవలసి వచ్చినప్పుడు గుటకలు మింగుతూ ఒక్కొక్కమాటే పలుకుతున్నారు. సీల్‌కూడా తన వ్యక్తి గత విషయాలు వివరించలేదు. తన భార్యనుగురించి చెప్పనే లేదు. దండయాత్రప్రసక్తి వచ్చినప్పుడు అతను మౌనం వహి స్తున్నాడు. ముఖం గంభీరత తాలుస్తోంది. ఆర్టిమ్‌తోటి సంభా షణ అతనికేమీ ఉత్సాహజనకంగా లేదు. ఏదో అంతర్గత చర్య జరుగుతోందని అతలికి దృఢనమ్మకంగావుంది. ఇంకా ఎన్నాళ్ళకు అటువంటిచర్య బయటపడగలదోకూడా అతను చెప్పలేదు.

వేసవి దాదాపు పూర్తికావస్తోంది. ఒకరోజు, సీల్ పీటర్‌తో తనకొక సమస్య వున్నట్లు చెప్పాడు. అది ఇది! డా రేవిక్ విదేశాలకు పారిపోవటం ఎంతో అవసరం. పశ్చిమ తీరంలో అరాచకంమూలంగా జర్మనీకిపోవటం సులభంగా వుంది. కాని ఇందుకైనా అధికారపత్రాలు కావాలి. పీటర్ నాజీలరోజుల్లో డా రేవిక్ పాత్రనుగురించి పూర్వం గొప్పగా వినివున్నాడు. పీటర్ ఓడర్ ప్రాంతంలో సంచరించి కొన్ని వ్యాసాలు వ్రాయడంకోసంగాను, యిటీవలనే – సరిహద్దు

ప్రాంతంలో నిరభ్యంతరంగా తిరగడానికి అధికారపత్రాలు తెప్పించుకున్నాడు. వాటినితీసి సీల్‌కు చూపాడు.

"వీటిని తీసుకో. వేరుమార్చుటంవరకు గుర్తుంచుకో. నన్ను ఎవరయినా అడిగితే ఈ కాగితాలు ఎక్కడో పార వేసుకున్నా నంటాను. కాని రహస్యాలు వీటినిగురించి ఆచూకీ తీయకుండామటుకు జాగ్రత్తపడు" అన్నాడు.

తీరా అధికారపత్రాలు సీల్‌కు ఇచ్చినతర్వాత తను చేసినపని అవివేకమైనదని తోచింది. "నీకు స్నేహితులు వున్నంత కాలం నీవు ఆపదనించి సురక్షితుడవు కావు" అన్నవాక్యం ఊరికే చెప్పబడలేదు.

# 17

ఇంతవరకు తను చూచిన అన్ని జైళ్ళలోనూ మైకేల్ ఒక్క మర్యాసనకు తప్ప తతిమ్మా అన్నిటికీ అలవాటుపడ్డాడు.

వోలిన్ మందపాటి పైలును తెరుస్తూ "మైకేల్! మాకు నిన్ను గురించి అంతా తెలుసు. జాతీయసైన్యంలో నీ విభాగాలు జర్మనీసైన్యంతో వెళ్ళిపోయాయి. నీ చలాకీతనాని కంతటికీ ఇదీ ఫలితం! దండయాత్ర తరువాత నీవు జర్మన్ల వాత పడకుండా ఎలా తప్పించుకున్నావు?" అనడిగాడు.

"నాకు జర్మనీకి బానిసగా పోవడం ఇష్టంలేదు. కనీసం యుద్ధఖైదీగా వెళ్ళటమైనా ఇష్టంలేదు. ఒక గుంపులోచేరి వార్సాకు బయలుదేరాను. నాకు తెలిసిన డాక్టర్లు కొందరు సహాయం చేశారు." మైకేల్ మోకాళ్ళమీద చేతులు

అనించుకున్నాడు. అతను అడిగితే చెప్పడంకోసం కొన్ని పేర్లు కల్పిస్తూ ఆలోచిస్తున్నాడు.

"తరువాత?"

"కొన్నాళ్ళు పాడ్కోవా వెస్నాలో వున్నాడు. వలస పోవటమన్న ఆలోచన నాలో ఆవేదన రేకెత్తించింది."

అది నిజమే. అతని రాజకీయసోదరులు రష్యనులు వచ్చేలోపుగానే తనను పశ్చిమానికి చేరవేయాలనుకున్నారు. చచ్చిపోయాడని భావించబడుతున్న ఫాదర్ ఇగ్నాషస్ తనను వాస్తవికత కోల్పోయినందులకు శపిస్తున్నట్లు అనిపించింది. ఆయన ఆలోచనప్రకారం వెంటనే మరో కొత్తయుద్ధం జరిపించాలి. ఇందుకోసమే ఆయన ప్రేగ్‌కు వియన్నాకువెళ్లాడు.

"ఎందుకని?"

మైకేల్ ఆలోచనలో పడ్డాడు.

"నా అంచనాలకు వ్యతిరేకం అవుతుంది కనుక. బ్రిటను మీద అమెరికామీద ఆధారపడి మన మేమీ చేయలేం. వాళ్ళపాలిటికి మనం వ్యాపార కేంద్రాలం మటుకే. ఈ వ్యాపారస్థుల ప్రజాస్వామ్యం అంటే నాకు చిన్నప్పటినుంచి గిట్టదు."

"అయితే నీ పరాజయాన్ని నీవు అంగీకరిస్తావా?"

మైకేల్ తల పైకెత్తి చూచాడు. ఇద్దరి చూపులూ కలిశాయి.

"నీ పరాజయం వస్తుంది. నీవూ నేనూ ఎదురుచూడని దిక్కునుంచి వస్తుంది."

దీపం వెనుక నిల్చున్నవ్యక్తి సిగరెట్టు ముట్టించాడు. మైకేల్ ఆశగా తనవంకవస్తున్న పొగను పీలుస్తున్నాడు. అతను

అగ్గిపుల్ల పారేస్తూ ఇలా అన్నాడు: "వెర్రివాడా! మధ్య యుగాల పునరుజ్జీవాన్ని గురించి కలలు కంటున్నావు. నాకు తెలుసు. ఎవరిపని వాడు, ఎవరివృత్తి వాడు చేసుకుంటారని ఆశిస్తున్నావు!"

ఎవరీవ్యక్తి ?– అని ఆశ్చర్యపోయాడు మైకేల్. తన లాంటివాళ్ళు ఎందుకు ఇతన్ని కొలవాలి? అతని ఉచ్చారణ స్పష్టంగా వుంది. అతను పళ్ళు బిగబట్టి కోపంగా "పరిస్థితులు సరిచేయటం తేలికయిన పనికాదు. రక్తం కావాలి – రక్తం" అన్నాడు.

మైకేల్ ఒక్క క్షణం మిన్నకుండి ఇలా అన్నాడు:

"స్వశ్రమ పాలనకోసం మీ వాంఛకూడా నా వాంఛ కంటే తక్కువ వెర్రిదేం కాదు. దానికీ రక్తంకావాలి!"

ఆ మనిషి యీ జవాబుతో తికమకపడ్డాడు. అతని పెదవులు సంతృప్తి నవ్వుతో మెలికలు తిరిగాయి.

"అయితే మాకు నీకు పోలికలు వున్నాయన్న మాట!"

మైకేల్ తల ఊపాడు.

"నేను మార్క్సిస్టును కాను."

వోలిన్ నింపాదిగా – "నిస్సందేహంగా కాదు. విదేశ పెట్టుబడిదారులను చెదరగొట్టి, స్వదేశ పెట్టుబడిదారులను ప్రోత్సహించమంటున్నావు. మేం అంతకు పైచర్యే తీసుకున్నాం."

"మిమ్మల్ని అందరూ అసహ్యించుకుంటున్నారు. బల వంతపు ఒప్పందల నిజమైన అంగీకారం ఎలా అవుతుంది?"

"ఓహో! నీవు డబ్బంతా దేశరక్షణకోసం వ్యయ

వరుస్తా నంటావు. అయితే యీ దేశపు బాగోగులకు బాధ్యు డయిన రాజకీయవేత్తకు నీవు ఇచ్చే సలహా కేమిటి? మా పద్ధతిలో కుట్రలకు అవకాశంలేదు. ఆ సంగతి నీకూ తెలుసు. మేం మళ్ళీ రైల్వేలను, ఫ్యాక్టరీలనూ నడుపుతాం. మేం తిరిగి పశ్చిమసరిహద్దు ఆక్రమించుకున్నాం. ఈ భూమినంతా రక్షిం చేది మేమేగా!"

మైకేల్‌కు చికాగ్గా వుంది.

"మీరే హత్యలను దోపిడీలను ప్రోత్సహించారు. మీ ఆలోచన వేరు. ఆచరణ వేరు.

వోలిన్ తనచేతిలోని కాగితాలు అటు యిటు తిప్పు తున్నాడు.

"నీ ప్రయత్నం ఫలవంతమయ్యేట్లే వుంది. యుద్ధానికి ముందు హాంబర్గ్ వెళ్ళావు. కాంట్రాక్టులకోసం. జర్మన్ ఇటలీ లలో చరిత్రస్థంభాలు చిరస్థాయిగా వున్నా యనుకున్నావు. ముసోలినీ వ్యాసాలు ప్రచురించావు. తర్వాత జర్మన్లతో పోరాడావు. ఇది పైకిచుటుకే. వామపక్షీయులను, యూదులనూ రక్షించటానికి జర్మన్లను ఉపయోగించుకున్నావు. లండన్ గవర్నమెంటులోకూడా కొందర్ని కొనేశావు. మేం యిదంతా సక్రమమార్గంలో పెడతాంలే!"

"నేనెప్పుడూ అవివేకులు చేసిన హత్యలను ఆమో దించలేదు."

"యూదులను దాచటానికికూడా ప్రయత్నించావుగా–" అంటూ అతను ఫైలు మూసివేసి "నీవు యింతచేసినప్పటికీ

మేం నిన్ను వదిలివేయవచ్చు. అది పూర్తిగా నీమీదే ఆధారపడి వుంటుంది. మా షరతులకు నీవు అంగీకరించటాన్ని బట్టి వుంటుంది." అన్నాడు.

"ఏమిటి మీ షరతులు?"

"మరేమీ ఎక్కువకావు. మాకు నీ విలువ పూర్తిగా తెలుసు. మేమేం నిన్ను ప్రవాసం పొమ్మనం. ఒకటే షరతు. నీవు ఇప్పుడున్న రాజకీయ పరిస్థితులలో రాజీపడి, ఇకముందు హత్యలు జరగకుండా మాకు సాయంచేయాలి. మేం నీకు పత్రిక నడుపుకోవటానికి హంగులన్నీ యిస్తాం."

"నాషరతుకు మీరు అంగీకరిస్తే, అట్లాగే!"

"చెప్పు."

"ప్రస్తుత పరిస్థితులను గుర్తించటం, నా దోషం కాదు. అది వాస్తవిక పరిణామం మరోమాట, నేను మీ తాత్త్వికతను ఆమోదించను, ఆ విషయం స్పష్టంగా చెబుతాను. నేను కాథలిక్కును!"

ఇద్దరికీ చాలసేపు మతాన్ని గురించి రాజకీయాన్ని గురించి రెంటికీవున్న సంబధాన్ని గురించి వాగ్వివాదం జరిగింది. చివరకు వోలిన్ యిలా అన్నాడు: మనం యిప్పుడు ఒక యేర్పాటుకు రాగలగడం కేవలం కాకతాళీయంగా జరగలేదు. నీవు ప్రపంచాన్ని మరమ్మత్తు చేయాలనుకుంటే, దానికి పార్లమెంటరీ వ్యవస్థలో అస్థిరతను ఆసరాగా తీసుకోలేవు. కొద్దిరోజుల్లోనే నిన్ను వదిలేస్తాం. కామ్రేడ్ బారుగా యిప్పుడు

ముద్రాపకసంస్థ వ్యవహారాలు చూస్తున్నాడు. ఆయనే నీకు ఒక పత్రికయిచ్చి, దాని ముద్రణయేర్పాట్లు చూస్తాడు.

# 18

ఆశ్వికులు కళ్ళెలులాగి గుఱ్ఱాలను ఆపారు. కిందుగా వారికి కైవశం అయినభూమి - విశాలమైనభూమి - కనిపిస్తోంది. సూర్యకాంతికి మిలమిలలాడుతున్న నదీ తలాలు చూస్తున్నారు. వాళ్ళు లోయలలో మనుష్యులు వస్తున్నారు, వెడుతున్నారు. గుండ్రని కొండలమీద కోటబురుజులు ఎత్తుగా ఆకాశాన్ని అంటుతున్నట్లున్నాయి. ఈ కోటలలో నుంచే పరిపాలన సాగుతుంది. ఎక్కడెక్కడ కొత్తనగరాలు, వంతెనలు, శిలావిగ్రహాలు కడతారో ఒకోళ్ళకొకళ్ళు చూపుకుంటున్నారు. వాళ్ళు ఒక్కసైగచేస్తే ఎందరో శ్రామికులు పని కొనసాగిస్తారని వాళ్ళకు తెలుసు. అర్ధనగ్నులైన కార్మికులు చెమటోడ్చి రాళ్లు రప్పలుమోసి మట్టిబండ్లులాగి కట్టడాలు పూర్తిచేస్తారు కష్టార్జితంతో కడుపునింపుకుంటారు. అర్థంలేని బ్రతుకులు వెళ్ళదీస్తారు. నిర్వివాదంగా పరిపాలనకు తల వొగ్గుతారు.

జులియన్ మళ్ళీ తన పాతస్నేహితుడు పీటర్‌తో కలిసి తిరుగుతున్నాడు. థెరెసా మటుకు అతన్ని విశ్వసించటంలేదు, అయిష్టం చూపుతూనేవుంది. అతను సీల్‌ను కలుసుకోవటం మానేశాడు. డారేవిక్ విదేశానికి వెళ్ళటంలో కృతకృత్యుడైనాడు. జులియన్‌సుఖాన్ని గురించి-చరిత్ర సంగీతాన్ని వింటున్న

ప్రజలకు అనుభూతమయే – సుఖాన్ని గురించి మాట్లాడు తున్నాడు. జులియన్ వర్గంలో చేరటంవల్ల పీటర్‌కు ఆదరం ఎక్కువయింది. అతనికి భద్రత కావాలి. జులియన్ దాన్ని అత నికి అందించాడు. పీటర్, గతంలో తనుచూచిన దానికీ, ఇప్పుడు చూస్తున్నదానికీ కంగారుపడిపోయి, కేవలం చరిత్రకు కట్టుబడివుండే జనానికి తనకు మధ్య తారతమ్యంకోసం వెదుకు తున్నాడు. జులియన్ మాటలతో యేర్పడ్డ దృశ్యంలో రైతు బిడ్డడిని తల్లినించి వేరుచేస్తున్నారు. తల్లి ఎక్కడో అగాధంలో పడిపోతుంది.

లోగడ పీటర్‌ను ఆర్టిమ్ దగ్గరకు తీసుకుపోయిన కాల మానం యిప్పుడు వ్యతిరేకమార్గంలో నడిపిస్తోంది. ఇదివరకటి కంటే తక్కువ విలువయిన వ్యాసాలు అనేకం వ్రాస్తున్నాడు. తీరా ఆశలన్నీ వమ్ముచేసుకున్నాక, పీటర్‌కు బారుగా ఒక శుభ వార్త చెప్పాడు : తాను పారిస్ పంపబడుతున్నాడని !

ఈ వ్యవస్థలో మనిషియొక్క నిజాయితీని నమ్మకాన్ని కొలవటానికి వేరువేరుమార్గాలు వుంటాయి. తరువాత, పీటర్ పారిస్ ప్రయాణానికి కొన్ని అడ్డంకులు వచ్చాయి.

జులియన్ అతనికి ధైర్యం చెప్పసాగాడు : "నీవు తప్ప కుండా పారిస్ వెడతావు. అదినీకు ఉపకరిస్తుందికూడా! ఇక్కడ నీవు చేయవలసిన పనేమీలేదు. ఎవరూగూడా బూటకపు రాజ్యాన్ని ధారాదత్తం చేయరు. నీవు మాతో వున్నావు కనుక నీకు అన్ని అవకాశాలు యిస్తాం. డబ్బుకు, పుస్తకాలకు,

ప్రయాణానికి యేమీ ఇబ్బందిలేదు. నీఅంతట నీవే చూస్తా వుగా! ప్రయాణం చేయాలనివుంటే తప్పకుండా చేయవలసిందే! ఇక్కడికంటే అక్కడే నీకు పరిస్థితులన్నీ స్పష్టంగాకనిపిస్తాయి.''

కాని ఆశ అతన్ని కుంగదీస్తోంది. ఎన్నో అణగారిన కోరికలు తిరిగి మొలకలెత్తుతున్నాయి. పాతజీవితం పునరా వృత్తం అవుతోంది. 1939 లో తను పారిపోవటానికి ఎంత బాధపడ్డాడో యిప్పుడూ అంతగా నేవుంది.

గొప్ప కులంలో పుట్టటంకన్నా, ప్రమాదాన్ని తప్పించు కునేందుకు – ఈ భయంకర ప్రపంచంలో యేదైనా మార్గం వుందా ? ఊరికే కొండకొసన నిలబడి కనుచూపుమేరంతా నాదేనని అరిచినంతమాత్రాన విజయులక్ష్మి వరిస్తుందా ? పీటర్ యీ ఆలోచనలను తోసిరాజు అనలేదు. అతను అవ కాశంకోసం వేచివున్నాడు.

ఇంతలో అతనికొక వార్త అందింది: పారిస్ రాయబార వర్గంలో వింటర్ రెండవ కార్యదర్శిగా నియమితుడైనాడని.

## 19

శిథిలమైన నగరాలను పునర్నిర్మిస్తున్నారు. లెక్కలేనంత మంది కూలీలు–మగవాళ్లు, ఆడవాళ్లుకూడా–పనిచేస్తున్నారు.

సీల్ ఇప్పుడు వార్సానగర శిథిలాలలోపనిచేస్తూ కాలం గడుపుతున్నాడు. అన్నీ చిన్నతనంలో ఎరిగిన ప్రదేశాలే. కాథ రైన్, తను కలిసి తిరిగినచోట్ల ఇప్పుడు తా నొక్కడు పార,

పలుగులతో పనిచేస్తున్నాడు. మధ్యాహ్నంపూట పనివాళ్ళు అందరితోపాటు చెట్లకింద విరామంగా కూర్చుని ఉదయంఇంటి దగ్గర్నుంచి తెచ్చుకున్న ఫలహారం తింటారు. ఒక్కొక్కసారి ఎవరైనా ఒక వోడ్కాసీసా తెస్తూవుంటారు అప్పుడు అందరూ తలా ఒకగుక్క పుచ్చుకుంటారు. సీల్ వీళ్ళందరితోను కలిసి పోయాడు. కొత్త ప్రభుత్వాన్ని, పనివాళ్లు ఎంతగా తిడుతున్నా, పునర్నిర్మాణం మటుకు ఆవశ్యకమే అంటున్నారు. ఏరోడ్డు ముందుగా వేసేది, యేవంతెన ముందుకట్టేది, యేవీధికి ముందు దీపాలు, కొళాయిలు ఇచ్చేది–ఇటువంటివన్నీ చర్చిస్తున్నారు. సీల్ యీజనంతోనే వుండిపోవా లనుకున్నాడు. ఈరకంగా శరీరకష్టంతోనన్నా పాతపాపాలు హరించిపోతాయనుకున్నాడు ఇంకేపని చేద్దామన్నా అంతా మోసమే. డారెవిక్ విదేశాలకు వెళ్ళటంలో కృతకృత్యుడు అయినందుకు సంతోషించాడు. డారెవిక్ ఒక్కడే తమ వ్యవస్థయొక్క సిద్ధాంతాలు పట్టుకు పాకులాడుతున్నవాడు. అతని పోకతో అన్నిబంధాలు సడలి నాయి, అందరూ తలకొకదారిన వెళ్ళిపోయారు. ఆర్టిమ్ మరీ వృద్ధుడైపోయాడు. పీటర్‌తో ఎక్కువచనువుగా వుండలేకపోయి నందుకు సీల్ తననుతనే నిందించుకున్నాడు. పీటర్ తనను చూడకుండా వుండటం కేవలం తన దురదృష్టమే ననుకున్నాడు. అన్నికంటే తనహృదయానికి చేరువగా వచ్చేవాళ్లు ఎవరూ తనకు కలలోకూడా దొరక రనుకున్నాడు.

చీకటిపడుతూండగా కొత్తవంతెనమీదుగా ప్రాగాకు తిరిగివస్తాడు. రైల్వేమిత్రునిభార్య వడ్డించిన భోజనం ఆరగి

స్తాడు. పడుకుని ఏదయినా పృకృతి శాస్త్రంమీద గ్రంథం చదువుదామని ప్రారంభించి నాలుగు వాక్యాలయినా దొర్లకముందే నిద్రపోతాడు.

ఒక సాయంత్రం మెట్లవరుస ఎక్కుతున్నాడు. చిమ్మ చీకటిగావుంది. అక్కడ మరెవరోవున్నట్లు స్ఫురించింది. అతన్ని తప్పించుకుపోదా మనుకున్నాడు. ఇంతలో తన ముఖంమీద కాంతి ప్రసరించింది.

"క్షమించండి. మీరేనా సీల్? మాతో వస్తారా?" అని బొంగురుగా ఒక కంఠం వినిపించింది. దీపపు వెలుగులో ఇద్దరువ్యక్తులు అగుపించారు. పక్కయింటిముందు ఒక జీపు ఆగివుంది. దాని దీపాలు ఆర్పివేశారు. వాళ్లుముగ్గురూ బయలు దేరారు. మంచుకురవటం ఆరంభించింది. మంచు తెరలు సీల్ ముఖానికి చల్లగా తగులుతునాయి. బహుశ ఇదే తగిన పనేమో ననుకున్నాడు సీల్. ఏది ఏమయినప్పటికీ తన కేమీ ఫరవాలేదు. ఇంతకంటే ఏమీ అన్యాయంలేదు అనుకున్నాడు.

## 20

వోలిన్ కాగితాలవంక చూస్తున్నాడు.

"ఈ వ్యతిరేకపక్షపు సోషలిస్టులు చాల ప్రమా కర మైనవాళ్లు. వీళ్ళే మిగిలారు. ఓహో! డా రెవిక్ పారిపో ..ం, సీల్, కేంద్రసైన్యం. అతడు మనకు ఇప్పుడు అక్క ను. బహుశ తరువాత కావలసివస్తాడు. ప్రస్తుతానికి అతన్ని బందీ చేసివుంచండి."

వోలిన్ గది ప్రజాభద్రతాశాఖమంత్రి కార్యాలయా నికి ఎక్కువ దూరంలో లేదు.

వోలిన్ సహాయకుడు – కళ్ళద్దాలగూనివాడు –అతనికో కాగితాన్ని అందించాడు.

"పీటర్ క్వింటో? ఓహ్. ఇటివంటివాళ్ళను ఎప్పుడూ పోనివ్వగూడదని నేను చెబుతూనే వున్నాను. సీల్తో స్నేహంచేశాడా? బహుశ పారిపోవటానికే విదేశానికి వెడు తున్నాడేమో! ఈ రిపోర్టు మంచిసమయానికే వచ్చింది. దీన్ని వెంటనే అమలుజరపాలి!

క్వింటో ప్రయాణానికి అనుమతిస్తూ అతను బారుగాకు అవకాశం యిచ్చాడు. ఈ విషయంలో జులియన్ అభిప్రాయం అతనిపై ప్రభవించింది.

గూనివాడు– "ఇతనూ ముఠాలోవాడే. పారిస్ ఎంబా సీలో ఉద్యోగానికని వెడుతున్నాడు" అన్నాడు.

వోలిన్ వెంటనే టెలిఫోన్ అందుకున్నాడు. విదేశ వ్యవహారాల మంత్రిత్వశాఖను పిలిచాడు.

"వోలిన్ను – మాట్లాడుతున్నాను. మీ బృందం ఎప్పుడు పారిస్ వెడుతుందో చెప్పగలరా? ఇవాళేనా?... అప్పుడే విమానాశ్రయానికి వెళ్ళారా?...వాతావరణం బాగా లేదంటారా?... సరే, ఏమీ లేదులెండి. సెలవు."

"ఒక కారుతీసుకుని బయలుదేరు. వాళ్ళను ఫోనులో పట్టుకోలేం. వెంటనే విమానాశ్రయానికి వెళ్లు. పీటర్ క్వింటో ప్యాస్పోర్టు అడిగి తీసుకో. నిర్మొగమాటంగా ప్రవర్తించు.

అతన్ని బంధీచేయటానికి ఆధారం లేదనుకో, వెంటనే వెళ్లు. మంచుతుపాను మూలంగా విమానం అప్పుడే బయలుదేరదు."

ఆమనిషి గదిలోంచి వెళ్ళిపోగానే వోలిన్ దీర్ఘంగా ఆలోచిస్తూ ఒక చిన్న నక్షత్రం గీశాడు. ఆ తెలివితక్కువ బారుగాకు మరో నల్లమార్కు !

# 21

విమానాశ్రయానికి వెళ్ళేదారి ఎగుడుదిగుడుగా వుంది. గాలి జోరుగా వీస్తోంది. మంచు కురవటంమూలంగా పరిస్థితి మరింత భీభత్సంగావుంది. తుపానులో యేమీ కనబడటంలేదు. సోవియట్ సెంట్రీలు ఎర్రకాగితంమీద ముద్రించిన స్టాలిన్ బొమ్మధరించి తమ ఉద్యోగధర్మం నిర్వర్తిస్తున్నారు.

పాత దారులన్నీ పాడుబడ్డాయి. ఒక పొలం చివర చిన్న గుడిసెవుంది. దానిముందు విమానాశ్రయం.

ఇక్కడికి చేరుకున్నాక పీటర్ తన ప్రయాణం సజావుగా సాగుతుందన్న ఆశ కోల్పోయాడు. ఇంక కొద్దిగంటల్లో తను మరో దేశానికి వెళ్ళిపోతాడు– అన్నది యూరేషియా వైశాల్యాన్ని పరికించి చూస్తే అసత్యంగా గోచరిస్తోంది.

విమానాశ్రయం వద్ద ఇద్దరు సోవియట్ పైలట్లు టీ తాగుతున్నారు. పొయ్యిదగ్గర పోలిష్ దుస్తులు ధరించిన పని వాళ్ళు కూర్చున్నారు. జనం కొయ్యబల్లలమీద కూర్చున్నారు. అడపదడప నింపాదిగా మాట్లాడుకుంటున్నారు. వాళ్ళ ముఖాలలో భావాలు చూచింతర్వాత యిక్కడినించి పోవటం

దుస్సాధ్యం అనే అనుమానం స్పష్టతరం అవుతోంది. ఆడవాళ్లు చలికి వణికిపోతున్నారు. పీటర్ వింటర్ భార్యవంక చూచాడు. ఆమె చేతులు విపరీతంగా వణుకుతున్నాయి. వింటర్ నీరసంగా నేలవంక చూస్తున్నాడు. "ఈమనిషి జీవితాంతం యిలాగే నన్ను వెంటనంటి వుంటాడా యేం?" అనుకున్నాడు పీటర్. కిటికీవంక తిరిగాడు. బయట గాలి జోరుగా వీస్తోంది. ఇప్పటికే వాళ్ళు కొన్ని గంటలుగా అక్కడ వేచివున్నారు. ఇంతలో — వాతావరణ పరిశీలన కేంద్రమునుంచి వచ్చిన వార్తను గురించి ముగ్గురు రష్యన్లు బిగ్గరగా వాదించుకుంటున్నారు.

పీటర్ చాలాకొద్ది వ్యవధిలో విమానంలో ప్రవేశం సంపాదించాడు. ప్యాస్‌పోర్ట్ యిచ్చి మరునాడే విమానాశ్రయానికి చేరుకోమన్నారు. పారిస్ నగరానికి రోజువారీ విమానాలు లేవు. అందుచేత తను ప్రయాణం వాయిదా వేయటానికి వీల్లేదు. అతనికి తల్లిని ఒక్కసారి చూచిరావటానికి మటుకు వ్యవధిచిక్కింది. "నా ప్రార్థనలు దైవం ఆలకించాడు. నీవు క్షేమంగా వుంటావు నాయనా!" అంది తల్లి.

"తిరిగివస్తాను, అమ్మా."

"రావద్దు. నన్ను గురించి ఆలోచించకు. నాకోసం అవస్థలుపడకు. నిజాయితీగా బ్రతుకు, చాలు" అంది.

ఆమె కన్నీళ్ళతో అతని చెంపలు తడిశాయి. ఆమె రైలుస్టేషనుకువచ్చి అతన్ని సాగనంపింది. ఇంత హడావిడిగా వెళ్ళవలసి రావటంవల్ల, అదనుతప్పిపోతే యిక జన్మలో అవకాశం రాదేమోననిపిస్తోంది.

రష్యనులు దేన్ని గురించి వాదించుకుంటున్నారో వినదామనుకున్నాడు. పైలట్ ప్రయాణం ఆరంభిద్దా మంటు న్నాడు. విమానాశ్రయాధికారి వద్దంటున్నాడు. వాళ్ళ సంభాషణలో ముక్కలు వినదామని ప్రయత్నించాడు. ప్రయాణీకులు కాళ్లు వెచ్చచేసుకోవటానికి తాపత్రయపడుతున్నారు. పీటర్ బయటకువెళ్ళి పచార్లుచేస్తున్నాడు. మంచులో సరదాగా తిరుగుతున్నాడు. అప్పటికి మధ్యాహ్నం అయింది. మంచు దట్టమవుతోంది,

గుడిసె-తలుపు తెరుచుకుంది. చిన్న గుంపు విమానాశ్రయంవంక వడివడిగా నడిచింది. "జర్మనీవైపు ఆకాశం నిర్మలంగానే వుందిట!—" అంటున్నాడు ఒక ప్రయాణీకుడు, స్నేహితునితో. వాళ్లు విమానందగ్గరకు సామాను మోసుకు వెడుతున్నారు.

విమానం బయలుదేరింది. మంచును దూసుకుంటూ పైకిలేచింది. పీటర్ ముఖాన్ని కిటికీకి అదిమిపెట్టుకుని నేలవైపు చూస్తున్నాడు. శరీరంకదిలి కుదుపు ఆరంభమయినా విమానం బయలుదేరినట్లు అతనికి స్ఫురించలేదు. పైలట్ అంతా గుడ్డిగా పైకితీసుకుపోతాడా? వాళ్ళకు ఎదురుగా కూర్చున్న వింటర్ సతీమణి "జోసెఫ్" అని సున్నితంగా పిలిచింది. అంతే! వాళ్లు పూర్తిగా గాలిలో తేలిపోతున్నారు.

వాళ్ళచుట్టూ తెల్లని ప్రపంచం ఆవరించివుంది. భూమి, తనస్వదేశం, ఎక్కడో కిందవుంది. ఎప్పటికీ మంచుతో కప్పబడి వుంది.